సరస్వతీగ్రంథమండలి : ౫౪

# పతిపూజ

(శ్రీ సురేశ చంద్రదెవానాన భట్టాచార్య)

అనువాదకుడు:

"కవిరాజహంస — కవికులాలంకార"

## శ్రీ వోలేటి పార్వతీశము

(శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు)




పబ్లిషర్సు: అడ్డేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# ఉపోద్ఘాతము

కేవల మింద్రియ సుఖలాంపట్యముచే దిగ్భ్రాంతలై దారితప్పి పోవు యువతీమణులు ప్రకృత విద్యావిధానము వలననో, హృదయ దౌర్బల్యము వలననో, మతి యేయితర కారణముల వలననో భర్తల యెడల ననాదరము వహించి పతిశుశ్రూషా విముఖలై తత్ఫలముగా జీవితకాలమంతయును బతిసుఖవిహీనలై పరిభ్రమించుచున్నారు. అట్టి వారి భర్తలుకూడ జీవచ్ఛవములై మర్మవేదనలచే వేగుచు నిహ జగంబుననే నరకయాతనల ననుభవించు చున్నారు. అట్టి దంపతుల సంసారములు దాంపత్య సుఖవిహీనములై ధ్వస్తములై సామాన్యుల దృష్టులకుఁగూడ నికృష్టములై సమాజపార్శ్వమునఁ బతితములై పోవు చున్నవి.

కాని సతీమణు లగురమణులు పతిదేవతా నిరంతరారాధనమును విడువక, పతిమంత్రమును జపించుచుఁ బతిమానస పూజయందే యాత్మ ప్రాణ మనంబుల నర్పించి స్వధర్మ నిర్వహణముం గావింప గలిగినచో భర్తలెంతటి దుశ్చరితులైనను వారి జీవన్మృత ప్రకృతులకు మరల మానవత్వమును దేవత్వమునుగూడ సిద్ధింపఁజేయుటకు సమర్థురాండ్రు కాఁజాలియుందురు.

అట్టి యొక సతీరత్నము ప్రకటించిన యాత్మజీవిత చరిత్రము ననుసరించియే యీ పతిపూజ రచింపఁబడినది. దీనిని వంగసారస్వత రంగమున వెలయించినవారు వంగ కవితావిశారదులగు శ్రీ శ్రీ శ్రీ సురేశ చంద్రమోహన భట్టాచార్య వేదాంత శాస్త్రులవారు. ఇది యీ యుత్తమ గ్రంథమున కాంధ్రానువాదము.

దీనిని బఠించిన తరుణీ తరుణలలో గొందఱైన సారాంశమును

గ్రహించి దాంపత్యస్నేహ మధుర సుధారససేవనమున సదానందాను భవముం గాంచుటకీ యుత్తమమార్గము సదాచరణీయమైనదని యంగీకరింపఁ గలిగినచో మా యీ పరిశ్రమము చరితార్థము కాఁగలదు.

అనువాదకుఁడు.

## ప్రకాశకుల విన్నపము

కవిరాజహంస, కవికులాలంకార శ్రీ ఓలేటి పార్వతీశము (వెంకట పార్వతీశ్వరకవులు) గారు జగత్ప్రసిద్ధులైన సాహిత్యారాధకులు. వసుమతీ వసంతము, ప్రమదావనము మొదలైన నవలలు, ఏకాంతసేవ మొదలైన పద్యగ్రంథములు, అనేక బంగాళీనవలలకు అనువాదములు చేసి ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయముద్వారా, వారు, ఆంధ్రవాఙ్మయమునకు కలిగించిన ఉన్నతి చరిత్రప్రసిద్ధము కాఁగలదు.

వయస్సు మళ్ళినను, ఆరోగ్యము సరిగా లేకున్నను నేటికిని వారవ్యాహతముగాఁ రచన సాగించుచునే యుండుట ఆంధ్రులకు ఆనంద కారణము.

చిరమైత్రిని పురస్కరించుకొని కోరిన వెంటనే నాకు మా కిది అనువదించి దయచేశారు. బంగాళీభాషలో ఈ గ్రంథమునకు మిక్కిలి ఆదరము కలదు. ఆంధ్రభాషలోను ఇది ప్రశంసాపాత్రము కాగలదు. వస్తుతః ఉత్తమమైన యీనవలకు శ్రీ పార్వతీశముగారి అనువాదము మహోత్తమత్వము సంఘటించినది.

శ్రీ పార్వతీశముగారు ఇట్లే మా కింకను మఱికొన్ని నవలలు, అనువదించి దయచేసి యున్నారు. అవియును త్వరలోనే ప్రకటించుచున్నాము. పాఠకలోకము యథాపూర్వముగ, సరస్వతీ గ్రంథమండలి నాదరింపగలదని నమ్ముచున్నాము.

శ్రీ పార్వతీశముగారికి మా కృతజ్ఞత విన్నవించుకుంటున్నాము.

23 – 11 – 48
రాజమహేంద్రవరము

ఇట్లు
అద్దేపల్లి లక్ష్మణస్వామి

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

# ౧. వి వా హ ము

అప్పటికి నే నెనిమిదేండ్లదానను. అది మాఘమాసము. చలి జగమంతటిని గడగడ లాడించుచుండెను. ఆ శీతార్త ప్రకృతి విషణ్ణ విశాల బాహుద్వయ మధ్యస్థలమం దొకనాఁడు మాయింటిముంగిట నల్లని కంబళులు పఱుపఁ బడియుండెను. అచ్చట సన్నాయి మొదలగు మంగళ వాద్యములు మ్రోగుచుండెను.

అంతకు మూఁడు నాలుగు దినములకుఁ బూర్వమునుండియు, మా విశాల మందిరమంతయు బంధువులగు స్త్రీ పురుషులచే నిండియుండెను. అందు నా యీడుపిల్లలు చాలమంది యుండిరి. నాఁడు పరిచయము మదివఱ కంతగా నాకు లేకున్నను బంధువు లనుకారణమున వారందఱును నాతోఁ గలసిమెలసి తిరుగుచుండిరి. మంగళవాద్యధ్వనులను విని యందఱును మాయింటికి వచ్చుచుండిరి. నలుదెసలు నానాకోలాహల ధ్వనులచే నిండిపోయెను. మంగళవాద్యములతోఁ జాలమంది సువాసినులు వచ్చి నన్నింటిలోనికి దీసికొనిపోయి నాయొడలంతటను పసుపు నలుగుపెట్టి నన్నుఁ బెండ్లికూతుం గావించిరి. అప్పుడు నేను నాకుఁ బెండ్లియనుమాట వినియుంటిని.

ఇట్లు మూఁడుదినములు గాత్రహరిద్రాశుభకర్మ మమేయానందోత్సవములతో గడచిన తరువాత మాఘబహుళత్రయోదశినాఁడు నాశుభ వివాహము యథావిధముగ నిర్వహింపఁబడియెను. విందులతో వేడుకలతోఁ బెండ్లికార్యము లన్నియును శుభసంపన్నములై పరమాహ్లాదకరముగనే జరిగిపోయెను. తప్పక యట్లు జరుగునని యందఱును విశ్వసించియే యుండిరి. ఏమనిన:—మాయత్తమామలు సుఖముగా నున్నారు. మా తల్లిదండ్రులును క్షేమముగా నున్నారు. భాగ్య భోగములయం

దీ రెండుకుటుంబములకు నెట్టిలోపమును లేదు. నేను మాతల్లిదండ్రులకు గారాపుముద్దుపట్టిని! నావివాహము మహావైభవముతో జరిగెననుటలో నాశ్చర్య మేమున్నది? ఇరుపక్షములవారునుగూడ నెట్టిలోపమును జరుగకుండ సాధ్యమైనంతవఱకుఁ గళ్యాణమహోత్సవములను మహాసమారంభముగనే కావించి యుండిరి.

వివాహ మను వెన్నెల తెరవెనుక నెంతటి మహత్తరమైన యుద్దేశమున్నదో యెంతటిహాసశోకము లున్నవో, యెన్ని సుఖ దుఃఖములు, నెన్ని ఫలాఫలములు నెన్నెన్ని వెలుఁగుచీకటులు నెన్నెన్ని జీవనమరణములు నెన్నెన్ని పుణ్యపాపములు నాశ్రయించుకొని యున్నవో నాకప్పుడించుకంతయును దెలయనేలేదు. నే నెవ్వగిని బెండ్లియాడితినో యాతఁడే నాజీవితమునకంతకు నేకమాత్రావలంబనమనియు, నేకైకమార్గదర్శకుఁ డనియు నేనప్పు డెఱుఁగఁ జాలనైతిని. అందుచేతనే నాకప్పు డాతని స్వభావమును గాని చరిత్రమునుగాని, వంశగౌరవమునుగాని తెలిసికొనవలయు ననుసంకల్ప మెంతమాత్రమును గలుగలేదు. కేవల మాపదునేడు వత్సరములుగల పురుషునియెడల నప్పటి నా బాల్యబుద్ధికి బోధపడినంతవఱకు స్వామిత్వమును నాత్మీయతను గాంచుచు, నట్టిభావమును బెంపొందించుకొనుచు సముజ్జ్వలము లగు మణిహేమాలంకారముల విషమభారమును, సర్వాంగకములచేతను భరించుచు, నేదో యొక విధముగా నేనప్పు డానంద విలాస వాహినులలో దేలిపోవుచుంటిని.

తరువాత? — తరువాత నెట్టియెట్టిసంఘటనలు ఘటిల్లెనో, తరువాత నేరమే కష్టసుఖసంభాషణములు వినియుంటినో, తరువాత నెట్టి మంచి చెడ్డలఁ గాంచియుంటినో, తరువాత నెట్టిదారుణబాధల ననుభవించియుంటినో, తరువాత నెట్టి దుస్సహ శోకదావానలజ్వాలలను సహించియుంటినో వాని నన్నిటింగూర్చియు సంపూర్ణముగా స్పష్టముగా మీకు మనవి చేయవలయుననియే యిప్పుడు మీసన్నిధికిఁ జేరియున్నాను.

# ౨. శిక్ష

పూజ్యపాదులగు మా మామగారు కలకత్తాయం దొక భాగ్యవంతుని పక్షమునఁ బనిచేయుచున్నట్లు నేను కొంతకాలమునకుఁ దెలిసికొంటిని. కొంతకాలమునకుఁ దరువాత నాభాగ్యవంతుఁడు మృత్యుముఖపతితుఁ డగుటచే యజమానుని కుటుంబభారమును వ్యవహారభారమునుగూడ మామగారే వహింపవలసివచ్చెను. ఆయనయే పెద్దయుద్యోగియై తక్కిన చిన్నయుద్యోగుల నందఱిని సగౌరవముగ నాదరించుచు వ్యవహారము లను యథోచితముగ సాగించుచుండెను. వారుగూడ నాయనయెడల మిగుల భయభక్తులుగలిగి మెలంగుచుండిరి. మామగారి పరిశీలనము వలన యజమానునికార్యములు సుసంపన్నము లగుచుండుటయే కాక యందువలన మామగారికి గొలదికాలములోనే విశ్వాసపాత్రుఁ డని కీర్తి ప్రతిష్ఠలుకూడ గలిగెను.

అప్పుడు మామగారు తనపుత్రుని గలకత్తాలోఁ దనయొద్దకు రప్పించు కొని యొక యింగ్లీషుబడిలో విద్యాభ్యాసము చేయించుచుండెను. అప్పటికా కుమారునివయసు పదునొకండుసంవత్సరములు — ఆకాలమునఁ బల్లెటూళ్లయం దంత మంచిబడులు లేవు. క్రమముగాఁ గుమారుఁడు పట్టణములో నున్నతకళాశాలయందు విద్యనభ్యసించి గొప్పపరీక్షలయం దుత్తీర్ణుఁడై యశోలాభములం గాంచగలఁడని మామగా రాసించి యుండిరి. కాని తనయుఁడుమాత్రము విద్యాభ్యాసముతోఁ గూడ దుస్సహవాసములను గాంచుచు దుష్కార్యాసక్తుఁ డై పోవుచుండెను.

నా మామగారు మంచి బుద్ధికుశలత గలవాఁడును, కార్యదక్షుఁడు నగుటచే గుమారుని దుర్వ్యాపారములను గూర్చి సులభముగనే గ్రహింపఁ గలిగెను. అందుచే నాతఁడు తనకుమారు నిఁకఁ బట్టణమునం దుంచుట మంచిదికాదని నిశ్చయించుకొనెను. తరువాత నాయన తన

కుమారుని మైమన్‌సింగుజిల్లా విద్యాలయమునందుఁ జదువుకొనుటకై పంపించెను. కాని తుద కందువలనఁ గూడ విపరీతఫలమే సంఘటిల్లెను. కలకత్తాయందున్నప్పుడు కొడుకునకుఁ దండ్రి యేమనునోయని భయమైన నుండెడిది. మైమన్‌సింగువచ్చినప్పటినుండియు నదికూడ లేకుండబోయెను. క్రమముగా నాతని వయసుకూడ బాల్యయౌవన మధ్యస్థ మగుచుండెను. అతఁ డిఁకఁ జదవ లేఖనములను బూర్తిగా విసర్జించి సర్వదా విలాస సాగర తరంగములయందే తేలిపోవుట కారంభించెను. మామగారీ సంగతి యంతయును దెలిసికొని కొడుకునిఁకఁ జదివించుటవలన లాభము లేదని యనుకొనియెను. ఆవెంటనే యాతఁడు మైమన్‌సింగునకుఁ బోయి పిల్లవానిని వెంటఁ బెట్టుకొని యింటికిఁ దీసికొని వచ్చి మహావైభవముతో నాకు సతీశకిని బెండ్లిగావించెను. పెండ్లికాలమునకు సరిగా నా భర్తకుఁ బదునేడేండ్ల వయసుండెనని యిదివఱకే చెప్పియున్నాను.

## 3. వాసనావహ్ని

వివాహమైన కొన్నినెలలు తరువాత మామగారుగారు బౌబజారునందలి యొకవర్తకుని యొద్ద నుద్యోగము నేర్పాటు చేసి "నీవు సాధ్యమైనంత శీఘ్రముగా కలకత్తాకు రావలయును" అని నానాథునకు జాబువ్రాసిరి. ఆయుత్తర మందినంతనే నాభర్తగారు మిగుల నానందించిరి. కారణ మేమన — కలకత్తాకుఁ బోయినచో నాతని వ్యసనవాసనాజ్వాలలకుఁ జాలినంత యాజ్యాహుతి లభింపఁగలదు. అతఁ డెల్లప్పుడు నేవిషయము గూర్చి సంకల్పించుకొనుచుండెనో, దేనిం గూర్చి యాకాంక్షించుచుండెనో యట్టి యాపకాశ మీశ్వరానుగ్రహముచే నిప్పు డాయనకు సిద్ధించెను. మానవుఁడు మనఃపూర్వకముగా దేనిని కోరునో యది తప్పక సిద్ధించును గదా! ఆయన యుద్యోగము వచ్చిన కొలఁదిదినములలోనే కావలసిన పరికరముల నన్నిఁటిని దీసికొని యానందపిసికత హృదయములతో నగు

మొగముతో నిల్లువిడిచి కలకత్తాకుఁ బయనమైపోయి తండ్రిగారు చెప్పిన పనిలోఁ బ్రవేశించెను.

కలకత్తామహానగరము విలాసలాలసులగువారికి మిగుల ననుకూలమగు రంగస్థలమైయుండును. ఆపట్టణమునందలి రాజమార్గము లిరువంకలను మనోజ్ఞములగు నున్నతసౌధములచే విరాజిల్లుచుండును. ఆ భవనద్వారములచెంత రసనేంద్రియమును సంతర్పితముగఁ జేయు వివిధ మధురపదార్థములతో నిండియుండు భక్ష్యముల యంగడులును, నయనహృదయమోహనకరములగు నమూల్యవస్త్రసమృద్ధములగు దుకాణములును చిత్రవిచిత్రములగు దేశవిదేశజ పానరక్షులతో నింపబడిన కొట్లును బంగారమువంటి సంసారమును భగ్నము చేయునట్టియు మానవుని యైహికాముష్మికసుఖసర్వస్వవినాశకరంబులగు పానశాలలును మఱియుఁ బూలదండలచేఁ గప్పఁబడిన నాగుపాములంబోలి రమణీయవసనాలంకారములచే భూషితలగు వేశ్యాపిశాచముల భోగ విలాసములచే నాకర్షితులగు విటసంఘములును, భోగకామినీ బృందములును నిండియుండును. మఱియు నావిధములయుండు నాటకశాలలును ద్యూతమందిరములును వినోద సభాభవనములును బహువిధ సమాజ మందిరములును నెన్నియో యుండును. నాభర్త కేవలము మొదటినుండియు స్వేచ్ఛాసంచారియై యుండెను. అందుపై వంగదేశవాస్తవ్యుడు! అంతే కాక యిప్పుడు కలకత్తానగరనివాసియై యందలి విలాసజాలములచే నాకర్షితుఁడై యెడతెఱుంగక సంచరించుచు నతిత్వరితముగ నధఃపతనముంగూర్చు నసత్కార్యములం గావించుచు గాలక్షేపము చేయుట కారంభించెను.

పాపకార్యములం గావించువారికి ధనాదాయ మధికమగుచుండునని కొందఱు చెప్పుచుందురు. అది సత్యమో యసత్యమో పరమేశ్వరున కొక్కనికే తెలియును. నాకుమాత్ర మది నిజమే యని తోచుచున్నది.

ఏమనిన:— ఈలోకము కర్మభూమియగుటచే బరీక్షామందిరముగదా! ఈకర్మక్షేత్రమున నెవరికార్యములను వారు సత్వరముగ ముగించుకొని కర్మఫలముల ననుభవించి పోవలయును. ధనమునది మహానర్థకరంబగు పాడుమార్గమునందలి పంకిలపదార్థమని బోధ యగుచున్నది. అందుచేతనే పాపపథసంచారి యగు మానవునకుఁ గావలసినంత ధనము లభ్యమగుచుండును. ఆసమయమునందు నానాథునకు విశేషముగ ధనము లభించుచున్నట్లు విని యుంటిని. కాని యాతఁడు తాను సంపాదించిన ధనములో నొక్కకాసైనను నిలువ చేయుటలేదు. అసన్మార్గగామియగు నాతఁ డాధనమునంతను నసత్కార్యములకై తృణప్రాయముగ వెచ్చపెట్టుచుండెను. కాని కేవల మాయన జీతపుసొమ్ము మాత్ర మేనెలకానెలలో దీసికొని వచ్చి సగౌరవముగా మామామగారికే యిచ్చుచుండెను. అందుచేత నామామగారు తన కుమారుఁడు ధనము వృథా వ్యయము గావించి యకార్యములందుఁ బ్రవేశించి యధఃపతితుఁడై పోవుచుండె ననుసంగతి యించుకంతయును గ్రహింపఁ జాలకుండెను. విశేషించి మామగారు పరకార్యభారమును వహించి సర్వదా జాగరూకుఁడై పనిచేయుచుండెను. అట్టివానికి దన కుమారుఁ డేసమయమందెట్టియకార్యమును గావించుచుండెనో వెంటనే తెలిసికొనుట కవకాశమెట్లుండును? ఇదికాక కుటిలబుద్ధిసంపన్నుఁడగు నాస్వామి నిత్యమును రాత్రిపదిగంటల వేళకు సరిగా నింటికివచ్చుచుఁ బ్రభాతకాలముననే లేచి పెద్దమనుష్యునివలె దన కార్యస్థానమునకుఁ బోవుచుండెను. అందుచేతనే మామగారుగాని యింటిలో మఱియెవ్వరుగాని తరుకోటరమునందు దావానలమువలె నానాథుని చరిత్రమునందు పాపాచరణము నిగూఢమై క్రమక్రమముగా వర్ధిల్లుచున్నదని తెలిసికొనఁ జాలకపోయిరి. చెట్టుతొఱ్ఱలోని యగ్నిజ్వాల మెల్లమెల్లగా వృక్షమును భస్మము చేసివైచునట్లే నానాథునిపాపకృత్యములు క్రమముగా నాతనిచరిత్రమును గళంకిత

ముగా జేసివై చుచుండెను. ఒకనాటి కొకనా డాదేవతామూర్తి దానవ మూర్తిగా మాఱిపోవుచుండెను.

## ౪. విపద్వార్త

వైశాఖ జ్యేష్ఠమాసములయం దెండలు విశేషించి యుండును. గావునఁ గార్యక్షేత్రమునందు సెలవు లిచ్చుచుందురు. శరత్కాలమునందుఁ గూడ నట్లే దీపీపూజలకు సెలవులుండును. ఈ సెలవులలో నాభర్త గారు తప్పకుండ స్వస్థానమగు మాగ్రామమునకు వచ్చుచుండిరి. కాని యట్లింటికి వచ్చియుండుట వారికెంతమాత్రము నిష్టముగ లేదనియే స్పష్టముగా వారిలక్షణములనుబట్టి తెలిసిపోవుచుండెను. వచ్చినను పది పదునైదు దినములకంటె హెచ్చుగా నెప్పుడు నింటనుండుట లేదు. ఇంకను గొన్నాళ్ళుండఁ గూడదా యని ప్రార్థించినప్పుడు "నాకక్కడఁ జాల ముఖ్యమైన పనులున్నవి. నేను పోకతప్పదు. ఇతరులయొద్ద నౌకరీ చేయువాని కింట నూరక కూర్చుండుట కవకాశ మెట్లుండును?" అని సమాధానము చెప్పుచుండిరి. మాయత్తగారి కామాటలు నిజముగనే తోచుచుండెను. నేనుగూడ నట్లే విశ్వసించుచుంటిని. అయినను నప్పటి నావయసునుబట్టి యొకటి రెండు దినములైన నాయన నింటియొద్ద నా పుటకు బ్రయత్నించుచుంటిని. కాని యాయన యెన్నఁడును నా కోరికను మన్నించుట జరుగలేదు. నాతోఁ జెప్పకుండగనే పోవుచుండెడివారు. వారు గ్రామములో నున్న కొన్నినాళ్ళలోనైనను నిత్యమును నన్నుఁ జూచి యసహ్యపడుచుండుటయే కాని యొక్కనాఁడైనను నాకు సంతోషముగా మెలంగుటలేదు. అయినను నేనాయనయెడల నెట్టి యపచారమును జేయుటలేదు. ఎట్టియసంతుష్టిని వహించుటలేదు. ఆయన నానాథుఁడు — నా పెనిమిటి — ఆయన నా విషయమున నెట్టి యసద్వ్యవ

హారము గావించుచున్నను నే నాయనను బరమభక్తితోఁ బూజించు చునే యుండవలెను. ప్రేమించుచునే యుండవలెను. సతీమణికి స్వామి యైనను, నిష్టదైవతమైనను ప్రాణేశ్వరుఁడే కదా! ఈ ధర్మమును నేను నాచిన్నతనమునుండియుఁ బ్రాణపదముగాఁ గాపాడుకొనుచుంటిని.

నేను సర్వదా నానాథుని నెన్నియో విధముల నాదరించి పూజించు చున్నను, నాతఁ డొక్కనిమిషము నందు గూడఁ గరుణ జూపుట లేదు. ప్రియమైన యొక్కమాటయైన నాతో సంభాషించుట లేదు. నే నాయన పాదపద్మములం దెంతగా నాత్మసమర్పణము గావించుకొను టకుఁ బ్రయత్నించుచుంటినో, యంతకుఁ బదిరెట్లుగా నాయన నన్నుఁ దన పాదకంటకమువలెఁ ద్రోసివైచుటకుఁ బ్రయత్నించు చుండెను. ఎట్లయిన నన్నుదప్పించుకొని పాఱిపోవుటయే యాయనకు సుఖముగా నుండెను. పాపభయముచేఁ బడిపోవుచుండు మానవులకు మంచి చెడ్డగను చెడ్డ మంచిగను దోఁచుచుండును. ఈయవివేకమున కీనియమము లోక మంతటను వ్యాపించి పరిదృశ్యమాన మగుచునే యున్నది.

రమణీమణికి స్వామియే పరమదైవతము. పరమగురుడు. స్వామి సేవయే సతికిఁ బరమధర్మము; స్వామి గుణకీర్తనమే దివ్యమగు స్తోత్ర పాఠము; ఈధర్మము నే నెఱింగియుండియుఁ గథాకథ నావసరములయం దిప్పుడప్పుడు పతి నిందావచనములను, నీచత్వమును సూచించు నవిధేయ భాషణములను భాషించుచుండు టెందు కనఁగా:— నా హృదయమునందలి దుర్భరమగు దుఃఖానల జ్వాలలను జల్లార్చు కొనుటకు మాత్రమే యని గ్రహించి పాఠకులు నన్ను మన్నింతురు. గాత: పుత్రవియోగముం గాంచినతల్లి యెంత దుఃఖించినను నేని విధముల వ్యాకులహృదయముతో దేవుని దూషించినను దన పుత్రుఁ మరల జీవించి రాఁడని యెఱిఁగియే యుండును. కాని యట్లా విలపింపక యుండఁజాలదు. ఆవిధముగనే నేనును హృదయావేగవ

గురునిందారూపక మహాపాతకమును గావించు చుంటినని యెఱింగి యుండియు నట్టి కార్యమునుండి విరతనై యూఱడిల్లి యుండఁజాల కుంటిని. నామనసు నందలి యాశాలేశ మేమనఁగా:— నా యీక్షీణ దీనకంఠమునుండి వెలువడినకరుణాక్రందనమును, దుస్సహదుఃఖభాజన మగు నా యీ యభాగ్య చరిత్రమును నాలకించి నావలెనే దురదృష్టవంతు రాలగు నేరమణియైన సధఃపతితుఁడై పోవుచున్న తన నాథుని పాప పథమునుండి యుద్ధరింప గలిగినచో నా యీ దీనచరిత్రము నక్షర రూపముగఁ జేసిన నాపరిశ్రమ చరితార్థము కాగలదనియే.

## ౫. ప్రకృతి శిక్ష

మా పెండ్లియైన తరువాత మూఁడు నాలుగు సంవత్సరముల వఱకు నాదినము లీవిధముగనే కడచిపోవుచుండెను. నాభర్త కేవలమును వ్యభిచారమునందాసక్తుఁడై యిట్లే స్వేచ్ఛగాఁ గాలక్షేపము చేయుచుండెను. నామామగారుగాని, నా యాత్మబంధువులుగాని యీ విషయమును గూర్చి తెలిసికొనుట లేదు. ఒకవేళ నెవ్వరికైన నించుక కంటఁబడినను, లోకులవలన నీసంగతి కొంచెము తెలియవచ్చినను నదియొక సామాన్య విషయ మనియు, క్రమముగా వానికే తప్పు తెలియవచ్చుననియు భావించి యుపేక్ష చేయుచుండిరి. కాని ప్రకృతిమాత్రము వ్యభిచారము నకు దగినశిక్ష చేయక క్షమించి యూరకుండునది కాదు. ఎంత నిగూఢముగ వ్యభిచరించువాఁడైనను, ప్రకృతిశాసనమును దప్పించుకొనఁ జాలఁడు. అట్లే నాస్వామియు బ్రకృతి దండముచే దండింతుఁడు గాక తప్పలేదు. కలకత్తాయందాయనకు భయంకరమైన జ్వరము తగిలెను. అప్పటినుండియు నాతఁడు కాసరోగముచే బాధ పడుచుండెను. క్రమ క్రమముగా నాతనిసర్వాంగకములును శుష్కించుట కారంభించెను.

ఆయవస్థలో నామామగారాయన నింటికిఁ బంపక కలకత్తాయందే యుంచి యానగరమునందలి వైద్యులలో ప్రఖ్యాతచరిత్రుఁడగువానిచేఁ గుమారునికి చికిత్స చేయింప నారంభించెను. రెండుమాసము లట్లు వైద్యమును జేయింపగా జాలవఱకు జ్వరము తగ్గిపోయినది; దగ్గుమాత్రము పోలేదు. తరువాత కొన్నాళ్లవఱకును మిగులశ్రద్ధగా జికిత్స చేయించిరి గాని రోగముపూర్తిగా నుపశమింపలేదు. అప్పుడు మామగారాయనను కలకత్తానుండి యింటికి దీసికొని వచ్చిరి.

ఎడారిమధ్యమున ప్రయాణముచేయుచున్న పథికుఁడు కరాళవైశాఖనీరమణియుత్సంగమునందలి దారుణాశనిజ్వాలంగాంచి యెట్లదరిపడి తల్లడిల్లిపోవునో యట్లే నేను నానాథునిం గాంచినంతనే భయభ్రాంతురాల నైపోయితిని. మాఅత్తగారును మాయాత్మీయులగు బంధువులును యిరుగుపొరుగువారునుగూడ నాతనివాలకముం జూచి భయవిహ్వాలులైరి. ఆతనిశరీరమునఁ దెడ్డెడుమాంసమైన లేదు. కేవలమును జర్మము నెముకలుమాత్రమే యగపడుచుండెను. ఇంతటి భయంకరమగు జబ్బుచేసి యిన్నినాళ్లు పీడించుచున్నను మాకించుకంతయేని దెలుపకుండుటకుఁ గారణమేమని యందరును మామామగారిని నిందింప నారంభించిరి. ఏమైననేమి! మాయింటివారమందఱము నాతనికి మనోవాక్కాయకర్మములచేఁ గావలసినయుపచారములఁ గావించుచుంటిమి.

మానవుఁ డెంచుకంతపాపమున కాశ్రయ మిచ్చినచో నాతఁడు తన సర్వస్వమును గ్రమముగాఁ బోఁ గొట్టుకొనక మానఁడు. అట్లు పోగొట్టుకొన్నవానిని మరల నెంతప్రయత్నము చేసినను సులభముగా సంపాదింపఁ జాలఁడు. జ్ఞానమనునది మానవమాత్రులందఱికినిగూడ నీశ్వరానుగ్రహమున లభించియేయున్నది. ఎవ్వఁ డాజ్ఞానము ననుసరించి కార్యనిరతుం డగునో, జ్ఞానులయనుభవముచేఁ బ్రబోధింపబడిన శాస్త్రాదుల నధ్యయనముగావించునో, జ్ఞానధనుల యుత్తమకార్యకలాపము ననుసరించునో

యట్టివానికి జ్ఞానోన్నతి యగుననియు, నేమానవుఁడు తనజన్మలబ్ధమగు జ్ఞానము గలిగియుండియు మూఢునివలె నకార్యములు నాచరించునో లోభమోహాదిశత్రువులకు వశుఁడై చేయరానిపనులు చేయుచుండునో దుర్జనసాంగత్యము దుర్గ్రంథపఠనము గావించుచు దుష్పథమును బట్టి పోవుచుండునో యాతఁడు క్రమముగా నజ్ఞానమును వర్ధిల్లఁజేసికొనుచు జ్ఞానధనమును బోగొట్టుకొనుచుండు ననియును నట్టివానినే లోకు లందఱు నజ్ఞానిగను, దుర్బుద్ధిగను బరిగణించుచుందు రనియు నేను గ్రహింప గలిగితిని. మానవుఁడు తనకున్న జ్ఞానమును దానే పోగొట్టుకొన్నచో నిఁక నది యెందు వెదకిన లభించును? లోకములోఁ గొందఱు జ్ఞానము నుద్దేశించి జ్ఞానముకొఱకే యన్వేషించుచుందురు. మఱికొందఱు అజ్ఞానము నుద్దేశించియజ్ఞానమునే వెదకికొనుచుందురు. లోకమునం దెవ్వరు దృఢసంకల్పముతో దేనినిగూర్చి ప్రయత్నించుచుందురో దానినే వారు పడయుచుందురు. జ్ఞానముం గోరువారికి జ్ఞానమే లభించును. అజ్ఞానము నాకాంక్షించువారి కదియే లభించును. ఎవ్వఁడజ్ఞానమునఁ బడిపోయి యొకసారిగా జ్ఞానధనమును బోఁగొట్టుకొనునో యాతఁడు మరల నాజ్ఞానరత్నరాశిని బడయఁజాలఁడు. అతఁడు నిరంతరము నతి దారుణంబగు నజ్ఞానతమోనిద్రానిమగ్నుఁడై యధఃపతితుఁడగుచుండును.

మానవుఁడు దేనిని గోరుకొనునో దానినే పడయఁగలుగును. ఇందు బరమేశ్వరుని దోష మేమున్నది? ఎవరిదోషమును వారే కొని తెచ్చి కొనుచుందురు. ఎవరెట్టి కర్మముల నాచరింతురో వారట్టి ఫలములనే యనుభవించు చుందురు. అజ్ఞానమే యజ్ఞానికి దుర్బుద్ధిం గూర్చును. ఆతఁడు క్రమముగా దుర్మార్గమునే యనుసరించి పోవుచుండును. అట్టి యజ్ఞాని యెన్నఁడును సుఖముఖ సందర్శనమును జేయఁజాలడు. ఆతఁడు తన దుర్బుద్ధికి ఫలముగా బ్రతికియున్నంత వఱకును నరకబాధల ననుభవించుచుండును. మూఢునాళ్ళు ముచ్చటకై మానవుఁ డమృత

మును బరిత్యజించి విషపానము గావించి చచ్చువఱకును దారుణ యాతనలకు లోనై దుఃఖపడుచుండును. శలభము రూపమోహముచే ముగ్ధమై అనలజ్వాలలయందు దుమికి మరణమును గోరి తెచ్చు కొనును. మానవుఁడుకూడ నట్లే పాపవాంఛలకు లోభించి సర్వ నాశనము గావించు కొనుచుండును. అప్పు డాతనికి లేశమాత్రమైనను జ్ఞానమనునది యుండదు.

నాభర్త యట్టి యజ్ఞానమువలనఁ బాపపథము ననుసరించుటచే యింతటి ప్రాణసంకటము సంభవించి మంచముపట్టి క్షణక్షణ మృత్యు భయమయంబగు దుష్టరోగముచే జీర్ణ విదీర్ణ శరీరుఁడై యస్థిమాత్రావ శిష్టుఁడై యుండియు నింకను బాపదూషితంబులగు దురాకాంక్షిత ములనే తనమనంబున వర్ధిల్ల జేసికొనుచుండెను. ఆతఁ డింకను మోహ ముగ్ధుఁడై పాపమార్గ సహచరులగు నరనారీజనంబులం గూర్చియుఁ గృత్రిమానంద దాయకంబులగు తేయపత్రికలం గూర్చియునే తలంచుకొనుచు నుత్సుకుఁ డగుచుండెను. ఒకనాఁటికొకనాఁ డాతని జీవితాశ నుండలించుచున్నను, విలాసవిహారముల యందలి యాశయు, పాపకార్యము లందలి యాశయు, దుస్సాంగత్యమునందలి యాశయు గ్రమక్రమముగా వర్ధిల్లుచునే యుండెను.

ఆతని శరీరావస్థం గాంచి నిరంతరము నాప్రాణము శుష్కించి పోవు చుండెను; ధైర్యము బెదరిపోవుచుండెను. కాని యాతని నడవడింబట్టి నేనేమియు ననుట కవకాశము లేనిదాననై యూరకుండవలసిన దాన నగుచుంటిని. ఆతఁ డేనాటికానాఁడే కలకత్తాకుఁ బోవలయు నని తొందర పడుచుండెను. ఇంటిలో నెవ్వరితోడను జనవుగా సంచరించుట లేదు. విశేషించి నన్ను విషదృష్టులతోనే వీక్షించు చుండెను. నేను త్రికరణశుద్ధిగా నిరంతరము నాతని సేవించు చుంటిని. కాని యాతఁడు మాత్రము నన్ను వేఁటకుక్కనుంబోలె దూరదూరమునకుఁ దరిమి

న్నైచుచుండెను. నేనాతని మంచముకడ దూరముగఁ గూర్చుండి యెన్ని రాత్రులు లోకనిమిత్తమైన నిద్రయనుమాట యెఱుంగక కన్నీటితోఁ గడపితినో, వేడికన్నీటిచే ధరణీవక్షము నెంతపంకిలముగాఁ జేసితినో పరమేశ్వరునికే యెఱుక. ఇట్లు సేవించుచున్నను నాకాతని చీవాట్లును, తిట్లును దప్పుట లేదు. ఏమైననేమి నేనాతని యత్యాచారములును, అనాదరములును, కటూక్తులును సహించి నిత్యమును భక్తితో నాతని యెంచుచునే యుంటిని. ఏమనిన:— నాకాతఁడు ప్రత్యక్ష దైవతము: ఆతనిజీవితముకంటె నానమస్తసుఖసౌభాగ్యములు నాధారపడి యున్నవి.

కాని నా నాథుఁడు కలకత్తానగరమునందు విలాస సాగరతరంగములలోఁ బడి కొట్టుకొని పోవుచున్న సంగతిగాని, మోసకత్తెలగు నారకాంతల పాపబాహుబంధములలోఁ జిక్కుకొని యల్లాడుచున్న సంగతిగాని, మద్యపానాదులచే దినదినము దుశ్చరిత్రుఁడై పోవుచున్న సంగతిగాని నాకప్పు డెంతమాత్రమును దెలియదు. కాని యేకారణముచే నిట్టియవస్థ కలిగినది? ఎందుచేత నీ కుసుమోద్యానమునఁ గంటకవృక్షము లు విస్తరించినవి? వేయి గన్నులతోఁ గాచి పెంచుకొనుచున్న యందర మందిరారామమున నగ్నిజ్వాల లెట్లు పుట్టినవి? ఇట్టి సంశయములు నా హృదయమునఁ గలుగుచునే యుండెను. ఏమైననేమి! నా భర్త యెన్నియో విధముల బలవంతపెట్టుటచే మామగారాతనిని మరలఁ గలకత్తాకు వెంటఁబెట్టుకొని పోయెను. నిర్భాగ్యురాల నగు నేనుమాత్రము మృతసమానుఁడగు నాస్వామి వియోగమును భరింపఁజాలక యెట్టి దుఃఖముతో దినములు గడుపుకొనుచుంటినో, యంతర్యామి యగు భగవానుని కొక్కనికే యెఱుక! ఇంతేకాక — అతిమలినంబును, విషాదచ్ఛాయామయంబును, చింతాక్లేశ విశిష్టంబునగు నా మొగమును నిరంతరమును గాంచుచుండిన మా యత్తగారికి గూడ నాదుఃఖ మించుక తెలిసియుండవచ్చును. శోభావిహీనంబులగు నా

కన్నులలో నా హృదయము ప్రతిఫలించి నా దుఃఖవార్తల నాపె కెప్పుడును నివేదించుచునే యుండగా నాపె యెట్లు గ్రహింపకుండును!

# ౬. క టూ క్తు లు

మానవుఁడు కేవలమింద్రియలోలుఁ డై పోయినప్పుడు హితాహిత జ్ఞాన మాతని కెంతమాత్రము నుండదు. ఆతఁడెల్లప్పుడును జీవితాశకూడ వదలుకొని యింద్రియపరితృప్తిం గావించుటకే సర్వవిధముల బ్రయత్నించుచుండును. నానాథు డప్పుడు కేవల మింద్రియలాంపట్యముచే నల్లాడిపోవుచుండెను. ఆతఁడుకూడ నప్పుడు తనజీవితనాశ కాలసాగరమునందు మునిగి పోవుటకుఁ దగినపాపకృత్యములనే నిరంతరమును గావించుటకుఁ బ్రయత్నించుచుండెను. అట్టి యవస్థలో మా మామగా రాతనిని గలకత్తాకు మరల దీసికొనిపోయి చికిత్సను జేయించుచుండెను. పుత్రునియందలి ప్రేమచే నాతఁ డెంతధనము వ్యయమైనను లెక్కచేయుటలేదు. తన కుమారుని ప్రాణజ్యోతి యెంత కళావిహీనమైపోవుచున్నదో యంతభయముతో నాతఁడు గంగాజలముంబోలి ధనమును వెచ్చించి గొప్పగొప్ప వైద్యులచేఁ గుమారునకు వైద్యము చేయించుచుండెను. అందువలన నానాథున కించుకంతయారోగ్యము కలుగుచుండెను. క్రమముగా నాతఁడు తనయుద్యోగమునందుఁ బ్రవేశించి సాధ్యమైనంతవరకు బనులు చేసికొనుట కారంభించెను. కాని యాహారవిహారాదులయందు నియమమును పథ్యపానాదులయందు శ్రద్ధయును లేకుండుటచే రోగము పూర్తిగా గుదురుట లేదు. అప్పు డప్పుడు మామగారు "అబ్బాయికిఁ గ్రమముగా నారోగ్యము కలుగుచున్నది. భయము లేదు" అని జాబులు వ్రాయుచుండెను. ఆవార్త నాలకించి నేను మనసునందే యానందించుచు దయామయుఁడగు భగవానునకు

ధన్యవాదముల నర్పించుచుంటిని. నేను రహస్యస్థలమున కూర్చుండి యశ్రుసిక్తనయనములతో నిర్దుష్టంబులును భయచంచలంబులు నగు చూపులతో నాకసమువంకఁ దిలకించుచుఁ గృతాంజలినై పరమేశ్వరుని కృపాకటాక్షము నర్థించుచూ "ఓదయామయా: ప్రభూ: నాశంఖసిందూరములు నిలుచున ట్లనుగ్రహింపుము. ఈ విపిత్సాగరమునందు నాకు నీకంటె దిక్కు మరియెవ్వరున్నారు." అని ప్రార్థించుచుందును.

వైశాఖమాసము వచ్చినది. మాపల్లెటూరి యందు బ్రకృతిదేవి నూతనాలంకారములచే భూషితయై విరాజిల్లుచుండెను. తరులతలు ఫలపుష్పాదులచే నవనతములై యుండెను. ప్రతిశాఖయందును గల విహంగములు గానము చేయుచుండెను. ఆకసమునందు నవాంబుదములు వివిధాకృతులతో విహరించుచుండెను. అట్టిదినములలో నొక నాఁటి సాయంకాలమున కించుక ముందుగా నాభర్త కలకత్తానుండి మాయూరికి వచ్చి మాగృహము నలంకరించెను. ఆతని శరీరావస్థ యించుక బాగుగనే యున్న ట్లగపడుచుండెను.

తీవ్రవాహినినుండి కొట్టుకొనిపోవుచున్న చిన్నచీమ యాప్రవాహము నందలి యొక చిన్నగడ్డిదుబ్బు నాశ్రయముగా బడసినంత మాత్రమున నించుక జీవితాశను వహించినట్లె నాకును నట్టియాశ కలిగెను. కాని యాచీమ కా గడ్డిపరక దొరికినంత మాత్రమున దాని యాధారముచే నది యొడ్డును జేరఁగలదా? అంతమాత్రమున నట్టియవకాశము లభింపదను విచారము చీమను బాధించుచునే యుండును. నాకుఁగూడ నట్టివిచారమే యుండెను. నాభర్తయెట్లు సంపూర్ణముగ నారోగ్యవంతుఁడై, శక్తిమంతుఁడై, తేజస్వంతుఁడై నాకన్నులఁ దనియించునో యనునాశ నాహృదయమంతటను నిండియుండెను. ఆయన వచ్చునప్పుడు కలకత్తానుండి మందులనుగూడఁ దెచ్చుకొని యుండెను. ఆ మందుల నాతఁడు నిత్యమును సేవించుచుండెను. ఈవిధముగ గొన్ని

దినములు గడచెను.

ఆ సమయమునం దొకనాఁడు మా దేశస్థుఁ డొకఁడు మాయింటికి వచ్చి నానాథుని శరీరావస్థను బరీక్షించి "ఈతఁడు కొన్ని దినముల వఱకును బూటకు మూఁడుచొప్పున దులసిచిగుళ్ళను సేవించినచో సంపూర్ణముగ నారోగ్యవంతుఁ డగును" అని చెప్పెను. కాని యాపని యెవ్వరు చేయుదురు? విష్ణుదేవుని పూజకు దక్క నే యితరోపయోగమునకైనను దులసి చిగుళ్ళను ఛేదించుట మహాపాతకముగదా? అందుచే నట్టి పాపకృత్యముం గావించుట కెవ్వరు నంగీకరింపరైరి; కాని నేనుమాత్ర మూరకుండఁ జాలక పోయితిని. ఆయనకు సహజముగా నారోగ్యమే కలిగినచో, రోగక్లిష్టమగు నాయన శరీర మెప్పటివలె తేజస్వంతమే కాఁజాలినచో, వ్యాధిసంపాద విపాండురం బగు నాయన యధరము మందహాస రేఖాంకితము కాఁగలిగినచో - నేను తప్పక యట్టి కృత్యమును గావించుటలో దోషమేమున్నది? నాస్వామి నా ప్రత్యక్షదైవతము — నా ప్రాణప్రియుఁడగు శ్రీకృష్ణుఁడు; ఆతని తృప్తి కొఱకు నేను తులసీచయన మాచరింపఁ గూడదా? తులసీదేవి శిరశ్ఛేదమే యగుఁగాక? అయిననేమి? "తస్మిన్ తుష్టే జగత్తుష్టి —" అన్నట్లు ఆయన యారోగ్యమే నాసర్వస్వమును — అట్టి నాస్వామి కొఱకు నేను తులసీచయనము గావించినంత మాత్రమునఁ దదధిష్ఠాన దేవతయగు శ్రీమతి బృందాదేవి నన్నేల శపించును? నేను ప్రతిదినమును దులసీ వనమధ్యమునఁ జేరుకొని చేతులు జోడించి నమస్కరించెదను — క్షమాప్రార్థనమును గావించెదను. ఎందుకొఱకు? నాప్రాణేశ్వరుఁడగు స్వామికొఱకు — నా యిలువేలుపగు శ్రీమన్నారాయణుని కొఱకు — "అమ్మా! నీపల్లవముల ద్రుంచు చుంటి నని నీవు నాపైఁ గోపగింపకుము; నీ వెట్టులైన నాయం దనుగ్రహించి నానాథుని కారోగ్యమును శాంతిని గలిగింపు" మని భయభక్తి వినయములతోఁ

ప్రార్థించెదను.

నే నిట్లు దినదినమును దులసీదేవిని ప్రార్థించుచుఁ దులసీదళములను గోసి తెచ్చి నాభర్తచే సేవింపఁజేయు చుంటిని. ఆయనకు కలకత్తానుండి తెచ్చుకొన్న యౌషధమునుగూడ నిచ్చుచుంటిని. కాని రోగము మాత్ర ముపశమించుట లేదు. ఇంతేకాక యాతఁ డెల్లప్పుడును, విరక్తుఁడగుచు, క్రోధముచే మండిపోవుచుండెను. విశేషించి నా యెడలనే యావిరక్తి! నాయందే యాక్రోధము: మనోవాక్కాయములచే నేనెంతగా నాతని కుపచారములఁ గావించుచుంటినో యంతకంటె నధికముగా నాతఁడు నన్నొల్లని దాసినలెను, కుక్కవలెను ననాదరించుచుఁ దనసన్నిధినుండి దూరముగఁ దన్నివైచుటకుఁ బ్రయత్నించుచుండెను. నిత్యము నన్నాతఁ డేదోయొక విధముగాఁ దిట్టి కొట్టుటయే యాతని కానందముగా నుండెను. సిర్భాగ్యురాల నగు నే నట్టి సమయములందు "ఆయనకేమిచేసిన నానందముగ నుండునో యట్లే చేయనిమ్ము!" అని మనస్సమాధానము చేసికొనుచుందును. కాని నిరంతరము నంతటి తీవ్రములగు కటూక్తులను సహింపఁ జాలక యొక్కొకప్పు డేకాంతముగ నొకమూలఁ గూర్చుండి యేడ్చుచుందును. మరల నాయంతన నేనే మనసు కుదురుపఱచుకొని "వ్యాధిగ్రస్తు లగువారి స్వభావమే యీ విధముగా నుండును. ఇది యాతని వ్యాధిలక్షణమే కాని నాయందు నిజముగా నంతకోపమొందుటకు!" అని భావించుకొని సంతృప్తి పడుచుందును.

క్రమముగా నాతని కారోగము వర్ధిల్లుచుండెను. విశేషించి రాత్రి కాలములందు సహింపరానంతటి ప్రబలముగా నాతనిఁ బీడించుచుండెను. నిశ్శబ్దమగు నర్ధరాత్రి వేళ, నితరులొక్కరునులేని పడకటింటి యందు బ్రకాశించుచున్న దీపపువెలుఁగున శయ్యపైఁ బడియున్న జీర్ణరోగ పరిశీర్ణంబగు నాతని శుష్కశరీరము కాసరోగముచే దగ్గలేక,

దగ్గలేక మూర్ఛావసన్నం బగుచుండ నాతని మంచముచెంతఁ బాద తలమున నొంటిగఁ బడియున్న నే నా దృశ్యముంగాంచి మర్మాంతికం బగు నెంతటి దుఃఖవేదనల ననుభవించితినో యంతర్యామియగు శ్రీ భగవానుఁ డొక్కఁడు దక్క నితరు లెవ్వరెఱుంగుదురు? ఆయన యవస్థం జూచి నిరంతరము నశ్రుజలము నా కన్నులనుండి ధారా రూపమునఁ బ్రవహించుచు నా హృదయమును దడిపివైచుచుండెను. ఒక్కొకప్పుడు నేను "ఈ రోగము నాకేల కలుగఁ గూడదు? ఇట్టి దారుణ బాధ లను బడలేక నేను మరణించినను నీలోకమునందు నాకొఱకు కేడ్చువా రెవ్వరుందురు? కాని నా స్వామి యింతటి కష్టముల ననుభవించు చుండఁగా నే నెట్లూరక చూచుచుండఁగలను?" అని విచారించుచుందును.

జీర్ణించిన రోగము! రాత్రులు నిత్యమును జాగరణమే. నాకించుక సాయపడవలెనని యింటిలోనివా రెవ్వరును బ్రయత్నించుట లేదు. నేనే యాతని మంచముచెంతఁ బడియుండి యుపచరించుచు రాత్రు లన్నియు వేగించుచుంటిని. అయినను నాభర్త నాయవస్థం జూచు చుండియు నన్నుఁడు నొక్క మంచిమాటైన నాడుట లేదు సరిగదా - ఏమాత్రపు పొరఁబాటు కలిగినను నోటికిరానితిట్లు తిట్టుచు నన్ను బాధించుచుండును. ఒక్కొక్కనాఁడు గదినుండి యావలికిఁ బొమ్మని యదలించుచుండును. నేనట్లు పోలేదని యెన్నియోతిట్లు, ఎన్నియో తీవ్రభయభావ ప్రదర్శనములు గావించి కసరుచుండును. కాని నేనాయన నెవ్వరి కొప్పగించి పోవుదును? రాత్రి యంతయును మేలుకొని యాతని కుపచారము లెవ్వరు చేయుదురు? ఒకవేళ నెవ్వరైనఁ జేసినను నే నాయనను విడిచిపోవుట యెట్లు? మానవజన్మ మెత్తినందుకు విధాయ కర్మము నిర్వర్తింపవలయును. రమణీ ధర్మములందు శ్రేష్ఠవ్రతము స్వామిసేవయేకదా! అట్టి వ్రతమునకు విఘ్నముంగూర్చు సామాన్య ములైన నాథుని కఠోర వాక్యములనే సహింపఁ జాలకున్నచో నేను

భారతమహిళనై హిందూదేశమునం దేల జన్మింపవలయును! బ్రదుకు నందును, చావునందును, స్వప్నమందును, జాగరమునందును, ఆదరమునందును, ప్రతారణము నందును, స్వామిసేవయే యేకమాత్ర స్వధర్మ మని హైందవరమణి యొక్కతెయే యెఱుంగును!

## ౭. దైవవాణి

దినములపై దినములు గడచిపోవుచుండెను. నానాథుని జబ్బుకూడ శరీరమునవ్యాపించి వర్ధిల్లుచుండెను. ఆయన యిటునటు తిరుగుచునే యుండెనుగాని పనిమాత్రము చేసికొనఁజాలకుండెను. రోగము జీర్ణించిన వారి యవస్థలో నాతఁడాయాసపడుచుండెను. దగ్గువచ్చుచునే యుండెను. ఆయనకు నామీఁది కోప మొంతమాత్రమును తగ్గుటలేదు. నాయెడల ననాదరమును, నన్నుఁగూర్చి దుర్భాషలును క్రమముగా హెచ్చిపోవుచుండెను. ఆయన యట్లు ప్రవర్తించుటకుఁ గారణ మేమో నాకించుకంతయును బోధపడుటలేదు. ఆయనసంతృప్తిఁగోరి నేనుచేయుచున్న యుపచారములుగాని, సేవలుగాని, సంభాషణములుగాని యాతని హృదయమును మండించుచుండెను. ఎక్కడలేని క్రోధమును దెచ్చుకొని యాతఁడు నన్ను నోటికిరాని తిట్లు తిట్టుచుండెను. నేను బాగుగ నలంకరించుకొని మంచిదుస్తులను ధరించి యెదుట నిలిచినచో నాయెడల నెన్నియో దోషములను గల్పించి నన్నుఁ గటూక్తులతో బాధించుచుండును. నేను నిరలంకృతనై చినిఁగిన బట్టలతో నెదుటఁ బడినప్పుడు చూచి నన్ననేకవిధముల నపహసించుకొనుచు "నాయెదుట నిలువక యావలికిఁబొమ్ము" అనిగద్దించుచుండును. నవ్వినను దిట్లే — ఏడ్చినను దిట్లే — నే నెట్లున్నను నాకాతని దుస్సహదుర్భాషణములు తప్పుటలేదు.

భర్త యాదరించుచున్నప్పుడే యింటివారందఱు నాదరించి గార

వించుదురు. భర్తృసాల్లభ్యమును బడయఁజాలని నిర్భాగ్యురాలిని దాసదాసీజనముకూడ లోకువఁగాఁ జూచును. ఇరుగుపొరుగువారు కూడ నామెను గౌరవించి మాటాడుట కిష్టపడరు. ఆమె యెంతటి సౌందర్యవతియైనను నెంతటి నీతిమంతురాలైనను నెంతటి ధర్మాత్మురాలైనను నేమిలాభము? అందఱు నామె నసహ్యించుకొనుచునే యుందురు. అందఱు నామెను శతాపరాధములు చేసినదానివలెను లోకమునందలి పాపములన్నిటిని సంగ్రహించి యిందఱిని బాధించుటకై యింటికి వచ్చినదానివలెను రేయుంబవళ్లితరుల కేదియో యనిష్టముం గల్పించుటకే ప్రయత్నించుచున్న దానివలెను జూచుచుందురు. అందుచేతనే యిట్టినిర్భాగ్యురాలి నెవ్వరును బలుకరింపరు. ఎవ్వరు నాదరింపరు. ఆమె యందఱకిని బరిత్యాజనీయురాలు. అంతేకాని పాపురాలను భర్తృవాత్సల్యముం బడయఁజాలక దుఃఖానలముచే హృదయము దగ్ధమగుచుండ నెట్లు బాధపడుచుం గాలము గడపుచున్నదో యని యెవ్వరును జాలిపడరు. అట్టిదురదృష్టము నాకొక్కతెకే కలిగినది. నాస్వామి నన్నాదరించుటలేదు. ఎప్పుడును దుర్భాషలచే నన్ను నిందించుచుండెను. అందుచేతనే మా యింటివారందరు నన్ను నిరాదరించుచుండిరి.

ఒకనాఁటి యొక సంఘటనముంగూర్చి యిచ్చట మనవి చేయుచున్నాను — అది వేసవికాలము. అప్పుడు నాకు రెండు ముదుకచీరలను గొనియిచ్చిరి. మగనికి నయనకంటకమునై యత్తమామల యనాదరమునకు పాత్రురాలనై యున్న నాకప్పు డింతటిజ్ఞానముకూడ లేదు. బాలికాసులభంబగు చపలబుద్ధిచే నేనప్పుడు "ఈచీరలు వేసవికాలమున గట్టుకొనఁ దగినవి కావు. శీతకాలమున నుపయోగించుకొందును" అని యంటిని. ఈసామాన్యాపరాధమునకే, యెన్ని తిట్లు, ఎన్నినిందనములు నెంతగందరగోళమో జరిగినది. ఆమాట

తలంచుకొన్నచో నిప్పటికిని నాహృదయము పగిలి పోవుచుండును. ఆయపరాధమునకు నన్నెన్నిమారో దుర్భాషలచేఁ దిరస్కరించినంత మాత్రమున తృప్తికలుగలేదు. అకటూక్తులవలన శాంతి గలుగలేదు. నన్నావలి కీడ్చినంతమాత్రమునఁగూడఁ దృప్తికలుగలేదు. నాస్వామి దుస్సహక్రోధముతో నన్ను జావఁగొట్టి "ఈయిల్లు విడిచి నీయిచ్ఛ వచ్చినచోటికి బొమ్ము!" అని నన్ను గెంటివైచెను.

మాయత్తవారింటికి కైదండ్ల తరువాతనె మా పుట్టినిల్లున్నది. నేను కిక్కురుమనకుండఁ గన్నీటిచే నాపయ్యెటకొంగు త్రోవను దడుపుకొనుచుఁ బుట్టినింటికిఁ బోయితిని. అక్కడికిఁ బోయి యేమియు నెవ్వరితోడను జెప్పక నాలో నేనే దుఃఖించుచు నొకచోఁ గూర్చుండి నాదురదృష్టముం గూర్చి విచారించుకొనుచుంటిని. అప్పుడు నాకుఁ గన్నీరే తోడు నీడయై యుండెను. ఆయవస్థలోఁ బడియున్న నాయొద్దకు, మా యమ్మయు, నమ్మమ్మయును వచ్చి నేనిట్లు దుఃఖించుటకుఁ గారణముం దెలుపవలయునని మాటిమాటికిని బ్రశ్నింప నారంభించిరి. కాని నేను వారికెట్టి ప్రత్యుత్తరమును జెప్పఁజాలకపోయితిని. ఎంత ప్రయత్నించినను నానోటినుండి మాట వెలువడుటలేదు. దుఃఖముచేతను, క్రోధముచేతను, నవమానముచేతను, లజ్జచేతను, నాహృదయము పగిలిపోవుచుండెను. ధారాపాతమున నెడలుచున్న నాకన్నీరుకూడ నెంతెంతగా బ్రవహించి పోవుచుండెను. పరాభవక్షుభితంబగు హృదయము ప్రబలవేగమునఁ గొట్టుకొనఁ దొడంగెను.

ఇంతలో నాభర్త మాయింటికి వచ్చెను. నేను పుట్టినింటికిఁ బోయి నట్లు మాయత్తగారు చెప్పగా వినియే యాతఁ డిట్లు వచ్చియుండు నని యనుకొంటిని. అప్పుడాతని యాకారము మహాభయంకరముగా నుండెను. బాధితమై కేవల కంకాళ మాత్రావశిష్టమైయున్న యాతని శరీరము క్రోధాతిరేకముచే నిలువునఁ గంపించిపోవు చుండెను, నయన

ద్వయ మూర్ధ్వగతమై రక్తమును జిమ్ముచుండెను. ఆతఁడు చటాలున మాయింటఁ బ్రవేశించి, మా యమ్మతోఁగాని మా మాతామహితోఁ గాని యేమియు మాటాడకుండగనే బలవంతముగ నన్నుబట్టుకొని తన యింటికీడ్చుకొనిపోయెను. ఆఁడుదాననగు నన్నట్లాతఁడు వీధి వెంట నవమానకరముగా నీడ్చుకొనిపోవునప్పు డాతని పట్టు వదలించు కొనుటకు నేనెట్టిప్రయత్నమును జేయలేదు. మాటాడకుండ నాతని వెంటనే యత్తవారింటికిఁ బోయితిని. కాని యింటికివచ్చిన తరువాత గూడ నాతఁ డనేక దుర్భాషలాడుచు బహువిధముల నన్నవ మానింపఁ దొడంగెను. ఆతనితోఁ గలసి మా యత్తింటివారందఱును గూడ నన్నుఁ గటువచనములతోఁ బరాభవించుటలో నెట్టిలోపమును జేయలేదు. దుఃఖావమాన సంక్షోభములచే నా హృదయ ముడికి పోవుచుండెను. అప్పుడు నే నెవ్వరిమాటలకు నెట్టి యుత్తరమును జెప్పక కేవలము కన్నీటినే యాధారముగాఁ జేసికొని యెట్లో యట నుండి లేచి నా శయనమందిరమునకుఁ బోయి తలుపులు మూసికొని మేజాపైఁ బడి యిటునటు దొరలుచు నేడువ నారంభించితిని. దుఃఖ పూరితమగు నా యీ ఘోర దుర్దశను దూరము చేయుమని శ్రీ భగ వానుని చరణకమలములను ధ్యానించి ప్రార్థించుచుఁ గన్నీటి ధార లను విడిచితిని. గద్గద స్వరముతోఁ బరమేశ్వరు నెన్నియోరీతులఁ బ్రార్థించితిని. తరువాత నిరాశ్రయుల కాశ్రయుఁడును, దుఃఖితులకు సహాయుఁడును, అనాథులకు నాథుఁడును, అశాంతులకు శాంతిప్రదా తయునగు యమధర్మరాజు నుద్దేశించి "ఓ కాలదేవా! నీవు నన్నుఁ దీసికొని పొమ్ము! నాథుని నయనద్వయమునకును గంటక స్వరూపి ణియు, నత్తమామల యాదరగౌరవములకు దూరగతురాలును, బంధు మిత్రాదులకు నాత్మీయులకుఁ ద్యజనీయురాలు నగు నిర్భాగ్యురాలికి నీకంటె దిక్కెవ్వరున్నారు? ఆమెకు మృత్యువుకంటె గతి యేమున్నది?"

అని ప్రార్థించితిని. అంతలోనే "పరమాయువు గలవారి చెంతకు సమవర్తియగు యముఁ డెన్నఁటికిని రాఁజాలఁడు. అట్టివాఁడు నా యొద్దకుమాత్రము వచ్చునా? నన్నిట్లే దుఃఖముతోఁ జిరకాలము జీవింపుమని విధాత విధించెను గాఁబోలును!" అని సంశయము కలిగెను. "ఇచ్ఛయున్నచో సకల ప్రయత్నములను గావించి నేనే కాలుని చెంతకుఁ బోవలయును." అని యూహించి యప్పుడు నే నాత్మహత్య చేసికొనుటకు నిశ్చయించితిని. ఏకబిందు మాత్రంబగు నౌషధము వలనఁగాని, యొక చిన్న బాకువంటి యాయుధమువలనఁగాని జ్వాలామయంబగు నీదుఃఖము నంతను నొక్క నిమిషములోఁ జల్లార్చుకొనవచ్చునని యనుకొంటిని.

కాని, యాకస్మికముగా నాహృదయమునందు "ఆత్మహత్య మహాపాతకము గాదా?" అని సంశయము గలిగెను. "పూర్వజన్మమం దెంతయో పాపము చేసికొనుటచేతనే యిప్పు డా పాపఫలము ననుభవించుచుంటిని. మరల నిప్పు డాత్మహత్యారూప మగు మహాపాపము గావించి మఱింత దుఃఖమును, గష్టమును, అశాంతిని నెత్తిఁ గట్టుకొని యుత్తరజన్మమునకుఁ బ్రయాణము గావించుటయా? కానిమ్ము! ఈ బ్రతుకింక నెంత కాలముండును? ఈజీవిత మున్నన్ని నాళ్లు నెట్లో యీదుఃఖానల జ్వాలలను సహించి యీ కష్టములనోర్చి యెట్లో కాలము గడపివైచెదను." అని మరల సమాధానపడితిని.

నేనీవిధముగా ననేకప్రకారముల భావించుకొను చుండఁగా నించుక మైమఱుపు కలిగెను. అప్పుడేదియో యొక కలకంఠస్వరమునుండి యతిమధురంబులగు నీక్రిందివాక్యములు నాకు శ్రుతిగోచరంబు లయ్యెను. ఎవ్వరో నన్ను త్యాదరముతోఁ బలుకరించి "భయములేదమ్మా! ఇంచుక మనసు కుదురు పఱచుకొనుము! శాంతిని వహింపుము! గ్రీష్మప్రతప్తంబగు ధరణీవక్షమున వర్షావారిదము చల్లనినీరు చిలికించి చల్లఁబఱచు

టను నీవు చూచుచుండుట లేదా? దారుణ శీతవాతపీడితమై శోభా విహీనంబగు ప్రకృతి ముఖంబున వసంతమలయ సమీరము చల్లగ వీచి మధురమందహాస చంద్రికలను వెలయించుట కనుంగొనలేదా? పరివర్తనశీలంబులగు నిట్టి కష్టసుఖంబులను వీక్షించుచుండియు ననాలోచితముగా నీవిప్పు డాత్మహత్య చేసికొను టెందుకు! గాఢాంధకారము నకుఁ దరువాతఁ బ్రభాతాలోకము లేదా? మరణమునకుఁ దరువాత జీవనమును, దుఃఖమునకుఁ దరువాత సుఖమును, ఏడ్పునకుఁ దరువాత నవ్వును, రోగమునకుఁ దరువాత నారోగ్యమును గలుగుచుండుట ప్రకృతినియమము. ఇట్లుచో నీదుఃఖమునకు మాత్ర మవసాన మేల లేకుండఁ బోవును?'' అని యుపదేశించిన ట్లయ్యెను.

ఇంతలో నాకుఁ దెలివి వచ్చెను. నలుదెసల నవలోకించితిని. కాని బ్యాగరుద్ధంబగు నా గదియం దితరులెవ్వరు నగుపడలేదు. ఎచ్చట నెట్టి శబ్దమును లేదు. కేవలము గోడకుఁ దగిలించిన గడియారము మాత్రము నిరంతరమును టిక్కుటిక్కుమని ధ్వని చేయుచు తన మనోవేదన నెవ్వరికో తెలుపుకొన వలయునని వృథాప్రయత్నము చేయుచుండెను. అంతటి సుధామధురంబగు కంఠస్వరముతో సాంత్వన వచనంబులు పలికి నిర్భాగ్యురాలినగు నన్నిప్పు డట్లూఱడించిన వా రెవ్వరైయుందు రని యాలోచించితిని. పరమదయాళుం డగు పరమేశ్వరుఁడే నాకరుణా క్రందనము నాలకించి, నావిదీర్ణహృదయమునుండి వెలువడిన శోకాకుల ప్రార్థనమునకు జాలిపడి నన్నట్లాశ్వాసించి యుండునని విశ్వసించితిని.

కాని యంతలోనే నాహృదయమునందు "శ్రీభగవానుఁడే నన్నిట్లు కరుణించినచో నమయమునకు వేచియుండుమని బోధించు టెందుకు! ఇచ్ఛామయుఁ డగునాతని సంకల్పము చేతనే యీ విశ్వమునందు సృష్టిస్థితి లయములు జరుగుచుండును గదా! అంగుఁ బరమాణు స్వరూపు రాల నగు నే నెంతటిదానను. ఆతఁడు తలఁచుకొన్నచో నామగని

కాని నా యప్పటి యనుభవమునుబట్టి యీవిశ్వమంతయు దారుణ దుఃఖానలమును బ్రోగుచేసికొని జ్వాలామయముగఁ జేసి నన్ను భస్మము చేయుటకు వేగిరపడుచున్నట్లు నాకు బోధయగుచుండెను. నేనట్టి దుస్సహావస్థలో నాగృహాభ్యంతరమున మేజాపై బొరలాడుచు దుఃఖపడుచుంటిని. నాగదితలుపు లట్లే మూయఁబడి యుండెను. సాయంకాలమువఱకును నేనెవ్వరికి నగుపడకుండటచే నింటివా రందఱును నాకొఱకు వెదకి కానక తుదకు నా శయనమందిర ద్వారము నుపాయాంతరముచేఁ దెఱచి యందు నేనుండుటం గాంచి నన్నుఁ దీసికొనిపోయి నాలుగుబిందెలనీళ్లతో స్నానము చేయించి భోజనము చేయుమని బలవంతపెట్టిరి. మానవుఁడెట్టి దుస్సహదుఃఖముచే నవసన్నుఁడై యున్నను భోజనము చేయక యుండజాలఁడు. నేనును భోజనమును ద్యజింపఁజాలకపోయితిని. బ్రతికియున్నంతవఱకు దినవలసినదే – నేను నప్పు డేదోయొకవిధముగా భోజనమును గావించితిని.

## ౮. అవస్థ – భావము

ఇది యొకనాటి సంఘటనము! ఇట్లే నిత్యమును దుఃఖఘటనములతో నీ యభాగ్యురాలిజీవితకాలము గడచిపోవుచుండెను. ఆయింటిలో నీ నిర్భాగ్యురాలి మొగము చూచువా రెవ్వరునులేరు. కేవల మెత్తిపొడుపు మాటలు అపహాస్యములు తిరస్కారములు – తిట్లు నాదుఃఖముం గూర్చి జాలిపడువా రొక్కరునులేరు. నేను చేసినపని యెవ్వరికిని నచ్చుట లేదు. నావండిన వంట యెవ్వరికిని రుచించుటలేదు. కన్నులయెదుటఁ బడకుండఁ దప్పించుకొని తిరుగుచున్నను నింటిలోనివా రందఱును నాపైఁ గ్రోధముచే మండిపోవుచుండిరి. విశేషించి నానాథుఁడు నేచేయు ప్రతికార్యమునందు నేదోయొక తప్పు గల్పించి నన్ను రేయుంబవళ్లు

మాడ్చి భస్మముగా జేయుచుండెను.

మఱియొకనాఁడు నేనీయాతనలను సహింపఁజాలక మామేనమామ గారియింటికిఁ బాఱిపోయితిని. వంట చేసి యింటివారందఱికిని బెట్టియే నేనుమాత్ర ముపవాసముతో నిల్లు వెడలిపోయితిని. అట్లుపోయి యాగృహమందొకగదిలో దాఁగియుంటిని. అక్కడకుఁ గూడ నా మగఁడు వచ్చి నన్నుఁ గొట్టి తీసికొనిపోవు నేమో యను భయపడు చునే యుంటిని. నాయత్తవార యింటిలోని వారందఱును నాకొఱకు బలుతావులు వెదకిరి. కాని నన్నుఁ గనిపెట్టఁజాలకపోయిరి. తుదకు సాయంకాల మైనతరువాత మామామయే నేను తనయింటికి వచ్చి నట్లును భోజనమయినతరువాత నన్ను మరలఁ బంపెదననియు నొక సేవకునిచే మాయత్తవారియింటికి కబురుపంపించెను. సరిగా నట్లే జరిగినది. భోజనానంతరము నన్ను మాయత్తవారింటఁ దిగఁబెట్టి యాతఁడు వెడలిపోయెను. అప్పుడు నేనెంతటి ఘోరశిక్షల ననుభవిం చితినో తలఁచుకొనిన నాగుండెలు పగిలిపోవుచున్నవి. ఆకష్టములు మాటలతో దెలియఁ జెప్పఁదగినవి కావు. ఈవిధముగా నిరంతర దుస్సహ కష్టములతో నీదీనురాలి దైనందినజీవితవాహిని ప్రవహించిపోవుచుండెను.

శ్రీధామ మను నవద్వీపమునందు మాయత్తవారి కొక యిల్లున్నది. ఆమందిరమునందు మా మామగారి పినతల్లి నివసించి యుండెను — అప్పుడు నానాథున కొకదుర్బుద్ధిపుట్టినది. నాపుట్టినిల్లును, నత్తవారిల్లును నొకగ్రామమందే యుండుటచే నేను నిత్యమును పుట్టినింటికిఁబోయి తల్లి మొదలగు నాత్మీయులు చెప్పినమాటలవలన దుర్బుద్ధినై యత్తవారింటికి వచ్చి చేయఁగూడని పనులను జేయుచు దుష్టురాల నగుచుంటి నని యాతఁ డనుమానించెను. కాని పాప మాయన తనహృదయ మెంతటి పాపపంకిలమై పోవుచుండెనో యించుకంతయును గ్రహింపఁ జాలకుండెను. పూతిగంధమయంబగు పుంటిపైఁ జల్లని సురభిచందనము

నుండుటయే గాక యదియును దుర్గంధమై పోయినట్లు భక్తిపూర్వకముగ నేఁ జేయు ప్రతికార్యమునుగూడ నాతని కసహ్యమైపోవుచుండెను.

మోసకత్తెలగు వారాంగనల పాపబాహుబంధనమే సుఖకరముగ భావించువారికి కులాంగనలు లజ్జాసంకుచిత హస్తములతో రహస్యముగ గావించు, పూజోపచారములు విరక్తిదాయకములు గాకుండునా? — ఏమైన నేమి? నానాథుఁ డప్పుడు దుర్భ్రాంతికి వశుఁడై నన్నీ గ్రామము నుండి యెక్కడికైనఁ దీసికొని పోయినచో నేనచ్చటఁ దాను జెప్పినట్లు చరింతు నని యనుకొనెను. అందుచేతనే యాతఁ డొకనాఁడు నన్నుఁ బిలిచి "నిన్ను నవద్వీపమునకుఁ దీసికొని పోయెదను." అని చెప్పెను. సరే యని నేనందు కంగీకరించితిని. అంగీకరింపకుండుటకుఁ గారణ మేమున్నది? సతి యనునది పతికి ఛాయవంటిది గదా! స్వామి యెక్కడకుఁ బోవునో సతికూడ నక్కడకే పోవలయును. అచ్చట నాతఁ డెట్టి యత్యాచారములు గావించినను సహించి యూరకుండవలయును. ఎట్టి కష్టములనైనను ననుభవించుట నాకు క్రొత్తగాదు.

మఱి కొన్నాళ్ళయినతరువాత నానాథుఁడు నన్ను వెంటఁ బెట్టుకొని నవద్వీపమునకుఁ దీసికొనిపోయి నా మామగారి పినతల్లియొద్ద నుంచి యామఱునాఁడే యాతఁడు కలకత్తాకుఁ బోయెను. పోవునప్పుడాయన నన్నుగూర్చి తన నాయనమ్మతో నేమనిచెప్పెనో నాకుఁ దెలియదు; కాని యాతఁడు నాతో "నీవిచ్చటనై దేండ్లవఱకు నుండవలయును." అని చెప్పెను. "మీరు మరల నెప్పుడువచ్చెదరు?" అని నేను ప్రశ్నించితిని. ఆమాట కాయన యేమియు బదులు చెప్పలేదు. అది గ్రీష్మకాలము. ఆయన యారోగ్యము పూర్వముకంటె బాగుగనే యున్నది. కాసరోగులకు శీతకాలమునకంటె వేసవి కాలమునందే యించుక యుపశాంతిగా నుండును.

స్వగ్రామమునం దుండుటకంటె నవద్వీపమునందే నాకు సుఖముగా

నుండెను. ఆయమ్మగారు నన్నేమియుఁ గష్టపెట్టక యెల్లవిధముల నాదరించుచుండెను. నేనామెతోఁ గలసి నిత్యమును గంగా స్నానమునకుఁ బోవుచుంటిని. ప్రతిదినమును దేవాలయములకుఁ బోయి దేవతాదర్శనము చేయుచు నిత్యమును శ్రీ గౌరాంగ దేవుని పుష్యజ మూర్తిని సందర్శించుచుంటిని. ప్రతిదేవాలయ ద్వారముచెంతను నమస్కరించి "ఓ దేవతలారా! నాకు మీ సత్యసందర్శనము వలన సుఖానందములను గలుగఁజేసి నానాథుని యెడల మీరనుగ్రహించి యాతని హృదయమునఁ గామాసక్తి నిర్మూలితమగునట్లును, అతని నడవడి బాగుపడు నట్లును, ఆతనికి మనస్థిమితమును, శాంతియు నభివృద్ధియగునట్లును గటాక్షింపుఁడు!" అని ప్రార్థించుచుంటిని. కాని యీ నిర్భాగ్యురాలి కట్టి యానందమును నట్టిసుఖమును నట్టిదివ్యసందర్శనభాగ్యమును నెంతయో కాలము నిలువలేదు. రెండుమాసములు గడచిపోకుండఁగనే నాభర్తవచ్చి "నాలుగైదుదినములలో నిన్ను మరల స్వగ్రామమునకుఁ బంపించెదను" అని చెప్పెను.

అట్లుచేయుటకుఁ గారణమేమో నాకుఁ దెలియలేదు. కాని యాతనిం గూర్చి యేమని ప్రశ్నించుటకును నాకు సాహసము లేకపోయెను. అయినను గొంచెముజంకుచు కంపితకంఠముతో వినమ్రస్వరముతో "ఐదు వత్సరముల వఱకు నన్నుంచుకొందువని చెప్పితివిగదా! ఈ రెండు మాసములలోనే మరల నింటికిఁ బంపఁదలచితి వేమి? ఇంతేకాక "నవద్వీపమునందుంచి నీకుఁ దగినశాస్తి చేసెదను." అనికూడ మందలించి యుంటిరి. కాని నాకెట్టి కష్టమును గల్పింపలేదేమి? నా కిచ్చట సుఖముగనే యున్నదే! నిత్యము దేవాలయములకుఁ బోయి దేవవిగ్రహములను దర్శించి యానందము ననుభవించుచుంటిని. అట్లయినచో నిఁక నాకుఁ గష్టములు ముగిసిపోయినవా? కాని నాకెట్టి యదృష్టమా? మీరింకను నెప్పటియట్లే యున్నారు. మీ కింకను సంపూర్ణారోగ్యము

కలుగనే లేదు. మీరు వ్యాధినిర్ముక్తులు కానంతవఱకు నాకు సుఖమన నెక్కడిది?" అని యంటిని.

నే నిన్నిమాటలాడినను నాతఁ డెట్టి ప్రత్యుత్తరము నీయలేదు, కేవలము నాతఁడు "నేను నాయిష్టము వచ్చినట్లు చేసెదను. నీవు నా యిష్టానుసారముగా నడచుకొనవలయును. ఒక ముఖ్యమైన యుద్దేశ ముతోనే నిన్ను మరల స్వదేశమునకుఁ దీసికొని పోఁదలచితిని" అని చెప్పెను. భర్తయానతిని భార్య శిరసావహింపకుండు టెట్లు? ఏ సతీమణియైనను స్వామికి విరుద్ధముగ సంచరింపఁ గలుగునా? నేనును స్వగ్రామమునకుఁ బోవుటకు సిద్ధపడితిని.

ఆమరునాఁడే నాస్వామి నన్ను వెంటఁ బెట్టుకొని స్వగ్రామమునకుఁ దీసికొని వచ్చెను. ఆతఁడుకూడ రెండుదినము లింటనుండి మరలఁ గలకత్తాకుఁ బ్రయాణమై పోయెను. ఆయన యట్లెందుకు వచ్చెనో, యెందుకుఁ బోయెనో, నవద్వీపమునుండి నన్నంతతొందరగా నింటి కేల తీసికొనివచ్చెనో నా కెంతమాత్రమును గారణము బోధపడలేదు. ఆ విషయమై యింటిలోనివా రెవ్వరికైన నేమైనఁ దెలియునో, తెలి యదో కూడ నాకుఁ దెలియదు. అప్పటి యాతని యాకార వికారము లును, హావభావములును, గుణచేష్టలును సర్వమును గూడ విలక్షణ ములై యుండెను.

ఉదార ప్రకృతిగల మానవునియం దుండు గాంభీర్య మాతనికి మొదటినుండియును లేదు. అప్పుడాతఁ డేదియో ప్రియవస్తువును బోఁ గొట్టుకొన్నట్లు - ఎంతయో తీరని నష్టమును బొందినట్లు - ఏదియో దారుణ దావానలముచేఁ దనమందిరారామ మెట్టయెదుటనే మండి బూడిదయై పోవుచున్నట్లాతఁడు డిల్లపడుచు, దల్లడపడుచు నున్నట్లుం డెను. ఆతని యత్యాచారముల చేతనే మర్మాంతిక వేదన ననుభవించుచు దురపిల్లుచున్న నేను — అప్పుడాతని దుస్సహావస్థఁగాంచి వేయిరెట్లు

బాధపడి దుఃఖించితిని. పరమేశ్వరు నుద్దేశించి నానాధునకు నిత్య క్షేమమును, మనశ్శాంతిని జేకూర్ప వలయునని యనేకవిధములఁ బ్రార్థించితిని.

అతఁడు కలకత్తాకుఁ బోయి యెప్పటియట్ల దుష్కార్యము లందును, దుస్సంగమునందును నిమగ్నుఁడై యుండెను. అందుచేతఁ గొలఁది దిన ములలోనే యాతనివ్యాధి వృద్ధినందెను. క్రమముగా నాతఁడు మంచము పట్టెను. ఈసారికూడ మామగారు నగరమునందలి ప్రఖ్యాతవైద్యులను బిలిపించి యాతనికిఁ జికిత్స చేయించుచు నీసమాచారమంతయు స్పష్ట మగునట్లు మాయింటికి జాబు వ్రాసెను.

ఆయుత్తరమువచ్చినప్పటినుండియు నింటిలోనివారందఱును విచారించు చుండిరి. నేనును దుఃఖముతో గాలము గడపుచుంటిని. ఏమనిన:— ఈసారి యాతఁడు జీవించు నను నాశ యింటివారి కెవ్వరికిని లేకుండఁ బోయెను. ఇంతకుఁబూర్వము మేము దుఃఖపడెదమేమో యని మామ గారు తనకుమారుని రోగాధిక్యముంగూర్చి వ్రాయక జబ్బు కుదిరిన తరువాతనే క్షేమసమాచారములు వ్రాయుచుండెడివారు. ఇప్పు డట్లు కాక వ్యాధిమధ్యమందే జాబు వ్రాయుటచే మాకందఱికిని నిరాశ కలిగెను. కాని యీశ్వరానుగ్రహముచే మఱికొన్నిదినములలోనే "జబ్బు నిమ్మళించినది. భయపడనక్కఱలేదు" అని మామగారు జాబువ్రాసిరి. అప్పుడు మాకు గలిగిన యానందమున కవధిలేదు.

ఆ తరువాత "రోగ మింకను బూర్తిగా తగ్గిపోలేదు. మునుపటి వలెనే యింకను గొంచెము దగ్గువచ్చుచునే యున్నది. పూర్వము వలెనే యెక్కువశ్రమపడకుండ నొకవిధముగా దసపని చేసికొను చున్నాఁడు. ప్రస్తుతము భగవదనుగ్రహమువలనఁ బ్రాణభయము తప్పి పోయినది" అని మామగారు జాబువ్రాసిరి. అందువలన మాకెవ్వ రికిని సంపూర్ణమగు నానందము కలుగలేదు. ఎప్పు డెట్టి జాబువచ్చునో

యనుభయమే బాధించుచుండెను. పెద్దగాలివాన మొత్తుచుండగా భయకంపితహృదయముతోఁ దలదాచుకొనుటకు బరుగెత్తుచుండు పథికు నకు దారిలో నొకపాడుపడిన భగ్నగృహ మాశ్రయముగా లభించి నప్పు డాతని హృదయావస్థ యెట్లుండునో మాయవస్థయు నట్లే యుండెను. రోగశేషము ఋణశేషము అగ్నిశేషము నున్నచో నది మరలవృద్ధియై యమంగళమును జేకూర్పకమానదు!

అగ్నిజ్వాల కెంతటిదాహికాశక్తి యున్నదో పతంగము నాకర్షించు శక్తికూడ నంతకంటె ప్రబలముగానేయున్నదని కీటకము బాగు గనే యెఱుంగును. వందలకొలఁది స్వజాతికీటకములు దీపశిఖయందుఁ బడి వినాశము నందుచుండుట యది చూచుచునే యున్నది. అయి నను కీటకము మందమతియై జ్వాలాసమీపమునకుఁ బోయి తాపముచే శరీరము దగ్ధ మగుచున్నను మరలమరలఁ బదిసారులైన నచ్చటికే పరుగెత్తుచుఁ దుదకు గాలి మండి భస్మమైపోవు వఱకును దీపాకర్షణము నుండి విడివడఁ జాలకుండును. ఇది యేదేవతయొక్క యేమహా లీలయో యే సంకర్షణముయొక్క యేమహాకర్షణమో దానింగూర్చి తెలిసిన వారెవరును లేరు. కాని యిట్టి సంఘటనములు నిత్యమును జరగుచుండఁగా నందఱును జూచుచునే యున్నారు. అందఱుననుభవించు చునే యున్నారు. కేవలము కీటకమే కాదు—మానవ పతంగములుకూడ నింద్రియలాంపట్య మనియెడి దారుణజ్వాలానలమధ్యమున మాటి మాటికినిబడి యుడికిపోవుచున్నారు. మండిపోవుచున్నారు. తుదకు భస్మమై పోవుచున్నారు.

నానాథుఁడుకూడ నట్లే సురాపాయియు వేశ్యారమణీలోలుఁడును దుర్జన సహవాసియునై శారీరక మానసికరోగములచే బాధపడుచు జీవితసంశయావస్థయం దుండియు మరలమరల నట్టిపాపకార్యా చరణము నందే యాసక్తుఁడై పోవుచుండెను. తనకుమాత్రు డీవిధముగాఁ జెడి

పోవుచుండె నని మామామగా రించుకంతయు నెఱుంగఁజాలకుండెను. ఇట్టిస్థితిలో నింతటి దూర దేశమం దొకపల్లెయం దొకమూలఁబడి యున్న మాకెవ్వరికినిగూడ నాసంగతి తెలిసికొనుట కవకాశము కలుగలే దనుటలో నాశ్చర్యమేమున్నది?

## ౬. బాధ్యత

వర్షాకాలము వజ్రభీషణమై, విద్యుద్విలాసితమై, యమృతవర్షముచే నవనీహృదయమును జల్లఁ బఱచి యీసంవత్సరముకడ సెలవు గైకొని చల్లచల్లగాఁ గడచిపోయినది. ఆస్థానము నిప్పుడు శరత్కాల మాక్రమించుకొని తన యధికారమును నెఱపుచుండెను. తామర విరిగొడుగులతో, కాశకుసుమ చామరములతో, మొగలిమొగ్గ బాకులతోఁ కదళీప్రసవకుంతములతో, నిర్మల జలవాహినులతో ఋతురాజమగు శరత్తు జగమంతయు నేకచ్ఛత్రముగఁ బరిపాలించు చుండెను. కుముద కల్హార జాతీ పారిజాత కుసుమ పరిమళములు దిగ్దిగంతముల గుమగుమ లాడించుచుండెను. నిహృత నీరదంబగు నీలాకాశము శతసహస్రంబులగు సముజ్జ్వల తారకామాలికలచే శోభాయమాన మగుచుండెను. చల్లనిపగళ్ళ చేతను, వెన్నెలరాత్రుల చేతను, బ్రకృతియంతయుఁ బ్రశాంతముగా నుండెను. మహాసమారంభముతో దేశమంతటను శారదోత్సవములు జరగుచుండెను.

ఆ పూజాసర్వదివసములకుఁ గుమారుని వెంటఁబెట్టుకొని యింటికి రావలయునని మాయత్తగారు, మామామగారికి జాబు వ్రాయించెను. ఆశ్వీజశుక్లపంచమి నాఁటికి మామగారు కుమారునితోఁ గూడ మా యింటికి వచ్చెను.

నానాధుఁడు వచ్చెననియు, నాతని దర్శించి నయనములను జరితార్థ

ములుగఁ జేసికొనవలయు ననియు భావించుకొని నాహృదయము పరమానందముతోఁ బొంగిపోవుచుండెను. నాప్రాణము విద్యుల్లతవలె విలాసఖేలనము గావించుచుండెను. కాని యాతని దర్శించినంతనే నిరాశావిషాదము లను మంచుదెబ్బచే నాకన్నులును, హృదయమును, మనోవృత్తులునుగూడ కొంకడువాడిపోయెను. హృదయము దుఃఖ పూరితమైపోయెను — ఆయన శరీరస్థితి యెంతమాత్రమును బాగుగ లేదు. మునుపటి కంటెను శుష్కించి యుండెను. మృత్యుభీకర మగు కాసరోగబాధ యింకను నాతని నాక్రమించుకొని పీడించుచునే యుండెను. ఒకసారి యాతని ముగమువంకఁ జూచితిని - దురాచార మహాపాతక సంబంధమగు, కరాళకాలాంతక నీలచ్ఛాయ గుంటలు పడియున్న యాతని కన్నుల యధోభాగమునందు మునుపటికంటె నధికముగనే కానవచ్చు చుండెను. అధరము సంపూర్ణముగఁ బాలి పోయినది. ఆకారమంతయు మహాపాపాచరణముల దుర్లక్షణములతో నిండి యుండెను.

అప్పుడు నేను పాపభయనివారకుఁడగు భగవానుని దలఁపునకుఁ దెచ్చుకొని, నిశ్శబ్ద ప్రార్థనాలాపములచే నాతని నెన్నియో రీతుల నాహ్వానించుచు, నెన్నియో విధముల విలపించితిని. నా స్వామికి సంపూర్ణారోగ్యము లభింపఁజేయు మనియు, నాతని నడవడి పరమ పవిత్ర మగున ట్లనుగ్రహింపవలయుననియు నా జనార్దను నెన్నియో విధముల వేడుకొంటిని. దయామయుఁడగు నారాయణుఁడు నా దీనాలాపముల నాలకించెనో, లేదో నేనెఱుంగను. ఈనిర్భాగ్యురాలి విన్నపము శ్రీధరుని చరణకమల సన్నిధానమునకుఁ జేరినదో, లేదో నాకుఁ దెలియదు. ఆసంగతి నాకెవ్వరు చెప్పుదురు?

నానాథుఁడు దుర్బుద్ధియై దుష్క్రియాలంపటుఁడై యుండెనను సంగతి యితరులెవ్వరు నెఱుంగరు. ఎవ్వరికినిగూడ నట్టి యనుమాన

మైనఁ గలుగుటలేదు. అంతటి దుర్బలుఁడై శుష్కించి, వ్యాధిపీడితుఁడై యున్నవానికి భోగవిలాసినీ లాలసత్వ మెట్లుండుననియు నాతనివట్ల నట్టి దుర్వ్యాపారము లసంభవము లనియు వారినమ్మకము! ఆతనితో గలసి యెల్లప్పుడును గలకత్తాయందే యుండియు మా మామగారే యీ విషయమును గ్రహింపలేదు. ఇట్లే విచ్చలవిడిగ నిచ్చవచ్చినట్లు సంచరించుచుండు మా దేశస్థులగు యువకులు గొందఱు కలకత్తాయం దున్నారు. నానాథుఁడు వారితో సహవాసముచేసి యింతటి పాప కార్యవ్యాసంగమునఁ బడిపోవుచుండెను. వారందఱునుమాత్ర మాతని దుష్ప్రవర్తనములం గూర్చి బాగుగ నెఱుంగుదురు. కాని నా స్వామి యవస్థం జూచిన వారుమాత్ర మిట్టివాని కట్టి దుష్ప్రవర్తనమున కవ కాశ ముండునని విశ్వసింపఁ జాలరు.

నృత్యగీత వాద్యాదులతో దుర్గాదేవి పంచమీ షష్ఠ్యుత్సవములు సకలజన హృదయ నయనానందకరములై గడచిపోయినవి. సప్తమి నాఁటి విధివిహితంబులగు పూజలును సంపన్నంబులైనవి. మహాష్టమి నాఁటి దివాభాగమంతయు మహోత్సవ కోలాహలముతో నిండి పోయెను. ఆసాయంకాలము నానాథుఁడు షికారుగా వీధిలోనికిఁ బోయి సంధ్యాసమయమునకు మరల నింటికి వచ్చెను. అప్పుడాతఁడు పిచ్చివాని వలె నాకన్నుల కగపడియెను.

ఆతని సర్వాంగములును కంపించిపోవుచుండెను. కాళ్లు తేలిపోవు చుండెను. మాటలు తడఁబడిపోవుచుండెను. అది యంతయును జూచి యింటివారందఱమును జాల భయపడిపోయితిమి. నేను తత్తరముతోఁ బోయి యాతని బట్టుకొని శయనగృహమునకుఁ దీసికొనిపోయి పరుండఁ బెట్టితిని. ఆతనితల తిరిగిపోవుచుండెను. అంతలో నాతఁడు వాంతి చేసికొనియెను. ఆవాంతి పఱపంతటనునిండి యిల్లంతటనుజిందె యస హ్యముగా నుండెను. ఆదుర్గంధము మహా రౌరవనరకగంధముకంటెను

దుస్సహమైయుండెను. ఆతని ప్రాణప్రదీపమునకు నిర్వాణసమయ మా సన్నమగుచుండెనని యింటివారందఱును భయపడిపోయిరి. మమ్మందఱిని మోసగించి మహాప్రస్థానము గావించుచుంటి నని యప్పు డాతనికిని సంశయము గలిగినది. చిరకాలము నుండి పీడించుచున్న రోగము ప్రబలమై మృత్యురూపమునఁ దన్ను మ్రింగివైచుచున్నదని యాతఁడును బెగ్గడిల్లిపోయెను.

కాని యది యంతయు నిజము గాదని తరువాత మే మందఱమును దెలిసికొనఁ గలిగితిమి. రోగము వృద్ధి యగుటచే నట్లు జరుగలేదు. ఆతఁడు వీధిలోనికి షికారుపోయి, స్వేచ్ఛాచారులును, పాపమతులు నగు తనస్నేహితులతోఁ గలసి కంఠపూర్తిగా మద్యపానము జేసి యింటికి వచ్చెను. ఆతఁడు మొదలే గడ్డురోగముచే దుర్బలుఁడై యుండెనుగదా. దానిపైని విశేషముగ మద్యమును సేవించుటచే నది విషమించి యీవిధముగా వాంతి యయ్యెను.

నేనుగాని, మాయత్తగారుకాని, మద్యమన నెటువంటిదో, దాని దుర్గుణము లెట్టివో యించుకంతయు నెఱుంగము. లోకులు కొందఱు సురాపానముచేసి మైమఱచి చరించుచుందు రని వినియుంటిమి. వారి యాకారవికారములను మే మెన్నఁడును జూచినవారము గాము. ఆమద్యమును భోజనముతో నుపయోగింతురో చిలుములోఁ బెట్టి కాల్చియే పీల్తురో తాంబూలములో జేర్చుకొనియే సేవింతురో యెట్లుప యోగింతురో మాకు దెలియదు. ఆద్రవ్యమునుండి గులాబిపరిమళమే వచ్చునో చంపకగంధమే వెలువడునోకూడ మాకుఁ దెలియదు. కాని కొందఱు తమసర్వస్వమును వినియోగించి యిహపరసుఖములనుత్యజించి యైనను సురాపానము చేయుచుందురు. కావున నది భూలోకదుర్లభ మగు నమృతమువలె నతిప్రియమగు పానీయ మనియు నందన మందార కుసుమపరాగమువలె మధురసౌరభవిశిష్టమైనదనియు సోమరసమువలె

నానందదాయకమగు పావనద్రవ్య మనియు భావించుకొనవలసి వచ్చు చున్నది.

కాని దానియం దట్టి గుణవిశేషము లెంతమాత్రమును లేవని యప్పుడు తెలియవచ్చినది. త్రాగుబోతులగువారు తమ యిహపర సౌఖ్యముల నన్నిటిని విసర్జించి దేనికొఱకు రక్తమంతయును ధారపోసి గడచిన విత్తమంతయును జలప్రాయముగ వెచ్చపెట్టుదురో, బూడిద వలె నుప్పానమూది పాఱవేయుదురో, దేనికొఱకు సమాజమునుండి నిందితులై బహిష్కృతు లగుదురో, ధర్మమునుండి పతితులగుదురో, తుదకు మానవత్వమునే పోగొట్టుకొందురో, దేనిని సేవించుటచే ప్రపంచమునందున్న వ్యాధు లన్నియు నొక్కసారిగా గుమిగూడి వచ్చి మానవు నకాల మృత్యుకబళముగా జేసివైచునో:— హరి హరీ! అట్టి దాని వాసన యమేధ్యముకంటెను దూషితమైనది! దానివాసనయే యంతటి యసహ్యమైనదని యప్పుడు వినియుంటిని. అయ్యో! అట్టి దుర్గంధదుర్వికార భూయిష్టమగు నామద్యమును ద్రావుట యెందుకు? మతిపోవుటకా? మరణమునకా?

అంతటి దుర్గంధ మయంబగు నాశయనమందిరమునం దామంచము నొద్ద, నజ్ఞానమై యవశమై, యవసన్నమై పడియున్న యా కళేబర సన్నిధానమున, నిరాశతోఁ, గంపిత హృదయములతో, నెప్పటి కేమగునో యను దిగులుతో నేనును మాయత్తగారును రాత్రియంతయు జాగరము చేయుచుఁ బ్రతినిమిషమును యుగప్రాయముగాఁ గడపి వైచుచుంటిమి.

ఆ మహాష్టమినాఁటి పవిత్రయామిని మా కీవిధముగాఁ గడచి పోయెను. అనంతరము ప్రభాతశీతల పవనములు దుర్గాలయము నందలి యుషఃపూజా గీతవాద్యధ్వనులను మాదుర్గంధ మందిరమధ్యము నకుఁ దెచ్చి మాకు శ్రవణగోచరములఁ గావించెను. అప్పుడు నేను

మాయత్తగారి యాజ్ఞచే గృహకృత్యములం దీర్చుటకుఁ బోయితిని. తరువాత సూర్యోదయమై నవోదిత రవికిరణములచేఁ బృథివి యంతయు నాలోకితమై ప్రకాశించువేళకు మాయత్తగారుకూడ నాగదినుండి వెలుపలికి వచ్చిరి.

అప్పుడు నేను లోపలికిఁ బోయి గదినంతను దుర్గంధకలితముగాఁ జేసివైచిన యాయసహ్య వమన పదార్థమునంతను దుడిచివైచి, శయ్యయు, గదియును శుభ్రముగా, జేసివైచితిని. అప్పటికింకను నా భర్త మంచముమీఁదనే శయనించి యుండెను. కాని తెలివిమాత్రము బాగుగనే యుండెను. నిరాశాపూరిత మగు నాహృదయమున కప్పుడించుక యాశ కలిగెను. అప్పుడు నేను బెదరుచు నానాథు నుద్దేశించి గద్గదస్వరముతో "ఎట్లున్నది?" అని ప్రశ్నించితిని. ఆతఁడు నిర్లక్ష్య భావముతో నెట్టి సహానుభూతియును గానరాని స్వరముతో "బాగుగనే యున్నది!" అనియెను.

తరువాతఁ గొన్నినిమిషములలోనే నా కతిభయంకరంబగు చలియును, దానివెంటనే యతిప్రబలంబగు జ్వరమును తగిలినది. అందుచే నేనొడలెఱుంగక పడిపోయితిని. సర్వాంగకములును దీవ్రజ్వరముచేఁ గంపించి తూలిపోవుచుండ నొడలినిండ దుప్పటి ముసుఁగువైచికొంటిని. ఆకస్మికముగా నంతజ్వర మెట్లు వచ్చెనో నేనప్పుడు తెలిసికొనలేక పోయితిని. ఆమద్య విషముయొక్క యసహ్య దుర్గంధమే నా జ్వరమునకుఁ గారణమయ్యెనని తరువాత గ్రహించితిని. ఏమైననేమి? ఆ జ్వరము నన్ను సులభముగ విడువలేదు. డాక్టరువచ్చి చికిత్సచేయుచునైదాఱు లంఘనములు చేయించిన తరువాతఁగాని జ్వరపీడ వదలినది కాదు. నా కారోగ్యముకలిగి స్మృతివచ్చి యప్పుడు మహామాయయగు దుర్గనుస్మరించి "నానాథునకు సంపూర్ణారోగ్యమును కలిగింపవలయు" నని ప్రార్థించితిని.

నాసాథుఁడు మఱునాఁటియుదయమునసే లేచి యెప్పటివలెనే తన దినకృత్యములను గావించుకొనుటకు మొదలుపెట్టెను. అట్లాతఁడు పడి పోవుట రోగముచేతఁ గాదుగదా! స్వయంకృత మగుమద్యపానమహా పాతకమునకు ఫలముగా దుర్బలదేహుఁడగు నాతఁడు మతిదప్పిపడిపోయి యట్లు వాంతిచేసికొనియెను.

నేను జబ్బుపడి లేచినప్పటినుండియు మనోవాక్కాయములచే స్వామియనుగ్రహమును, ఆరోగ్యమును గోరి యాతనిసేవ గావించు చుంటిని. కాని యాతఁడుమాత్రము నేను తనచెంతకువచ్చుట కస హ్యించుకొనుచునే యుండెను. ఎందుక ట్లాతఁడు నన్నుఁ దిరస్కరించు చుండెనో నాయల్పబుద్ధికి గోచరము గాకయే యుండెను. ఇది నాపూర్వజన్మకర్మఫలము కాఁబోలునని యొకప్పుడును, దుష్క్రియాసక్తుఁ డును దుస్సంగియు నగునాతనికంటెకి నేనంత బాగుగ లేనుకాబోలు నని యొకప్పుడును, ఏనరరూపరాక్షసుఁడో ఏనారీపిశాచియో తన మంత్రబలముచే మాయిరువురికిని బొత్తు కలియకుండ వైమనస్య మును గూర్చియుండఁ బోలు నని యొకప్పుడును భావించుకొనుచు దుఃఖ పడుచుంటిని.

ఈయాతన - ఈదుఃఖము- ఈకష్టదశయు నెట్లువదలిపోవునని భావించు కొనుచున్నకొలఁదిని శ్రీభగవానుఁడే యాపదుద్ధరణమున కేక మాత్రశరణ్యుఁడనియు నాదయామయుని యనుగ్రహముకంటె గత్యంత రములేదనియు మఱింతవిశ్వాసము దృఢపడుచుండెను. అందుచే రేయుం బవళ్లు నేనాజగన్నాథునే స్మరించుకొనుచుంటిని. ఆపదలయందుఁ బడిన వారుగాని దీనశరణ్యుఁడగు దేవదేవుని మనఃస్ఫూర్తిగా స్మరింపఁజాల రను కొందును! మంగళమయుఁడగు నామధుసూదనుఁ డీభాగ్యరాలికిఁ జిన్న తనమునుండియు నశాంతిభారమును దలపై మోపుట తన్ను స్మరించుటకే యని నిశ్చయించుకొంటిని.

# ౧౦. అవస్థాంతరము

పూజాదివసము లైనతరువాత మామగారు నాభర్తను వెంట బెట్టుకొని కలకత్తాకుఁ దీసికొనిపోయిరి. అక్కడకుఁ బోయి యాతఁడు తన యజమానుని వ్యాపారములయందు నియుక్తుఁ డై యుండెను. నా నాథుఁడు కూడ, దన యుద్యోగమునందుఁ బ్రవేశించెను. తరువాత నైదాఱునెలలకు మామగారు తనకుమారుని జీతమును దీసికొనుట కాతని కార్యస్థానమునకుఁ బోయెను. అప్పుడక్కడ యజమానివలన నా మామగారు తనపుత్రుఁడు ప్రతిదినమును సమయమునకు సరిగాఁ బనిలోనికి వచ్చుటలేదను విషయమును దెలిసికొనియెను. కాని యాతఁ డింటియొద్దనుండి పనివేళకే వెడలిపోవుచుఁ జాల రాత్రియైనతరువాతనే యింటికి వచ్చుచుండుటను మామగారు కనిపెట్టుచుండిరి. కాని తన కుమారుఁడు సరిగా బనిలోనికివచ్చుట లేదనుమాట విన్నంతనే యాతని నడవడింగూర్చి నామామగారి కిదివఱకుఁ గలిగిన సంశయ మిప్పుడు విశ్వాసముగాఁ బరిణమించెను.

ఆ దినములలో మా దేశస్థుఁడగు నొక పెద్దమనుష్యుఁడు కలకత్తా మజుందారువీథిలో నొకయిల్లద్దెకుఁ దీసికొని సపరివారముగా నివసించి యుండెను. అప్పుడు నా మామగా రాయింటిలోఁ గొంతభాగము నద్దెకు మాటాడుకొని యొకనమ్మకమైన మనుష్యుని దోడిచ్చి కోడలిని వెంటనే కలకత్తాకుఁ బంపవలయునని మాయత్తగారి కుత్తరముఁ వ్రాసెను. "ఇచ్చట నొక యిల్లద్దెకుఁ దీసికొంటి" ననికూడ నాజాబునందు లిఖించి యుండెను. ఆయుత్తరముం జూచుకొని మాయత్తగారు నివ్వెఱ పడి పోయెను. ఎందుకొఱకు నన్నుఁ గలకత్తాకుఁ బంపవలయునని వ్రాసెనో యామె యెన్నివిధముల నాలోచించినను నిశ్చయించుకొనఁ జాలకే పోయెను. కాని యామె నన్నప్పుడు మాత్రము కలకత్తాకుఁ బంపి

యుండలేదు.

నేను కలకత్తా కెప్పుడు వత్తునో యని కొన్నాళ్లవఱకును జూచి మామామగారు తనకుమారుని బిలిచి "నీవే మనయూరికిఁ బోయి నీభార్యను వెంటఁబెట్టుకుని రమ్ము "నాయారోగ్యము బాగుగ లేకుండు టచేఁ గోడలిని దీసికొనిరమ్మని మాతండ్రిగారు చెప్పినారు" అని మీయమ్మతోఁ జెప్పుము" అనిబోధించి పంపించెను. తండ్రియానతి ననుసరించి నానాధుఁడు మాయింటికి వచ్చి తల్లిగారితో నెల్లసంగతులను మాటాడి మఱి నాలుగైదుదినములకు నన్నుఁ గలకత్తాకుఁ దీసికొనిపోయెను.

కలకత్తాకుఁ బోయి యచ్చట నేనున్నసమయములో నొకదినమునం దొకముహూర్తమైనను సుఖముగాఁ గడపఁజాలకపోయితిని. ఆయన రాత్రిపదునొకండుగంటల కింటికి వచ్చుచుండెను. నేఁజేయుపను లేవియు నతనికి నచ్చుటలేదు. అందుచే నాతఁడు నిత్యమును నన్నుఁ గటూక్తులచే బాధించుచుండెను. ఇంతేకాక యాతఁడు రాత్రులయందు నిద్రలేక విపరీతమగు దగ్గుతో బాధపడుచుండుటం గాంచి నాగుండెలు పగిలిపోవుచుండెను. ఆ దుఃఖముచే నిరంతము నాకన్నులనుండి ధారాపాతముగఁ గన్నీరు వెలువడుచుండెను. నేను విసుఁగుచే నేడ్చుచుంటి నని భావించి యాతఁడు మఱింతగా నన్నానేకవిధములఁ దిట్టిపోయుచుండెను. ఉభయులకును రాత్రులయందు నిద్రయనుమాట లేదు. దగ్గుబాధచే నాతఁ డొకనిమిషమైనను గన్నుమూయఁ జాలకుండెను. ఆయన నిద్రింపకుండ నాకుమాత్ర మెట్లు నిద్దురపట్టును! అందుచేత నేనాతనిమంచమునొద్దనే పడియుండి రాత్రియంతయు వేగించుచుంటిని.

ఇట్లు కొన్నిమాసములు గడచిపోయెను. అప్పుడు నేను మా దేశమునకుఁ బోవలసివచ్చెను. మాయత్తమామ లిరువురును తీర్థయాత్రఁ గావించి శ్రీజగన్నాథక్షేత్రమునకుఁ బోయిరి. వారితో నాభర్త

యును బయలుదేఱెను. నేను నాభర్తగారిబొమ్మయింటికి బంపఁబడితిని. నన్నచ్చట దిగఁబెట్టి నానాథుడు మరలఁ గలకత్తాకుఁ బోయెను. ఆయనకోరుకొనుచున్న స్త్రీస్వారియడ్డమునులేకుండ స్వేచ్ఛగా సంచరించుటకు సమయము లభించెను.

నేనుమాత్ర మాయన శరీరావస్థంగూర్చి భావించుకొని యతికష్టముతో దినములను గడపుచుంటిని. ఎప్పటి కెట్లుండునో యని భయపడుచు "మీయారోగ్యముంగూర్చి తెలుపవలయు" నని నాభర్తకు వారమునకుఁ రెండుసారులు జాబులు వ్రాయుచుంటిని; కాని యాతఁడు సరిగాఁ బ్రత్యుత్తరములు పంపుట లేదు. ఒకవేళ నెప్పుడైన నొకయుత్తరము వ్రాసినను వ్రాయనట్లే "నీయుత్తరములందినవి" అని యేదో రెండుపంక్తులు మాత్రమే వ్రాయుచుండెను. నే నాయుత్తరమునే మరల మరలఁ బఠించుకొనుచుఁ గన్నీటిచేఁ దడిసిపోయిన యాజాబును భద్రముగా దాచుకొనుచుంటిని. మఱి రెండుమాసములకు మా యత్తమామలు తీర్థయాత్రలు చేసికొని యింటికి వచ్చిరి. తరువాతఁ గొన్నిదినములకు మామగారు కలత్తాకుఁ బయనమై పోయిరి.

పూర్వజన్మమునందు గావించిన కర్మమునకు ఫలమే యీ జన్మమునందు మానవుల సుఖదుఃఖములకుఁ గారణమై యుండునని వినియుంటిని. అయ్యో! నాకుఁ బూర్వజన్మమునం దాత్మీయు లెవ్వరును లేనే లేరా? నేను కేవలమును బాపకృత్యములను జేయుచుండఁగాఁ జూచి నాకుఁ గావలసినవా రెవ్వరును బుద్ధులుచెప్పి నన్నట్టి దుశ్చర్యలనుండి మరలింప లేదు కాఁబోలును! ఈజన్మమునందు నేనెన్ని దుఃఖములను, కష్టములననుభవింపవలయునో తలఁచుకొన్నకొలఁదియు గుండెలు పగిలిపోవుచుండెను.

ఇంతవఱకును మీకు మనవిచేసిన నాదారుణకష్టములును, దుస్సహదుఃఖములును సంతతమతో నాగి బాధించుచున్నను నేనెట్లో యొకవిధ

ముగా సహించి కాలము గడుపుకొనుచునే యుందును. ఇంతకాలము నకు మఱియొక భీకర దుఃఖజ్వాల యపచారము, నవివేచనము నను నాలుకలు గ్రోలుచు భగభగమండి నా సర్వాంగకములను, హృదయ మును దహింప నారంభించెను. అంతటి క్రూరంబగు నా విపత్సమాచార మును వినిపించినచో మీరు నా యభాగ్యత్వముంగూర్చి యొక్కకన్నీటి బిందువైనను విడువకుండ నుండ జాలరు. మఱియు మీరు నన్నుఁగూర్చి "నీవప్పుడు చావలేక పోయితివా? అంతటి దురవస్థలో బ్రదుకుటకంటెఁ జచ్చుటయే సుఖముగదా!" అని యుపదేశించి యుందురు.

నేనును జావవలయు ననియే యనేకపర్యాయములు ప్రయత్నించి తిని. కాని యప్పటి నాభర్తరోగోద్రేకముం జూచియు నప్పుడప్పుడు మంచము పట్టుచుండుటం గాంచియు నాతనిశుశ్రూష కెట్టిలోపము జరు గునో యనుభయముచే తెగించి చావఁ జాలకపోయితిని. అట్లు కా కున్నచో రేయుంబవ లీమరణబాధ ననుభవించుచు జీవించుట నాకేమి సుఖము!

ఆసమచారము విన్నచో మీరు ముక్కుపై వ్రేలుపెట్టుకొని నివ్వెఱ పడిపోయెదరు:— అప్పుడు నాభర్తయాత్మీయుల కందఱికినిగూడ నొక యపోహము కలిగెను. అందుచేత వారు "దీనియందు కులాంగనల కుండవలసిన గుణములలో నేదియో లోపమే లేకయున్నచో నీమెను భర్త యేల ప్రేమింపకుండును! నిజముగా నిది స్వైరిణి యగుట నాతఁడు పరిశీలించి యుండును" అని ప్రచారము చేయ నారంభించిరి.

అయ్యోదైవమా! ప్రతిదినమును ప్రతిప్రహరమును ప్రతినిమిష మును స్వామియారోగ్యముం గోరుటకంటె నితరకాంక్షితమున నితరోద్దేశమును గలలోనైన హృదయమునం దించుకంతయు లేని దానియెడల నిట్టిదోషారోపణముం గావించి ప్రచారము చేయువారి జిహ్వలేల చీలికలై పోకున్నవి! ఓభగవానుడా! నీవుసర్వాంతర్యామివి

గదా. సమస్తహృదయములును నీవుపరీక్షింపనివిగావు. మొదలే యనేక విధముల దుఃఖించుచు ననేకకష్టముల ననుభవించుచు దుస్సహ దుర వస్థలోఁ దల్లడిల్లిపోవుచున్న నావిషయము నిట్టియపవాదమును బుట్టించి మరల నొకనూతనదుఃఖమును గల్పించి యీయభాగ్యురాలిని మరింత బాధించు క్రూరాత్ములకు నీవు తగినశాస్తి చేయఁజాలవా? నీవు నిజ ముగా దుష్టశిక్షకుఁడవును, శిష్టరక్షకుఁడవును గావా? అట్లయినచో నీమందభాగిని కకారణముగఁ గలిగిన యీయాపదం గాంచుచు నూరకుంటివేల?

అయ్యో:— ఈమాటలు నాస్వామి వినియున్నచో నాప్రవర్తన ముంగూర్చి యనుమానించి నన్ను సంపూర్ణముగా ద్యజింపక మానునా? అట్లు జరగినచో నిఁక నాకు గత్యంతర మేమున్నది? ఆతఁడు నన్ను వేయివిధముల గర్హించినను తిట్టినను కొట్టినను నిర్లక్ష్యముగ నుపేక్షిం చినను నాతనిసేవాభాగ్యమే నాకుఁ జాలుననియు నెప్పటికినిగూడ నట్టి సేవాధికారమునకు భంగము కలుగదుగదాయనియుఁ దృప్తిపడి యీ యాశచేతనే యింతవఱకును జీవించి యుంటిని. ఈదుష్టప్రచారము విని నానాథుఁడుకూడ నట్లే విశ్వసించినచో నాకిఁక నాతనిసేవాభాగ్యము లభించునా? ఇఁక నాతఁడు నన్ను దరికిఁ జేరనిచ్చునా?

నలుదెసలను దావానలజ్వాలలు వ్యాపింపఁగా నడుమనుండి యెట్లును వెలువడఁజాలని హరిణివలె నేనాదుష్ప్రచారానల ప్రాకారమధ్యమున బడి వేగిపోవుచుంటిని. నాప్రాణము లాయత్యాచారభారమును సహిం పక క్రుంగిపోవుచు నట్టియపవాదమునుండి నిష్కృతిం గాంచుట కనేక విధముల నాలోచించుచు నేమియుందోచక తల్లడిల్లిపోవుచుండెను. ఆదుర్భరయాతనకు నివారణోపాయ మేమున్నది? ఏమి చేయుదును? ఎక్కడకు బోవుదును? ఎవ్వరి నాశ్రయింతును? రాత్రిందినము లట్లే బాధపడుచు నాలోచించుకొనుచు దీనదయాళుఁడగుభగవానుని బ్రార్థిం చుచు దినములు గడపుకొనుచుంటిని.

ఈ విధముగాఁ గొన్నాళ్లు జరిగిపోయెను. ఒకనాఁ డేకాంతముగా నాపన్న రక్షకుఁడగు మధుసూదనుం గూర్చి బహువిధములఁ బ్రార్థించి తన్మయావస్థలో మేనుమఱచి పడియుంటిని. అప్పుడెచ్చటినుండియో యేదోచల్లని మెల్లనివాణి వెలువడి నిరాశాదగ్ధమగు నాశూన్య హృదయమునం దాశా నీహారలేశమును జిలుకరించెను. ఆసమయమునందు "ధర్మోరక్షతి ధార్మికన్" అను నమృత మధురవాక్కులు నాచెవులఁ బడియెను. "ధర్మమే ధర్మాత్ముని రక్షించును. అసత్య మెన్నటికిని సత్యమువలెఁ బ్రకాశింపఁజాలదు. మిథ్యయను నగ్నిజ్వాలా దుర్గము సత్యఫూత్కారముచే నొక్కయుదుటునఁ దూలి యెక్కడనో యోజనాంతరముల దూరమునందున్న సముద్రమధ్యమునఁ బడి నామ రూపములు లేకుండ నశింపక మానదు." అని యుపదేశించినట్లయ్యెను.

నే నా యాశనే, ఆయుపదేశమునే యాధారముగఁ జేసికొని ధైర్యముతోఁ గాలయాపనము చేసికొనుచుంటిని. కాని, సిగ్గుచేతను, నవమానముచేతను, సంక్షోభముచేతను బయటికి వచ్చి యెవ్వరి కంటను బడఁజాలకుంటిని. ఎవ్వరితోడను మాటాడఁ జాలకుంటిని. కాని స్నానాహారములు లేకుండ జీవితము జరగుట యెట్లు? ఇరుగుపొరుగు యువతులందఱు నే నిర్మల జలపూర్ణంబగు పుష్కరిణియందు స్నానము చేయుచుందురో నేనచ్చటికిఁ బోవుటలేదు. పల్లెటూళ్లయందుఁ బ్రతి గృహస్థుని యింటను వెనుకభాగమునందు నాడుకొనుటకును, బట్టలుదికికొనుటకును నొకదొరువుండును. తోఁటలోని యాకలము లన్నియు నా నీటిలోఁబడి మురిగి యాజలమును విషతుల్యముగఁ జేయుచుండును. ఆనీటి నెవ్వరును ద్రావరు. ఎవ్వరును వంటకుపయోగింపరు. ఎవ్వరు నందు స్నానము చేయరు. ఎవ్వరి మొగమైన నగపడునను భయముచే నేనుమాత్ర మెక్కడకును బోక నిత్యమును మాయింటి దొరువునందే స్నానము చేయుచుంటిని.

మన కష్టసుఖములను వెనుదిరిగి చూడకుండ దినము గడచియే పోవుచుండును. కాని సుఖదినములు వడిగా జరిగిపోవును. కాని కష్టదినములు మాత్ర మెంత సేపటికిని గదలనట్లే యుండును. కాని నిజముగా నట్లు జరగుట లేదు. మన మనః పరిస్థితులంబట్టి యా విధముగా మన కనుభవ మగుచుండును. నాకట్లే యతికష్టముగాఁ గొన్ని మాసములు గడచిపోయెను. అవి బ్రహ్మరాక్షసులవలె నెంతటి భీకరములైయున్నను, నెంతటి దీర్ఘవికృత రూపవిశిష్టములై యున్నను గడచుచునే యుండెను. సుఖసంపన్నులకును, దుఃఖవిపన్నులకును గూడ వాస్తవముగా దినములు సమముగనే జరగిపోవును.

దినములును, మాసములును దిరిగి తిరిగి సంవత్సరముగ గడచిపోయెను. మరలఁ గార్తికమాసము వచ్చెను. మాయత్తగారు నవద్వీపమునందలి తమభవనమును జూచిరావలయు నని కాంక్షించి యాయుద్దేశమును మామామగారికిఁ గలకత్తా జాబులోవ్రాసి పంపించెను. ఆవెంటనే యాతఁడు మమ్ములను నవద్వీపమునకుఁ దీసికొనిపోవుటకై తన కుమారునింటికిఁ బంపించెను. నానాథుఁ డింటికి వచ్చినప్పుడెల్ల నిట నున్నన్నినాళ్ళును నన్నుఁ గసరుటయు, గద్దించుటయు, తిట్టుటయుఁ గొట్టుటయే కాని యించుకంతయైన నాదరించుట లేదుగదా! పూర్వానుభవమును బట్టి యీసంగతు లన్నియు నాకుఁ దెలిసియే యున్నవిగదా! ఇట్టి స్థితిలో నాభర్త యింటికి వచ్చెనని నాకంత యానంద మెందుకు? అతని కెందఱో యాత్మీయు లున్నను, నాకాతఁడొక్కఁడే సర్వస్వము నని నాదృఢవిశ్వాసము. కేవలమాయనను గన్నులారఁ జూచుచుఁ జేతులార నాతని సేవించుటయే నాకుసుఖము.

కాని యానాఁ డాతని సందర్శించి నంతమాత్రముననే వాతోద్ధూతమగు వేతసీలతవలె నఖశిఖాపర్యంతమును నాశరీరము కంపించిపోవుచుండెను, నాగుండెలు కొట్టుకొని పోవుచుండెను. నాప్రాణము తల్ల

డిల్లి పోవుచుండెను. కేవలము మిథ్యాకల్పితంబగు నాకళంకవార్త యోతని చెవులఁబడి యాతఁడు నన్నుఁగూర్చి యనుమానించి యెన్ని విధముల నిందించునో, ధిక్కరించునో, దండించునో, బాధించునో యట్లే జరిగినచో నేనెట్లు సహింపఁగలనని భయపడి పోవుచుంటిని.

గృహకృత్యముల నెట్లో తీర్చుచుంటిని గాని మనస్సునందు విప ద్రక్షకుఁడును, విపన్నాశ్రయుఁడునగు పరమేశ్వరుని స్మరించుకొనుచునే యుంటిని. ఆనాఁడెట్లో జరిగిపోయినది. నానాథుని హావ భావముల యందుఁ గాని, సంభాషణముల యందుఁగాని, ధిక్కార తిరస్కారము లందుఁగాని, తర్జనభర్జనము లందుఁగాని నాకాభావము గోచరింపలేదు. మఱి రెండుదినములు గడచెను. నాలుగవనాఁటి మధ్యాహ్నము నేనా తని మొగము వంకఁ జూచితిని. ఆషాఢమాసమునందు మేఘచ్ఛన్న మగు నాకాశమువలె నప్పు డాతని వదనము స్థిరగంభీరమై యుండెను. దర్పణముపై నావిరి ప్రసరించిన నెట్లుండునో యట్లే యాతని సర్వాంగ ములును స్వేదసిక్తములై యుండెను. అదిచూచి యగ్నితప్తమగు కదళీ పల్లవమువలె నా మొగము విశుష్కమై వివర్ణమైపోయెను. ఝంఝా మారుతాహతిచే తెగిపడిన పువ్వుదీఁగవలె నేనప్పుడు తూలి పడిపోవుటకు సిద్ధపడితిని. కాని యెట్లో పదిలపడి పడకుండ కొయ్యవడి నిలచియుంటిని.

నానాథుఁడు మాశయనమందిర మధ్యమున నొంటిగాఁ గూర్చుండి సుదీర్ఘముగ నేమో యాలోచించుచున్నట్లుండెను. ఆ ప్రగాఢచింతా నిమగ్నతయం దాతఁడు నే నాయింటఁ బ్రవేశించిన సంగతియే యెఱుఁగఁజాలకుండెను. నేనుకూడ నెట్టిచప్పుడును జేయకుండ నూపిరి బిగఁబట్టుకొని ప్రాణహీనంబగు కొయ్యబొమ్మవలె నిలువఁబడి యాలో చనా విశిష్టంబును, విషణ్ణంబు నగు నాథుని వదనమువంకఁ దదేక దృష్టితోఁ జూచుచుంటిని.

నిశ్చయముగా నాతేఁ డీయభాగ్యురాలి యసత్యకళంక సమాచార

మును వినియే ప్రాణాంతకమగు దుస్సహవిషాద జ్వాలల నావిధముగా ననుభవించుచుండె నని నాకు స్పష్టముగాఁ దెలిసిపోయెను. అప్పుడు నేను చటాలునఁ బోయి యాతని పాదములపైఁబడి "నాథా! ఈ మందభాగ్యురాలు మీ యెడల శత సహస్రాపచారములు గావించిన దైనను కేవల మవిశ్వాసిని మాత్రము గాను! మీమనసునకు వచ్చినట్లు దురదృష్టవతి మీ సేవోపచారములు చేయఁజాలకపోయినను నీమెకు నిరంతరధ్యానదేవత నీకంటె నితరులెవ్వరును లేరు. నా హృదయ మును జీల్చి పరీక్షింపుము. అందలి ప్రతిరక్తబిందువును, అందలి ప్రతి పరమాణువునందునుగూడ నీ మూర్తియే సుప్రతిష్ఠితమై యున్నది." అని ప్రార్థింపవలెనని యాత్రపడిపోయితిని.

కాని యట్లు చేయుటకు సాహసింపలేనైతిని. నా కంతటిధైర్యము లేకపోయెను — "రహస్యముగా వ్యభిచరించునట్టియు, నిగూఢముగా మహాపాతకముల నాచరించునట్టియు కామినులు నిజముగా నీమాత్రపు మొగమిచ్చకపు మాటలును శ్రీరంగనీతులును నేర్చుకొనకుందురా" అని యాతఁడు భావించునేమో యని భయము కలిగెను. అందుచే నేనప్పుడు తలపుచ్చిన కుక్కవలె నెక్కడకుఁ బోవలెనో, యేమిచేయ వలెనో నిశ్చయించుకొనఁజాలక త్రొక్కటపడుచు, సంకటం పడుచు నూరక చూచుచుంటిని.

సరిగా నాసమయముననే యమునానదీ తీరమునుండి సంధ్యాకాల మురళీమోహన గీతము వినవచ్చుచున్నట్లయ్యెను. ఏకాకియైయున్న నాస్వామి యప్పుడొక్క దీర్ఘశ్వాసమును విడిచి తనకు దానే మృదు స్వరముతో "ఇది కేవలమసత్యము! నేనే చాల పొరపాటుపని చేసితిని. కఠోరంబులగు నా యుపచారముల వలనను, అతి క్రూరంబగు నాయనా దరమువలనను గలిగిన దోషమే యీ విధముగా నితరు లామెయెడల మిథ్యాకళంకమును గల్పించుటకుఁ గారణము లయ్యెను. ఈ విషయ

మున నిదర్శనమును జూపువారెవ్వరు కనపడుటలేదు. కేవల మూహ లనుబట్టి యనుమానించుట మాత్రమే - మగఁడు సరిగా నాదరింప కుండుటకుఁ గారణ మామె జారిణియై యుండుటయే యని భావించి యందఱు నీ విధముగా దుష్ప్రచారము చేయుచున్నారు. ఐదేండ్ల నుండి నేనామెవిషయమునఁ బైశాచిక కృత్యములను గావించుచుంటిని. ఆమె కనేక విధములగు ఘోరనరకబాధలను గల్పించుచుంటిని. అన్ని టిని సహించి యామెనాకు నిరంతర సంసేవనము గావించుచునే యున్నది. అట్టిదీనురాలి కిప్పటికైన నాశ్రయమీయక, యింకను నాయెడల నత్యాచారములనే గావించుట ధర్మసంగతము గాదు'' అని బహిరంగముగనే విమర్శించుకొనఁ దొడంగెను.

ఆ మధురవచనముల నాలకించి నేనిఁక నిలువఁజాలకపోయితిని. చటాలునఁ బోయి నానాథుని పాదములపైఁబడి వేడి కన్నీటితో నా చరణకమలములను దడుపుచు "స్వామీ! నీవే నా కులదైవతమవు. నీవే నా పరమాశ్రయుఁడవు. నీవే నాయంతర్యామివి. అంతయును నీవే. గ్రహింపఁ గలిగితిని. ఇంతకంటె నేనునీకు విన్నవింపఁదగిన దేమున్నది? నీనామముకంటె, భగవన్నామము కంటె నితరు లెవ్వరిపేరును నానోట నేనెన్నఁడు నుచ్చరించుట యైన లేదు. ఇంతకాలము నుండియు, మీ కటూక్తుల వలనను, ధిక్కార తిరస్కారముల వలనను, తాడన పీడనముల వలనను భౌతికంబగు తాత్కాలిక దుఃఖాతిరేకముచేఁ బ్రతప్తంబగుచున్న నాహృదయ మిప్పుడు సుధారసధారలచే జల్లనైన ట్లున్నది. దురాలోచనముచేఁ గావించిన మీపరీక్ష - మీసిద్ధాంతము - శ్రోత్రపేయముగ జేసికొనుటచే నాజీవితము ధన్యమైనది. జన్మజన్మాంతర పుణ్యపరిపాకము చేతనే నేను ప్రేమసురభిళ ప్రసూనమాలికచే మీగళసీమ నలంకరింపఁ గలిగితిని'' అని ప్రార్థించితిని.

ఈసంఘటనము జరిగిన రెండుమూఁడు దినములకు నానాథుఁడు

తనతల్లిని, నన్నును వెంటఁబెట్టుకొని నవద్వీపమునకుఁ దీసికొనిపోయెను. పోవునప్పుడు స్వదేశమునుండి యొకసేవకునిగూడఁ దీసికొనివచ్చెను. మాయింటిపనులు నిర్వర్తించు చుండుటకు వానిని మాకుఁ దోడిచ్చి నాస్వామి మరలఁ గలకత్తాకుఁ బ్రయాణమైపోయెను.

## ౧౧. క్రొత్త వెలుఁగు

అప్పుడు నవద్వీపమంతయు రాసలీలోత్సవములతో నిండియుండెను. హేమంతాగమావృతప్రకృతి శారదాకృతిని బరిత్యజించి విగతసురభిళం బయ్యును మల్లికాప్రసూన మాలికలను ధరించియే యుండెను. ఆకాశ మండలము నందు జంద్రబింబము మంచుకావిరులచే నించుక మలిన ముఖం బయ్యును దనయమృత కిరణధారలను తరంగ సంక్షుభితం బగు గంగావక్షము నందును, శ్యామసుందరంబులగు తరుశాఖాగ్రముల మీఁదను, నగర ప్రాసాదశిఖరములందును, వినిర్ముక్తగవాక్ష ద్వారం బులయందును, విశాలపుర వీథులయందును బ్రసరింపఁ జేయుచు శోభఁ గూర్చుచునే యుండెను. ఆతని ప్రేమానురాగములచే సొగసియున్న తారకాసహస్రము లాతనితోఁ గలసి వచ్చి నవద్వీప రాసోత్సవ మధురలీలలను దర్శించుచున్నవా యన్నట్లుండెను. వివిధ నగరముల నుండి వర్తకులు వచ్చి తమ యంగడుల నాపురవీథులనిండ విస్తరించి యుండిరి. రాత్రులయందా యంగడులలోని దీపములు కన్నులపండు వుగాఁ బ్రకాశించుచుండ వాని రమణీయకాంతులు జాహ్నవీ విమల జలంబులలోఁ బ్రతిబింబించు చుండెను.

నవద్వీప నగరమంతయు నప్పుడు రేయుంబగళ్ళు నృత్తగీతాది వినో దంబులతోడను, భజనలతోడను, గరతాళములతోడను, హరినామ కీర్తనములతోడను నిండి నిబిడీకృతమై యొకానొకయవ్యక్తమధుర నినాద ముతో నెవ్వరినో ప్రార్థించుచున్నట్లుండెను. మేము రాసపూర్ణిమ

నాఁడు గంగాస్నానము గావించి రాసోత్సవమును దర్శించి యెంతయో యానందించితిమి.

కార్తిక పూర్ణిమనాఁడు నవద్వీపమునం దెట్టి మనోహర దృశ్యమును దర్శింతుమో యట్టి దృశ్యము నెన్నఁడు నేనగరమునందును దర్శింపఁజాలము. ఆదినములలో నచ్చట శాక్తవైష్ణవాది మతభేదము లన్నియు మాయమై పోవును. అందఱు నేకీభవించి రాసలీలోత్సవానందముతో స్త్రీలును, పురుషులు నైకకంఠ్యముగా మధురగానములు గావించుచుండ నయ్యమృత మధుర స్వరతరంగములచేఁ బ్రకృతియందలి ప్రతిపరమాణువునుగూడఁ బులకించి పోవుచుండును. పతితపావని యగు భాగీరథి యంతయు నట్టి పులకోచ్ఛ్వాసములచే నుప్పొంగిపోవుచు కలుషదూషితులగు సహస్రసహస్ర నరనారీమణులను మహాపాపవిముక్తులం గావించుచుండును.

మూఁడుదినముల పర్యంతము నప్పుడా నవద్వీపమునందు జరగుచుండు వేడుకలను వర్ణించి యథారూపమున వ్యక్తపరచుట కెంతవారికిని గూడ సాధ్యము గాదు. ఆ నగరమునందుండు శివుఁడు, శక్తి, విష్ణువు, గణేశుఁడు, బ్రహ్మ, సూర్యుఁడు, శ్రీ రాధాకృష్ణుఁడు, గౌరాంగదేవుఁడు, మున్నగు దేవతల యెన్నెన్నియో మూర్తులు, వివిధభావద్యోతకములగు నెన్నెన్నియో విగ్రహములు విభిన్నవిలాసములతో, వివిధభావ ప్రకటనములతోఁ జిత్రించిన యెన్నెన్నియో ప్రతిమలు మందిరములందును, మఠములందును, దేవళములందును, బూజాగృహములందును సుప్రతిష్ఠితములై యారాధితము లగుచుండు వాని సంఖ్యను లెక్కించుట కెంతటివారును శక్తులు గాఁజాలరు. ఆ దివ్యవిగ్రహములం గాంచినంతనే యెంతటి పాషాణహృదయము లైనను భక్తిరసమయంబులు గాకమానవు.

ఇంతేకాక యీ దినములలో నచ్చట శ్రీ పటేశ్వరీపూజలు జరగును,

ఆ దివ్యవిగ్రహ మెంతయందముగాఁ జేయఁబడి యలంకరింపఁ బడి హృదయ నయనానంద కరముగా నుండునో చూచితీరవలసినదే కాని చూడనివా రెంతవర్ణించినను గ్రహింపఁజాలరు. దేశమునందలి ప్రఖ్యాతి గాంచిన కుంభకారులు మృణ్మయమగు నాప్రతిమను జక్కఁగా నిర్మింతురు. ఆవిగ్రహమును కృష్ణనగరమందలి యారితేరిన శిల్పులు వచ్చి స్వహస్తములతో ననేకవిధములగు వసనభూషణాదులచే నలంకరింతురు. ఆ యలంకార రచన, ఆశోభ, ఆవిలాసము, ఆసౌందర్యము మును దర్శించినంతనే మతాంతరులుకూడ ముగ్ధులు గాకమానరు.

అట్టి పరమానంద దాయకములగు మహోత్సవముల దర్శించుచు నచ్చట మే మొక మాసమును గడపితిమి. తరువాతఁ గూడ నాలుగు మాసములవఱకు మే మానగరమునందు శాంతిసుఖము ననుభవించుచు నివసించియుంటిమి. అప్పుడు నా హృదయమునందు "నే నింతకాలము వఱకు నే దేవతా శాపముచేతనో, ఏపైశాచిక నిర్బంధముచేతనో యింతటి ఘోర యాతనలకుఁ బాలుపడిపోతిని! ఇంత కాలమునకు శ్రీ భగవానుఁడు నా ప్రార్థనమును మన్నించి, నాయందుఁ గరుణించి నానాథుని గురుస్వరూపునిగాఁ జేసి నన్నిచ్చటికిఁ బంపించెను. ఆతఁడే మహానరకమునుండి నాచేయిపట్టుకొని లేవనెత్తి భూలోకస్వర్గమగు నీ పుణ్యభూమియందలి యానందోత్సవ కోలాహల మధ్యప్రదేశమునందుఁ బ్రవేశపెట్టినాఁడు. అందుచే నా సకల దుఃఖములును దూరములై పోయినవి." అని భావించుకొనుచు నప్పుడు నేను శ్రీపరమేశ్వరుని చరణ కమలముల యపారమహిమంగూర్చియు, నానాథుని యమేయకరుణం గూర్చియుఁ గీర్తించుకొనుచు "సాధన వలననే సిద్ధియగును; సహనమే సర్వసిద్ధి ప్రదాయక మైనది!" అని నిశ్చయించుకొంటిని.

ఒక్కటే భావన – ఒక్కటే విచారమును నాహృదయమునం దంకితమై ముద్రితమై చిత్రితమై దృఢబంధితమై యుండెను. అదియేమనిన –

నాస్వామి యారోగ్యవంతుఁడు కావలయు ననియే. నేను ప్రతిదినము వేకువనే లేచి గంగాస్నానముచేసి యూర్ధ్వముఖినై చేతులు జోడించి పూర్వాభిముఖంబుగ నిలిచి నవోదితుండును, అరుణకమల ప్రభుండు నగు సూర్యదేవు నుద్దేశించి నానాథుని రోగనివారణ మొనరింపవలయు నని యనేకవిధములఁ బ్రార్థించుచుంటిని. తరువాత నెన్నియో దేవమందిర ద్వారములయొద్ద నిలిచి దర్శించిన దేవతా విగ్రహముల కన్నిటికిని తదేకాకాంక్షతోడనే సాష్టాంగప్రణామములఁగావించుచుంటి.

మేము నవద్వీపమునందున్న దినములలోనే నానాథుఁ డొకనాఁ డచ్చటికి వచ్చెను. హేమంతకాలమునందు శీతవాతబాధలచేఁ దల్లడిల్లిపోవుచున్న ప్రాణములకుఁ గోకిల కుహూకారమును, మలయవాయు సంచారమును శ్రోత్రస్పర్శ గోచరములై యద్భుతస్వభావ వసంతాగమానుభవముం గల్పించి యించుక సుఖాశయు, నుత్సాహమును వర్ధిల్లఁ జేయునో సరిగా నాస్వామి యవస్థంగాంచి నాకప్పుడట్టి సుఖోత్సాహములు గలిగి నాహృదయమునకు శాంతి లభించెను.

రోగవిశీర్ణంబగు నాతని శరీర మింకను బలవిశిష్టము కాలేదు గాని యంతటను నించుమించుగాఁ గ్రొత్తరక్తము ప్రవహించుట కారంభమైనట్లును, జీవచైతన్య మించుక జాగరితమై కళావిశిష్టమై యున్నట్లును గానవచ్చుచుండెను. ఆకన్నులింకను గుంటలుపడి రాహుగ్రహగ్రస్త చంద్రకళలం బోలి వ్యాధిగ్రస్త లక్షణములను బ్రకటించుచునే యున్నవి. కాని యోష్ఠాధరముల యందు శుభ్రరక్తరేఖలు గానవచ్చుచుండెను. దుస్సహబాధాకరంబగు కాసరోగోద్రేక మించుక శాంతించినట్లే యుండెను. మునుపటివలె నంతగాఁ బీడించుట లేదు.

అప్పుడు నేనొక యేకాంతస్థలమునం దాతని దర్శించి మనసుకుదురు పఱచుకొని, ధైర్యము వహించి మృదుమంద కంపితస్వరముతో

"ఇప్పుడు మీ కేదియైన నూతనౌషధమును సేవించుచున్నారా? ఈ సారి మీజబ్బు పూర్ణముగాఁ గుదురునని యాశ కలుగుచున్నది. మీ యనుభవముంబట్టి యెట్లు తోఁచుచున్నది?" అని ప్రశ్నించితిని.

అందుపై నాతఁడు "ఇప్పుడు నేనెట్టియౌషధమును దీసికొనుట లేదు. ఇన్ని వత్సరములనుండియుఁ గలకత్తాయందలి డాక్టరులు, కవిరాజులు మొదలగువా రందఱిచేతను జికిత్స చేయిఁచుకొంటిని. యోగులు, జోగులు మున్నగువారి నాశ్రయించి వారి యుపదేశానుసారము పథ్యపానములు గావించుచు నెన్నియోపాట్లు పడితిని. కాని యెందు వలనను గూడ నించుకంతయైనను లాభము గలుగలేదు. ఇఁక సర్వభూత శరణ్యుఁడగు పరమేశ్వరుఁ డొక్కఁడే నాకు గతియై యున్నాఁడు. అతని చరణ కమల సన్నిధానమునందే యీ దేహాభారతమంతయు నర్పించి జీవితకర్తవ్య కర్మములం గావించుచు నాపద్బంధుఁడగు నాతని యను గ్రహమునందేయభారపడి యుండఁ దలంచితిని. ఇఁక నేనెట్టి యౌషధమును సేవింపఁదలఁచు కొనలేదు!" అని చెప్పెను.

నా యొడలంతయును బులకించిపోయెను. ఎవ్వని ముఖము నుండి యెట్టిమాటలు వినవచ్చుచున్నవి! ఎవ్వని వదనమునుండి సురాపాన దుర్గంధము వెలువడి వాయుమండలమునంతను గలుష దూషితముగఁ జేయుచుండెనో యట్టివాని జిహ్వాంచలమునుండియే శ్రీభగవానుని కరు ణార్ద్రహృదయముం గూర్చిన సంకీర్తనములు వెలువడుచుండెనే! ఏ హృదయము వేశ్యాలాంపట్యమను ననలజ్వాలచే నాక్రమితమై సమస్త సద్వృత్తులను, సద్గుణములను భస్మీభూతములుగా జేసికొని శాపదగ్ధు లగు సగరపుత్రుల భస్మరాశివలెఁ బరిణమించిపోయెనో, యట్టిహృదయ మునం దిప్పు డేభగీరథుఁడు వచ్చి బ్రహ్మాకమండులువునందలి శ్రీమ న్నారాయణ చరణకమలామృతధారను బ్రవహింపఁజేసి పరమ పావనత్వ మును మూర్తీభవింపఁజేసెను! — నేను పరమానంద పులకితగద్గద స్వర

ముతో "ఈసారి మీకు నిశ్చయముగా సంపూర్ణారోగ్యము లభించును!" అని నుడివితిని.

ఆతఁ డప్పుడు నాయానంద బాష్పాశ్రుపూరిత నయనాంచలములపై నేనెన్నఁడు నెఱుంగని యపర్వాచ్యంబులగు తన యుదార నిశ్చల నితాంత మధురంబులును, సుధారస నిష్యందంబులును, ప్రేమరసాధారంబులు నగు దృష్టులను బ్రసరింపఁజేసెను. నా జీవితకాలమునం దిదివఱ కెన్నఁడు నంతటిసుఖమును, అంతటియానందమును, అంతటి హర్షావేశ విహ్వలత్వమును నొక్కసారిగా ననుభవించి యుండలేదు. పూర్వజన్మ జన్మాంతరములయందైన నెన్నఁడు ననుభవించి యుండను. "ఇఁక నేనీయానందముతో మరణించిననేమి?" అని యనుకొంటిని. ఔను! ఈసుఖస్వప్నమునకు భంగము గలిగినచో నిఁక నీ జన్మమునం దట్టి శుభముహూర్తము నాకెట్లు లభించును?

కొలఁది నిమిషములలో నట్టి నా సుఖస్వప్నము తెరమరుగై యామోహామయ పరమానందమయ ప్రేమమయ ప్రియకటాక్షావలోకనము చెదరిపోయెను. అప్పుడాయన నన్నుద్దేశించి "ఇక నా కారోగ్యము కలుగు నని నీవెట్లు గ్రహింపఁ గలిగితివి?" అని ప్రశ్నించెను.

నే నించుక మనసు కుదురు పఱచుకొని "ఎట్లు తెలిసికొంటినో చెప్పఁజాలను. కాని నాహృదయమున కట్లు స్ఫురించినది" అంటిని.

నానాథుఁ డప్పుడు నాప్రత్యుత్తరముంగూర్చి యంతగా నాలోచింపలేదు. "నేనిచ్చటినుండి మిమ్ముఁ గలకత్తాకుఁ దీసికొని పోవుటకై వచ్చితిని" అని చెప్పెను.

నేను — ఎందుకు?

ఆతఁడు — కలకత్తాయందొక యిల్లద్దెకుఁ దీసికొంటిమి. మన మందఱముఁ నక్కడకే పోయియుందము. కొందఱొకచోటయు, మరికొందఱొకచోటయు నుండుట యిబ్బందిగా నున్నది.

నేను — మేమచ్చటికి వచ్చి యెట్లుండఁగలము. వెనుకటిసారి మన మున్న యిల్లేమియు బాగుగ లేదు. అట్టి గృహమునకు మమ్మురమ్మనుట యెంతమాత్రము నాకు నచ్చలేదు.

ఆత — కాదు, కాదు! ఈసారి చంపాతలమునం దొక మూడంతస్తుల మేడ నొక యేఁడాదివఱకు నద్దెకుఁ దీసికొంటిమి. అక్కడ నందఱమును సుఖముగా స్వేచ్ఛగా నుండవచ్చును.

ఆరాత్రి నాకెట్టి సుఖానందములతోఁ గడచిపోయినదో, మాటలతో మీకెట్లు వర్ణించి చెప్పఁగలను? మేఘావృతంబగు నమావాస్యనాటి నిశీథగాఢాంధకార సమయమునం దాకస్మికముగాఁ బూర్ణచంద్రోదయమై దిగ్దిగంతము లన్నియు నమృత చంద్రికాలోకముచేఁ బులకితము లైనట్లును, ఆకస్మికముగా బహుకాలము నాఁటి పురాతన శ్మశాన వాటికయందు, సౌధకిరీటాలంకృతంబును, సర్వజన సమాకీర్ణంబును, సకల సంపద్విరాజితంబును, దేవబ్రాహ్మణ మందిరాకీర్ణంబును, నృత్తగీతవాద్య కోలాహాల ముఖరితంబు నగు నగరరాజము సుప్రతిష్ఠితంబైనట్లును మహానందముగా నుండెనని చెప్పినచో నాయుపమ నే నెన్నఁడును గలనైన నెఱుంగని నాయప్రతర్క్యాగంతుకానందమునకు సరిపడదనియే సంశయించుచున్నాను.

కాని నేనంతటి మహా సుఖయామినిని గూడ జాగరావస్థలోనే గడపివైచితిని. మాఁనపుఁడు శ్రీభగవానుని చరణపద్మములం దాత్మార్పణము గావించుకొని యెట్లో పపత్కాలమును గడపుకొనుచుండఁ గలిగినచో నెప్పటికైనఁ గరుణామయుఁడగు నాతఁడు తన కటాక్షరస సేచనమున నట్టిభక్తుని సమస్తకష్టములను దొలఁగించి యాతని పుణ్యకర్మఫలములను బ్రసాదించి సుఖానంద పులకితునిగాఁ జేసి యనుగ్రహింపక మానఁడు! కలుషదూషిత మగు సువర్ణము వైశ్వానరజ్వాలాసంతప్తమై స్వచ్ఛలం గాంచును. నా జీవితము యట్టి సంఘటనమునకు బ్రధాన

నిదర్శనమైనది.

నిజముగా నేను నాసకలకష్టములను దుఃఖములను సహింపఁజాలక శ్రీభగవానున కాత్మసమర్పణము చేసికొని యట్ల కష్టసమయమున నిశ్శబ్దముగఁ గన్నీరువిడుచుచు గడపి శుభసమయముకొఱకుఁ బ్రతీక్షింపక — శాస్త్రములయందలి మహోపదేశములను దిరస్కరించి యప్పు డాత్మహత్యయే చేసికొని యున్నచో నేనంతటి సుఖానంద చంద్రికా వికాసము నెట్లుసందర్శించి యుండఁగలుగుదును? . ఆత్మహత్యామహాపాప భారమును వహించి ప్రేతపురంబునఁ బ్రతప్తదుర్గంధ జలప్రపూర్ణంబగు నే వైతరణీ నదీకూలంబుననో కంటకసమాకీర్ణపథంబునఁ బడి నడవఁ జాలక గోలుగోలున నేడ్చుచుఁ దిరుగాడవలసిన దాననేగదా! ఏమహా రౌరవనరకంబుననో దుర్గంధమయ ప్రదేశంబున నూపిరి బిగఁబట్టుకొని జ్వాలాభీలంబులగు దారుణయాతనల ననుభవింపవలసిన దాననేగదా!

## ౧౨. దేవీప్రసాదము

తరువాత మేమందఱమును నాస్వామితోఁగూడఁ గలకత్తాకుఁ బోయి యచ్చట నివసించి యుంటిమి.

దినములపై దినములు గడచిపోవుచుండెను. మా సంసారసుఖమును, సంపత్సమృద్ధియు, స్వేచ్ఛయు దినదిన ప్రవర్ధమాన మగుచుండెను. ఇతరులయొద్ద నౌకరీ చేయుచున్నంతవఱకు విశేషోన్నతి లభించుట కవకాశము లేదని యూహించి మా మామగారు స్వయముగాఁ బెద్దబజారునం దొకకొట్టు తీసికొని వ్యాపారము చేయుట కారంభించిరి. కాని తా నిదివఱకు పనిచేయుచున్న చోటనుండి మాత్రము, సంపూర్ణముగా సెలవు తీసికొనలేదు. ఆయన యజమాని మరణించెను. అందుచే యజమానుని భార్యయు, కుమారులును "మీరు మా వ్యాపారము వదలిపోయినచో మాపనులు జరుగవు.

మీరు పెద్దలగుటచేఁ దిరిగిపనిచేయుటకు శక్తియుండదు| కావునఁ గావలసిన కర్మచారులను మీచేతిక్రిందఁ బెట్టుకొని వారిచేఁ బనిచేయించుకొనుచు మావ్యవహారములు సక్రమముగా జరుగుచుండునట్లు పరీక్షించుచుండుఁడు మీకంటె మాకెవ్వరును విశ్వసింపఁదగిన యుద్యోగులు లేరు'' అని ప్రార్థించుటచే మామగారి కాయుద్యోగమును వదలుకొనుట కవకాశము లేకపోయెను.

అందుచేత నాతఁడు తనకుమారునియుద్యోగమును మాన్పించి యాతనిచే సొంతవ్యాపారమును జేయించుచు నప్పుడప్పు డాయనవచ్చి యెల్ల వ్యవహారమును బరీక్షించుచుండెను. కొలఁదిదినములలోనే మా వ్యాపారమునందు విశేషలాభము కలుగుటయే కాక బజారునందు ప్రఖ్యాతికూడ వర్ధిల్లెను. మేమందరమును సుఖముగా గాలక్షేపము చేయుచుఁ బరమానందములోఁ గలకత్తాయం దుంటిమి.

పరమేశ్వరుఁ డెంతగాఁ బ్రసాదించుచున్నను మానవున కింకను నభావములు వృద్ధి యగుచునే యుండును. మే మెప్పుడేదికోరుదుమో యప్పుడు దేవుఁడు మాకన్నియును బ్రసాదించుచుండెను. అయనను మాకెప్పటికప్పుడే నూతనాభావము లనుభవమునకు వచ్చుచుండెను. అట్టిసమయములందు మరల మాదీనప్రార్థనముల నతికరుణముగ నా భగవానుని శ్రీచరణపీఠసన్నిధానమున నివేదించుట కారంభించుచుంటిమి.

మాయత్తమామలు మాయప్పటి సంసారసుఖాలోక మధ్యమునం దెట్టిగాఢాంధకారము ననుభవమునకుఁ దెచ్చుకొనుచుండి రనఁగా వారికన్నులవెలుఁగుగా నాకు సంతానము గలుగలేదనునట్టి హృదయవేదనయే వారిని బీడించుచుండెను. నాకు సంతానము గలుగువయసంతయు నారక మితిమీరిపోవుచున్నది. అందుచేతనే వారు తమ కికఁ బౌత్రముఖసందర్శనభాగ్యము లేకపోవునేమో యనియే నిరంతరమును విచారించుచుండిరి. అప్పుడు మాబంధువులలోఁ గొందఱు "సంతానార్థమై

నీకుమారునకు మఱియొకవివాహము గావింపుము!" అని మామామ గారికి మహోపాయమును, బోధించి నాకెంతయో మహోపకారము గావించినట్లు సంతోషించుచుండిరి.

నేనింత వఱకెన్నఁడును సంతానాభావముం గూర్చిన విచారము ననుభవించి యుండలేదు. నాకు సంతానము లేకపోవుటచే మాయత్త మామల వంశమునకు లోపము గలుగనను కారణమున నాకు నాభర్తను మఱియొక భాగ్యవతికి స్వామిగాఁ జేసి నన్నుఁ బరాయిదానిగాఁ జేయ వచ్చును. అప్పుడు నాహృదయాంత రాళమున వెలుంగుచుండు సుఖ జ్యోత్స్న సంపూర్ణముగ నస్తమించి నన్ను గాఢాంధకారమున ముంచి వైవకుండునా? ముంచివైచును. నేను మరల భయకంపిత కరుణస్వరముతో దయామయుఁడగు భగవానుని చరణకమలములం గూర్చి "ప్రభూ! నీవు నాకన్నియును ననుకూర్చితివి. కాని యింతలోనే యేమియు లేని దానిగాఁ జేయు టెందుకు? నాకు సంతానమునిచ్చి నా యీసౌభాగ్య మును నిలుపుము. నా మామగారి వంశమును విస్తరింపఁ జేసి రక్షిం పుము." అని ప్రార్థించుట కారంభించితిని.

ఆసమయము నందు నేనొకనాఁడు కాళీఘట్టమునందలి జగన్మో హినియు, జగన్మాతయు నగు శ్రీ కాళికాదేవిని దర్శించుటకుఁ బోయి తిని. మందిర ప్రవేశద్వారము మొదలుకొని యొక్కటే ప్రార్థనము. "అమ్మా! నాకు సంతానమును దయసేయుము. ఈ నిర్భాగ్యురాలికి సర్వమును బ్రసాదించి సంతానము మాత్రము గలిగింపక హాహాకార భీకరంబగు దుఃఖసముద్రమునఁ ద్రోసివైచితి వేమి! దేవీ, నీ విచ్ఛా మయివి. ఈసృష్టిస్థితి విలయములు నీయిచ్ఛాను సారముగనే జరగు చుండును. ఒక్క సంతానమును నా కనుగ్రహించుట నీకెంతపాటిపని దయామయీ! తల్లీ! దీనరక్షణీ! నీద్వారముకడ నిలువఁబడి భిక్షమును వాంఛించుచుంటిని. నా మనోరథమును సంపూర్ణము గావింపుము" అని

ప్రార్థించితిని.

తరవాత నేను మందిరమునకుఁ బ్రదక్షిణము గావించి వచ్చి మాతృ మందిరమున బ్రవేశించితిని. మందిర మంతయును భక్తబృందములతో గిక్కిరిసియుండెను. స్త్రీలును బురుషులునుగూడ నప్పు డాత్మవిస్మృతులై తమతమ పద గౌరవములనుగూడ పాటింపక తమ బలాబలములను గణింపక యొకరి నొకరు త్రోసికొనుచు దేవీపాదపద్మములను దర్శించుటకై యధికాయాసముతో మందిరమున బ్రవేశించుచుండిరి. జన మంతయు నిసుకవైచిన రాలకుండునట్లుండెను. ఒండొరుల నొరసికొనుచు సమ్మర్దముచే నలఁగిపోవుచు, స్వేదసిక్తగాత్రములతో, నారక్తమ్లాన వదనములతో దర్శనాకాంక్షతో విరామము లేకుండ ముందటికిఁ ద్రోసి కొని పోవుచుండిరి.

నేను మాతృదేవీసన్నిధానమును జేరినంతనే ప్రప్రథమునఁ గాళికా దేవి చరణకమలములను, దరువాత నతిభయంకరంబైనను మధుర మోహనంబగు నామాతృమూర్తిని, దర్శించితిని. చూచినంతనే భక్తి భరంబున నొడలు మఱచిపోయితిని. అప్పుడునాహృదయమునందు "నిజ ముగాఁ ద్రిగుణాత్మిక యగు నీజనని నాయభిమతమును బ్రసాదించుటకే యీమందిరమున వెలసి యున్నది." అని భావించుకొని యాజగన్మాతకు బ్రణామము చేయుచు నొక్కటే ప్రార్థన — సంతానమును దయచేయు మను నాప్రార్థనమును దేవీచరణకమల సాన్నిధ్యమున నివేదించితిని. తరువాత నేను లేచి వచ్చుచుండఁగా నేదియో యొకవస్తువొక్క వినరునఁ గ్రిందినుండి దొరలి వచ్చుచు నాపాదములకు దగిలెను. సరిగ నా సమయమునందే "నీవు దీనిని దీసికొనిపోయి స్నానము చేసి భుజింపుము! నీవాంఛితము సఫలము కాఁగలదు" అని యెవ్వరో బోధించినట్లు శ్రవణగోచర మయ్యెను.

వాంఛాకల్పవల్లియుఁ, గరుణారాశియు, నగు కాళీమాత దయా

దానముచే నిదిలభించె నను విశ్వాసముతో నేను దానిని దీసికొని పయ్యెద చెరగున ముడుచుకొని మరల నందటితోడను గలసి యింటికి వచ్చి యేకాంతముగా నావస్తువును విప్పి చూచుకొంటిని. అది యొక దోరమామిడిపండు! ఆసంగతి నేనప్పు డెవ్వరితోడను జెప్పలేదు. చెప్పుట మంచిది యనికూడ నాకుఁ దోఁచలేదు. దేవతానుగ్రహ విషయములును, మంత్ర విషయములును నితరులకుఁ జెప్పినచో నవి ఫల ప్రదములు గావని పెద్దలవలన నేను వినియుంటిని.

ఇంతేకాక యీవిషయమును వేడుకపడి యెవ్వరితోనైనఁ జెప్పినచో నందువలన నొకవేళ నాకోరిక తీరుటయే తటస్థింపనిచో వారియెదుట నేను హాస్యాస్పదురాలను గానా? ఇదినిజముగా భగవత్కటాక్షమే యని నాకు సంపూర్ణ విశ్వాసమున్నది. కాని యొకవేళ నది యీశ్వరాదేశముకాక కేవలము నా మనోభ్రాంతిమాత్రమే నైనయెడలను ఈఫలము దేవీప్రేరితముకాక యెవ్వరి పదాఘాతముచేతనో, కొట్టుకొని వచ్చి నాకాలికిఁ దగిలినదైనయెడలను నేను గొప్పగా నీసంగతి యెవ్వరికైనఁ జెప్పినచో వారు నన్నుఁ బరిహాసింపక మానుదురా?— కాని యీరాత్రియందే జరిగినసంఘటనమును బట్టి యిది నిశ్చయముగా దేవీప్రసాదమే యని గ్రహింపఁగలిగితిని.

*　　*　　*　　*　　*

కాని యెప్పుడు నెడతెగని సుఖానుభవముతో మానవజీవితము గడచుట యసంభవము. మానవ కుటుంబములందలి నైనందిన జీవితములు సుఖదుఃఖముల ఘాతప్రతిఘాతములతోనే జరగిపోవుచుండును. సుఖదుఃఖముల హాసశోకములతోనే మానవలలాటలిపి లీలామయుఁడగు నీశ్వరునిచే లిఖింపఁబడి యుండును.

నానాథుఁడు నిజముగా రోగవిముక్తుఁడై యుండె నని నేనప్పు డనుకొంటిని. నాభర్త దుస్సాంగత్యమును బరిత్యజించి తనవ్యాపారములను

శ్రద్ధతోఁ జూచుకొనుచుండె నని యానందించితిని. అపవ్యయము చేయకుండ నానాథుఁడు ధనసంపాదనమునందే యాసక్తుఁడై యుండెనని విశ్వసించితిని. అప్పు డాతఁడు మూర్తీభవించిన పిశాచమువంటి పాపభావమునకు లోఁబడక యాత్మసంవరణము గావించుకొని స్వధర్మప్రవర్తకుఁడై చరించుచుండె నని యూహించితిని. కాని నిజముగా నట్టిపరిణామ మాతనియందు గలుగలేదని నేను తరువాత గ్రహించితిని. నదీజలము నందలి యంతఃప్రవాహమువలె నాతనిహృదయాంతరమునఁ బాపలీల వ్యాపించియే యున్నది. ఒకనాటిరాత్రి నేనించుక యనారోగ్యముచే మాయత్తగారికి విన్నవించి నాపడకటింటఁ బ్రవేశించి శయనించి యుంటిని. అప్పు డింకను నిద్రపట్టలేదు. నిద్రించుచున్నట్లే పరుండి యుంటిని. నాపడకటిల్లు చాల నిడివియు, వైశాల్యమును గలిగియుండెను. అందుఁ గొంతభాగము నానాథుఁడు దర్శనగృహముగా జేసికొనియెను. నడుమనడ్డముగా నొక చూపుతెడక కట్టఁబడియుండెను. ఆతెడకకీవల నేను పరుండు మంచమున్నది. ఆవలివైపున నాభర్తయుండి తనస్నేహితులకును, బంధువులకును దర్శన మిచ్చుచుండును.

ఆనాఁ డొకమిత్రుఁడు నానాథుని దర్శింపవచ్చెను. ఆతని నొకకుర్చీపైఁ గూర్చుండఁ జేసి నాభర్త నేను శయనించి యున్నచోటికి వచ్చిచూచెను. కాని నన్ను బలుకరింపలేదు. నేనును బలుకరింపలేదు. అందుచే నాతఁడు నేను నిద్రించుచుంటి నని భావించి మరల దన మిత్రుడున్నస్థానమునకుఁ బోయి యాతనితో నిస్సంశయముగా సంభాషింపనారంభించెను. అప్పటి వారి వాక్యోపవాక్యము లన్నియు, వారి పాపప్రవర్తనములం గూర్చియే జరుగుచుండెను. ఆమాటలను వినుచున్న సర్వావయవములందును నగ్నిజ్వాలలు రగులుకొనుచున్నట్లుండెను.

ఆ నీచభాషణములను గూర్చి - ఆమహాపాతక జ్వాలాలీలలం గూర్చి నేను నానోటితో వచింపఁజాలను. ఉన్మిషితంబులగు నానయనము

లశ్రుపూర్ణము లైపోయెను. నాయొడలు గడగడ వడఁకిపోయెను. నా సర్వాంగకములును స్వేదసిక్తము లైపోయెను. ఎంత యడంచుకొనిన నడంగక నిట్టూర్పులు వెలువడఁ దొడంగెను.

అప్పుడు నేను దుఃఖావేగముతో భగవానుని స్మరించుకొని "దేవ దేవా! ఈదీనురాలి బ్రదుకంతయు నిట్టి పాపభాషణముల నాలకించి దుఃఖించుట కేనా? అందు కేనా నన్ను సృజించి బ్రదికించు చున్నావు! నేనెన్ని యెన్నియాశా చంద్రికాకళలను సేకరించుకొని నా యీ సుఖ వాసరములను నిర్మించుకొంటినో వాని నన్నిఁటిని గూడ నీవొక్క-క్షణములో దారుణ వజ్రాఘాతముచేఁ గూలఁ ద్రోయుటకై ముచ్చట పడు చుంటివేల? ప్రభూ! ఇట్టి దుఃఖము మరలఁ గలుగక మునుపే నాకేలమరణము ననుగ్రహింపవైతివి? నాస్వామి విశ్వసింపఁ దగినవాఁడు కాఁడు, హీనచరిత్రుఁడు; సురాపాయి; వేశ్యాసక్తుఁడు - ఇంకను నిట్టిమాటలు వినుచు నేను బ్రతుకవలసినదేనా? ఎవ్వతె భర్త యిట్టి మహా పాతకరాశియో యట్టిదాని కింకను బుణ్యా కర్మాచరణమున కవకాశ ముండునా? స్వామీ! నిన్నుఁ బ్రార్థించుటకైన నామె కధికార మెక్కడిది? అట్లు ప్రార్థింప ననర్హమైన యీజీవనముతో నాకుఁ బనే మున్నది? రమణి యనిన స్వామి సహధర్మిణి. స్వామితోఁగూడి ధర్మా చరణము గావించుచు నీశ్వర చరణరేణు ప్రసాదమును బడయఁ గలమను నాశతోనే నారీమణులందఱును సంసారభారమును నిర్వహించుటకుఁ బ్రయాసపడుచుందురు. వారికి తమది యనున దొక్కటియును లేదు. భర్తృధర్మముం గూర్చి సాహచర్యముం జూపుటయే వారి విధి. వారి ధర్మము. కాని యెవ్వతెభర్త మహాపాపాత్ముఁడో యామె బ్రదుకెందుకు? ఆమె ధర్మాచరణము గావించుట కన్యోపాయ మేమున్నది? పతంగ పశుపక్ష్యాది కోటికోటిజన్మము లెత్తియెత్తి తుదకు బరమదుర్లభంబగు నీమానవజన్మమునుబడయఁగలిగితిని. ఇట్టిసర్వోత్కృష్ట

జీవితము మరల నతి వినిందితంబగు పాశవధర్మ నిర్వాహణమునకే పాలు గావలసి నప్పుడు నిరర్థకమగు నీబ్రతుకుతోఁ బ్రయోజన మేమున్నది? అని యనేకవిధములఁ బ్రార్థించుచు వితర్కించుకొనుచు విలపించితిని.

నా భర్తస్నేహితుఁడు వెడలిపోయెను. నానాథుఁడు భోజనాదికము దీర్చుకొని నా గదిలోనికి వచ్చెను. నేనిఁక నూరకుండఁజాలక పోయితిని. నేనువిన్న సంగతులన్నియు నాతనికిఁ దెలిపి "స్వామీ! నేనిఁక నిశ్చయముగా నాత్మహత్య చేసికొందును. ఎవ్వతెభర్త మహాపాపసక్తుఁ డైపోవునో, యాతని భార్యయుమాత్రము పాపాత్మురాలు గాకుండునా? భార్య యనిన భర్తకు నర్ధశరీరమే గదా! దేహమునందు సగపాలు మహాపాపానల జ్వాలాప్రతప్త మైపోవుచుండఁగా, మఱియొక పాలెప్పటికైనఁ బుణ్యశీతల సుగంధ జలసించిత మై శాంతిసుఖము ననుభవింపఁ గలదా? అట్లిన్నఁటికిని గానేరదు. ఇఁక నే నీయాతన ననుభవింపఁజాలను. తప్పక యాత్మహత్య చేసికొందును!" అని దృఢనిశ్చయముగ్గాఁ బలికితిని.

ఎంతటి పాపాత్ముఁడైనను దన దుష్ప్రవర్తనమును రహస్యముగాఁ గప్పిపుచ్చుకొనఁ బ్రయత్నించుట సామాన్యలోకధర్మము. అట్లే నా స్వామియు మిథ్యావగుంఠనమునందు సత్యమును గప్పివైచి యెన్నియో కల్లమాటలతో నన్ను మఱపించుటకుఁ బ్రయత్నించెను. కాని నే నెంతమాత్రము నాతని మాటలు వినిపించుకొనలేదు. ఆనాఁటి నా మానసికావస్థ యత్యంతమును శోచనీయముగా నుండెను. నేను హృదయావేగముచేఁ దల్లడిల్లిపోవుచు నాత్మహత్య చేసికొనుటకెంత గింజుకొనుచున్నను నాభర్త నన్ను బలవంతముగా నడ్డగించి తప్పించుకొని పాఱిపోవుట కొక్క యదునైనను గదలనీయలేదు. ఆయాసముచే నేనచ్చటనే కూలఁబడిపోయితిని. నా రెండుచేతులు నప్పటికి నాతని ముష్టిబంధమున నిఱికికొని యుండెను. అందుచే నేనటనుండి కదల

లేక పోయితిని. అప్పుడు నేత్రద్వయమునుండియు దుఃఖాశ్రుధారలు ప్రవహించి యాతని హస్తములనుండి జారి పాదములను దడిపి వైచుచుండెను.

కన్నీటికిఁ గఱుకుఱాయైనను గరఁగకమానదని పెద్దల వలన విని యుంటిని. ఎంతటి కఠినహృదయమునైనను గన్నీరు దయార్ద్రముగాఁ జేసివైచును. అట్లే నానాథునిమనసు కరుణరసప్లావిత మైపోయినదోలేదో చెప్పఁజాలనుగాని యప్పటి యాతనిమాటలుమాత్రము నిజముగాఁ గృపారసశీతలములై యుండెను. ఆతఁడు నాచేతు లట్లే పట్టుకొని మృదుస్వరముతో "నీవేల యాత్మహత్య చేసికొందువు? ఇంతవఱకును నీవెన్నియో కష్టములను సహించి యాతనల ననుభవించితివి. ఇప్పుడు నీవింతగాఁ దొందరపడి మనసు చెదర గొట్టుకొనుచుంటి వేమి? ఆత్మహత్య మహాపాతక మని నీవునిశ్చయముగా నమ్ముము! అదికాక నీగర్భమునం దిప్పుడొక శిశువుకూడ నుండెనుగదా! నీవిది యాలోచింపక మరణించినచో శిశుహత్యాదోషముకూడ నీకు దటస్థింపఁగలదు. ఈమహాపాతకములమూలమున నీవెన్నియో ఘోరనరకయాతనల ననుభవింపవలసి వచ్చును" అని బోధించెను.

ఎట్టివానినోటినుండి యెట్టిమాటలు! నరకమా? స్వామీ! ఇహము, పరము, స్వర్గము, నరకము ననునవి యున్నవనుజ్ఞానము మీకు గూడ నున్నదా! అట్లే యున్నచో మీరు నిరంతరమును నరకావాసమే కావించు టెందుకు! గృహస్థధర్మమనియెడు స్వర్గాలోకమయజ్యోతి నార్పివైచుకొని, వేశ్యాలాంపట్యము, దుర్జనసాంగత్యము, సురాసేవనము ననుఘోర నరకాంధకారమునఁ బడి ప్రాకులాడు టెందులకు? అయ్యో ప్రభూ! నీవునిత్యమును వేశ్యాసక్తి యను నరకబాహుబంధనమున బద్ధుఁడవై ప్రేతమూర్తివలె జీవనయాత్రగావించుచుంటివి. నీవు సురాసేవనమను విషభుక్తిచే భ్రమత్తుఁడవై పిశాచగణయుక్తుఁడవై మహారౌరవమునందలి దుస్సహదుర్గంధమును బరమానందముగా భావించి సేవించుచుంటివి

ఇంతటి నీనరక యాతనకంటెను నానరకజ్వాల యధిక కష్టదాయక మగునా? అగుంగాక! ఆత్మబలిమూలమున నేనట్టి నరకావాసము నంగీక రించియైన్ను నీనరకమునుండి యుద్ధరించెదను. విగతజీవితుఁగు నాప్రేత శరీరముం గాంచుటవలన నీహృదయమునందు జ్ఞాన చైతన్యోద్రేకము గలుగునను నాశయే యున్నచో నీదుర్మతి, నీదుష్ట వర్తనము, నీబుద్ధి, నీచిత్తవృత్తులను మార్చుట కవకాశమే యున్నచో — నీ పాపాసక్తియు, దుష్టానురక్తియు, బరిణతములై నిన్ను సన్మార్గమునఁ బ్రవేశపెట్టఁగలిగినచో, నీవు మానవుఁడవై యిహ సంసారమునందు మానవధర్మము నవలంబించుసాధనము నీకు లభింపఁ జేయఁజాలినచో నేను నిశ్చయముగా నీకొఱకు నరకమునందలి యసహ్య యాతనలను సహించి నరకమునందుండియే సదాచారసంపన్నుఁడవగు నీదివ్యసందర్శనముం గావించుచు సుఖముగాఁ గాలయాపనము చేయఁ గలుగుదును!'' అని యనేకవిధముల భావించుకొనుచుంటిని.

పిమ్మట నేను "స్వామీ! స్త్రీజాతికెట్టి స్వాతంత్ర్యమును లేనేలేదు! స్వకీయమగు నెట్టి యవలంబనమును లేదు. భర్తపుణ్యమే యామె పుణ్యము! భర్తసుఖమే యామెసుఖము! భర్తయానందమే యామె యానందము! నాస్వామివగు నీకు మాత్రమీ సంగతి తెలియదా? నిన్నుద్ధరించుటకే నేనీయాత్మహత్య చేసికొనుచున్నాను. ఇది కేవ లము హాహాకార సమన్వితమగు నార్తనాదముతో నిండిన నిష్ఫల రోదనము మాత్రముగాదు! స్వకీయమగు వెన్నెముక మూలమున స్వర్గనాయకుని వజ్రాయుధమును గల్గించుటకై కావించిన దధీచి దేహ త్యాగమువంటిది! అట్టి యీ నాయాత్మహత్య యను వజ్రాయుధముచేఁ జిరకాలసంచితమును, సంసక్తమునగు నీపాపమను వృత్రాసుర జీవితము విధ్వస్తం బగుఁగాక! ఇఁక నన్ను విడువుము! నే నాత్మహత్య చేసి కొందును!'' అని ప్రార్థించితిని.

ఎంతగా నెన్నివిధములఁ బ్రార్థించినను నన్నప్పు డాతఁడు విడువ లేదు. ఆతని దృఢముష్టిబంధమునం బడియున్న నాచేతులు చెమరించి పోయెను. నాసర్వాంగకములునుగూడ స్వేదసిక్తము లయ్యెను. వికచ కుసుమశోభితం బగు వేణీబంధము విడివడి విశీర్ణకుంతలములు ఘర్మ సంసిక్తంబగు వెన్నునను, భుజంబులను, వదనమండలంబునను వ్యాపించెను. అట్టిసమయంబునఁ దెఱచియున్న గవాక్షమునుండి, మలయ పవన డింభకములు చొరఁబడి చెదరినకుంతలముల దూలించుచు, వెలుఁగుచున్న దీపమును వడఁకించుచుఁ, జెమర్చియున్న నాయంగక ముల చెమ్మటల నార్చుటకుఁ బ్రయత్నము గావించుచుండెను.

ఆరాత్రియంతయు మేమిరువురమును గూర్చుండియుండఁగనే గడిచి పోయెను. ఎవ్వరమును శయనింపనైనలేదు; నిద్రించుటయునులేదు!

౧౩

కీటకము దీపశిఖయందుఁబడి భస్మమైపోవును. దానిని బ్రత్యక్షముగ జూచుచుండియు మఱియొకశలభము తానుగూడ భస్మమైపోవుటకై అగ్నిజ్వాలవైపునకుఁ బఱుగెత్తునెందుకు? దీనిమీమాంస యెవ్వరుచేయఁ గలరు? ఎక్కడిమాట! వేశ్యాలోలు రగుపురుషులు సర్వవిధములచేతను విధ్వస్తులై పోవుచుందురు. ప్రకృతిమహాదండముచే శిక్షితులై యారో గ్యము నశించి యతికఠినంబులగు రోగములచే బీడితులై జీవితమంతయు నుపదంశము, రాజయక్ష్మ, మేహము, వాతము మొదలగుక్షయకారక రోగములచే గబళితులై నానా యాతనల ననుభవించుచుండియుఁ దమ దుర్వర్తనమునుండి యించుకంతయును మరలలేకుందురు. సహధర్మిణి లోకాతీత ప్రేమను, తల్లిదండ్రుల యపారవాత్సల్యమును, అక్కచెల్లెం డ్రయు నన్నదమ్ములయు నపూర్వ భక్తిశ్రద్ధలును, బాలబాలికాసంతతుల సకరుణాహ్వానములను బాదములతో దన్నివైచుచుందురు. సామాజి

కులు గావించునిందలను నీచాతినీచములగు నపవాదములను సహించుచుఁ బితృపితామహాదుల స్వకీయ కష్టార్జిత ద్రవ్యముల నన్నిఁటిని నాశనము గావించి మోసకత్తెలగు వారకాంతల మాయాజాలములందు మానవులు బంధితులై పడిపోవుచుందురు. ఇట్లింతకాల మీఁదురాచారము మానవ లోకము నాక్రమించి యుండునో యెంతభావించినను బోధపడకయే యున్నది. ఒక్కొక్కప్పుడు నేనీవిషయంగూర్చి యెంతయో యాలోచించునప్పుడు "మోహము మానవున కొకప్రబల శత్రువై యున్నది. ఆశత్రువు భీకరాకారముండాల్చి మానవుని ఘోరనరక గభీరగర్తమునఁ బడఁద్రోసి బాధలపాలు గావించుచుండును. ఒకసారి యానరక కూపమునఁ బడిపోయిన వారికఁ బైకి రాఁజాలకుందురు. బయటఁబడ వలయునని యాకాంక్ష యున్నను వారికట్లు చేయదగిన సామర్థ్యము గలుగదు. నీటిలోఁ బడిపోయిన వాఁడట్లు తేలి యీదుటకుఁ బ్రయత్నము చేసినను శక్తిలేక మునిగిపోవును. ఆవిధముననే మోహప్రవాహమునఁ బడినవాఁ డెంత ప్రయత్నించినను దీరమును జేరలేక కొట్టుకొని పోవుచుండును. కావున మానవుఁడు ముందుగనే — అనగా మోహ వివశుఁడు కాకముందే సావధానుఁడై యుండవలయును" అని నిశ్చయము చేసికొంటిని.

పెద్దలవలన నేనొకసారి వినియుంటిని. ఏమనిన: - "వార విలాసినులను రమణీపిశాచినులు, పురుష సమూహమును దమ నరకబాహు బంధమునందుఁ జిక్కించుకొనుటకై యనేకహావభావములను బ్రదర్శించుచు, వివిధములగు వేషభూషణాదులచే నాకర్షించుచు వేటకాఁడు వనమధ్యమున సంచరించున ట్లీ భోగకాంతలు సమాజమధ్యమున నిరాఘాటముగఁ దిరుగాడు చుందురు." అని. ఇప్పుడు విచారింపవలసిన విషయ మేమనగా:— ప్రకృతకాలమున సభ్యసమాజ స్థానమునందే యీ పడపు పడఁతుల విహారములు నిరంతరాయముగా జరగిపోవుచున్నవి.

సమాజమునకు వేరు పురుగులవంటి యీ వేశ్యాకాంతల విరూప ప్రచారములు సమాజము కంటఁబడకుండఁ బెద్దలగువారు వీరిని నగరముల నుండి వెడల నడపినచో వందలకొలఁది బంగారమువంటి సంసారములు చెక్కుచెదరక సుఖానంద వాహినులలోఁ దేలియాడు చుండునుగదా! అట్లు జరిగినచో వేలకొలఁది సాధ్వీమణుల చక్షుర్జల ధారలచే నీవిధముగా రజనీవక్షములు ప్లావితములై పోవునా? వృద్ధులగు సహస్ర సహస్రమాతాపితరుల దుఃఖపూరత శుష్కోపవాసము వింతగా నుండునా? కోటికోటి పుత్రికాపుత్ర సంతతుల నిరాశ్రయత యీరీతిగా నతిశయించి యుండునా?

సమాజ శుభాకాంక్షులై యిప్పుడు వేలకొలఁది విద్యానిధులును సమర్థులు నగువారు నడుములు కట్టుకొని బహువిధములఁ బాటుపడు చున్నారు. అందుఁ గొందఱు విధవా వివాహనిర్వహణము, మఱి కొందఱు వరవిక్రయ దురాచార ఖండనమును, గావించుటకై సభా సమితులను నిర్మించుచున్నారు. కొందఱు గ్రామమార్గముల సంస్కరణమునకును, కొందఱు రక్షకభటోద్యోగుల యత్యాచార నిరసనములకును, కొందఱు పల్లీప్రజాచ్ఛిద్ర సంశోధనమునకును బ్రయత్నించు చున్నారు. కాని సమాజమునకు మహావిపత్కారిణులును, సంఘ విధ్వంస నోపద్రవ కల్పనాధురీణులు నగు నీదుష్టరాక్షసీగణము సమాజము గుండెలపైఁ దాండవించుచు వంశధరులగు సుకుమారుల వక్షః పిండములను బగులగొట్టి భక్షించుచుండఁగా నావంక కొక్కరైనను గటాక్షక్షేపము గావించుటలేదు.

నాభర్తకు ప్రవర్తనమునం దించుక దోషముండిన నుండవచ్చును గాని యాతఁడు నాయెడలఁ జూపుచున్న విరూపభావ మాతని శరీ మునం గలిగిన యస్వస్థతచేతమాత్రమే యని నేనిదివఱకు కనుగొంటిని. కాని యాతఁడు నన్నిందు కింత యసహ్యముగాఁ జూచుచుండెనో

యిప్పుడు సంపూర్ణముగా గ్రహింపఁగలిగితిని. పైశాచిక నరకావాస పార్శ్వమున దేవతామందిర ముండుట యాపిశాచమున కిష్టముగా నుండదు. ఒక సత్యవిషయము నిప్పుడు చెప్పఁదలఁచితిని. అది మీా రాలకించి నన్ను నిశ్చయముగా నిందింపక మానరు. కాని నా హృదయ కవాటమును సంపూర్ణముగాఁ దెరచి నా సత్యచరిత్రమును స్పష్టముగా మీాకు నివేదింపవలయునని సిద్ధపడి యున్నప్పుడు, నా దుఃఖవృత్తాంత మంతయు మీాకు నివేదింప సంకల్పించియున్న నాకు — ఏది యెట్లుజరిగినదో, యేది సత్యమో దానిని దప్పక చెప్పితీరవలసిన దే—

నాభర్త నన్నంతవఱకును బ్రేమించి యుండలేదు. నాతోఁ బ్రియముగా సంభాషించుట లేదు. నావంకఁ గన్నెత్తిచూచుట యైనను లేదు. కాని నాకుమాత్ర మాతనియెడల నేమహూర్తమం దైనను నవిధేయత గాని, యభక్తిగాని కలిగియుండలేదు. కాని యానాఁ డాతని మిత్రునితోఁ గలసి యాతఁడు తమ దుర్వ్యాపార ములంగూర్చియు, వారకాంతా విలాసములం గూర్చియు, మద్యపానా సక్తిం గూర్చియు సంభాషించుచుఁ బైశాచికోన్మాదముచే నానంద తాండవము చేయుచు నాడిన మాటలు వినినప్పటినుండియుఁ గ్రమక్రమ ముగా నాకాతని యెడలంగల భక్తిభావము నశించిపోవుచుండెను. క్రమముగా నాతఁడనిన నా కసహ్యభావము గలుగుచుండెను.

ఇది నాపక్షమున నతివినిందితమగు మహాపాతకమే యని నాకుఁ దెలి యును. అయినను నేనెన్నివిధముల బ్రయత్నించినను హృదయావేగము నడంచుకొనలేక స్వామిభక్తి యను పరమపుణ్యవ్రతదీక్షనుండి క్రమముగ వంచితురాల నైపోయితిని. నాభర్తను దర్శించినంతనే “ఈతఁడు పరమ సుఖదంబగు స్వర్గధామమునుండి పదచ్యుతుడైఁపోయినాఁడు. ఈతఁడు మాయాకాశమునందలి విషఫలముల నారగించి పిశాచరూపియై పోయినాఁడు! ఈతఁడు నరకలోకమునందు నీచాతినీచంబగు నధోభాగమం

దున్న దుర్గంధమయద్రవపూరిత మృద్భాండమును నెత్తిపైఁ బెట్టుకొని నాయెదుట గంతులువైచుచుఁ బరిభ్రమించుచున్నాఁడు!" అనినామనసు నకు దోఁచుచుండెను. అట్టిస్థితిలో నాతఁడు పరమేశ్వరుని ప్రతినిధిస్వరూపుఁ డని నేనెట్లు భావింపఁగలను? ఎట్లాతని పాదపీఠసన్నిధిని నాహృదయకమ లమునర్పించిభక్తికుసుమమాలికలచే నలంకరింపఁగలను? ఎట్లాతనినాజీవిత మార్గదర్శియగు శ్రీకృష్ణభగవానునిగా నెంచి సంసేవనము గావింపఁగలను."

అయినను నామనసు కుదురుపరచుకొనుట కెన్నియోవిధముల ప్రయ త్నించితిని. కాని నామనసు తేరుకొనుట లేదు. అందువలనగూడ నాకు మఱియొక దుఃఖము సంభవించెను. "ఈ మానవజన్మమే దుర్లభ మైనది. అంతకంటెను నుత్తమంబగు రమణీయజన్మముం గాంచియు నెట్టి యున్నత మార్గమును బడయఁజాలక యధోగతికిఁ బాలై పోవుచుంటిని. ఈ స్త్రీజన్మము సామాన్యమైనది గాదు. శాంతభావముతో ననంతుఁ డగు పరమేశ్వరునిగా నెంచి ప్రాణేశ్వరుని సేవించు మహాభాగ్యము — అట్టి యధికారము మానినీమణికిఁ గాక మఱి యెవ్వారికున్నది?" అని భావించుకొనుచు నామనశ్చాంచల్యముం గూర్చి నిందించుకొనుచు నిర్భాగ్యురాలనై దినములు గడపుకొనుచుంటిని.

అప్పుడప్పుడు నానాథుని కించుక బోధింపఁబోయి యాతని తాడన పీడముల ననుభవించుచుంటిని. ఒక్కొక్కప్పుడు సురాపాన మదమత్త ప్రలాపియు, వికృతాకారుఁడును నగు నాథుని పైశాచిక భావభంగులను దర్శించి మొత్తుకొనుచు నాతని శయ్యాపార్శ్వమునం బడి యతిదుఃఖ ముతో రాత్రులు వేగించుచుంటిని.

మానవులు సుఖింతురుగాక! దుఃఖింతురుగాక! ఎట్లయినను దిన ములు గడచి పోవుచునే యుండును. అట్లే నాకుఁ గూడఁ గాలక్షేప మగుచుండెను. కొన్నాళ్ళకు మామామగారు నన్నును, మాయత్త గారిని వెంటఁ బెట్టుకొని కలకత్తానుండి స్వగ్రామమునకుఁ దీసికొఁ

వచ్చెను. అచ్చట నామామగారు స్వగృహమునందు దన యభీష్టాను సారముగా నాచే బంచామృతసేవనము చేయించి బ్రాహ్మణ సంతర్పణ మును మహావైభవముతోఁ గావించి మరలఁ గలకత్తాకుఁ బోయెను.

మరల నాశ్వీజమాసము వచ్చినది. మరల దేవీపూజా మహోత్స వాదులు దేశప్రజల కన్నులపండువుగా జరగుచుండెను. ఆపర్వదినము లలో నాభర్త మాయింటికి విచ్చేసెను. కొన్నాళ్ళు స్వభవనమందు నివసించియుండి యాతఁడు మరలఁ గలకత్తాకుఁ బోవుటకై ప్రయత్నము చేయుచుండెను. అప్పుడు నేనాయన యుద్దేశము గ్రహించి మెల్లగా "నన్నుఁగూడఁ గలకత్తాకుఁ దీసికొనిపొండు" అని యడిగితిని.

ఆతఁడు — నీవిప్పుడు కలకత్తా వచ్చుటెందుకు?

నేను — ఇప్పుడు నాశరీరస్థితి బాగుగ లేదు. ప్రసవసమయమున నెట్టి కష్టము గలుగునో చెప్పఁజాలను.

ఆత — అట్లయినచోఁ గలకత్తాలో నెవ్వరైన నీవంతుప్రసవించి నీకష్ట మును నివారింపఁ గలరనియా నీయుద్దేశము!

నేను — అది యెట్లు జరగును?

ఆత — జరుగనప్పుడు నీప్రయాణ మెందుకు!

నేను — ఇచ్చట మంచిమంత్రసానులు దొరకరు.

ఆత — అట్లయిన నీగ్రామమందెవ్వరును బ్రసవించుటయే లేదా?

అప్పుడాతనిమాటలలోని స్వరభంగినిబట్టిచూడఁగా నేనుకలకత్తాకుఁ బోయి యాతనితో నున్నచో నాతనినిత్యమహాపాతక ప్రవర్తనముల కంత రాయమగునని యాతఁడు భావించుచున్నట్లు తోఁచుచుండెను. ఏమైన నేమి! ఆతఁడుకొన్నాళ్లుమాత్ర మిటనుండి తరువాత నొక్కఁడును గలకత్తాకుఁ బోయెను.

తరువాత నొకటిరెండుమాసములకు నాకుఁ బ్రసవసమయము తటస్థించెను. "ఈసమయమునందుఁ దప్పక మీయింటియొద్ద నుండుట మంచిది.

ఇంట మగవా రెవ్వరును లేరు. కోడలిశరీరస్థితియంతయు జబ్బులతో నిండియున్నది. ప్రసవసమయమునం దేట్టికష్టము గలుగునో యని భయముగానున్నది. ఆఁడువాండ్ర మేమి చేయఁగలుగుదుము!'' అని మాయత్తగారు మామగారికి జాబువ్రాసి పంపెను. ఉత్తర మందినంతనే మామగారు తమకుమారునింటికి బంపుటకుఁ బ్రయత్నించిరఁట. కాని యాతఁడు తనపిశాచఖేలనప్రేతభూమియగు కలకత్తాను విడువఁజాలక తాను లేకున్నచో నప్పటివ్యాపార సంబంధములగు పనులన్నియుఁ జెడిపోవునని చెప్పి యంగీకరింపలేదఁట! ఈసంగతులు నాకుఁ దరువాతఁ దెలిసినవి. ఆయనచెప్పిన యసత్యవచనము లన్నియును సత్యములే యనుకొని నమ్మి స్వాయముగా మామగారే బయలుదేఱి యింటికివచ్చిరి.

మామగారు వచ్చిన కొన్నాళ్లకు నేనుప్రసవించితిని. మగశిశువు కలిగెను. ప్రసవించినప్పటినుండియు నేనతికష్టతరంబగు జబ్బునపడిపోయితిని. అంతవఱకును లోపల నడిగియున్న రోగము లన్నియు నొక్కసారిగా విజృంభించి శరీరమంతటను వ్యాపించినన్నే నేకవిధములబాధించుచుండెను.

మా పల్లెటూరియందు సాధ్యమైనంతవఱకు మాయత్తగారు వైద్యులను బిలిపించి నాకుఁ జికిత్సలను జేయించుచునే యుండెను; కాని యందువలన నాకెట్టియారోగ్యమును గలుగులేదు. మాచుట్టుప్రక్కలనెచ్చటను ఆడుడాక్టరులేదు. మంచివైద్యులునులేరు. అంతేకాక యేపాడురోగములన్నియు నాశరీరము నలమికొని బాధించుచున్నవో వాని నన్నిఁటిని గూర్చియు వైద్యులకు స్పష్టముగా జెప్పుటకు నేను సిగ్గుపడుచుంటిని.

ఈవిధముగా గొన్నాళ్ళు గడచిపోయినవి. అప్పుడు మామగారు తన కుమారునకు "నీవొకసారి యింటికివచ్చి కుమారముఖసందర్శనము చేయవలయును. ఇది గృహస్థులకు బరమధర్మము'' అని యుత్తరమువ్రాసెను. ఆజాబు జూచుకొనియును నాభర్త యింటికిరాలేదు. ఒకనెలదినములకు నేను దుర్గాపూజాదికమును దీర్చికొని పురిటింటినుండి బయటఁబడితిని.

ఆయన యింటికివచ్చుటగాని, కుమారుని దర్శించుటగాని లేకపోవుటచే నేనప్పుడెంతగా మనోవేదన ననుభవించితినో స్పష్టముగా మీకెట్లు నివేదింపఁగలను? కాని యాతని కెంతమాత్రము నావిషయము తోచనేలేదు. మానవోచితంబగు సదుద్దేశము లాతని యందు గొంచమైనను లేవు. ఏమైనను నేను కొన్నాళ్ళీరీతిగా విచారించి యెన్నియోవిధముల నాలోచించుకొని తుదకాయన కొకయుత్తరమును వ్రాయ నిశ్చయించితిని. "స్వామీ! మీరింత కాలమైనను మీకుమారు నొకసారి చూటకైనను రాలేదు. ఇందువలన నాకును మీతల్లిదండ్రులకును జాలమనఃకష్టముగా నున్నది. విశేషించి నా దేహము వివిధరోగములచే విశీర్ణమై యున్నది. ఆజబ్బులనుగూర్చి మీకిదివఱకే మనవి చేసియున్నాను; కాని మీరంతగా లక్ష్యము చేయలేదు. నేనిప్పుడా జబ్బులచేతనే బాధపడుచున్నాను. ఇప్పుడునాకు మరణము సుఖదాయకమును వాంఛనీయము నైయున్నను జచ్చినచో నీకుమారుఁడుకూడ నేమైపోవునో యనుభయముచే మరణ బాధ లనుభవించుచు నెట్లో జీవించియున్నాను; కాని బ్రతుకుదునని యాశలేదు. నామాట కేమి? మీకుమారుఁడు బ్రతుకవలయునని మీకుఁ గోరికయేయున్నచో నీయుత్తర మందినతోడనే యింటికి రావలయును. నాకిప్పుడు గలజబ్బులన్నియు మీకేకాని యితరులకు దెలియఁజేయఁదగినవి కావు!" అని వ్రాసిపంపితిని.

నాయదృష్టముచేనైననేమి, కుమార ప్రేమాకర్షణముచేనైననేమి? యుత్తరమందగానే బయలుదేఱి నాభర్త మాయింటికి విచ్చేసెను. తరువాత నాతఁడు నావలన నాజబ్బులంగూర్చి విని తనతల్లితో "కలకత్తాకుఁ బోయినగాని నీకోడలి జబ్బుకుదురుట కవకాశము లేదు. అచ్చటఁ జాలమంది మంచి డాక్టరులున్నారు" అని చెప్పెను.

ఇంటివారందఱునుగూడ నాతనియాలోచన నంగీకరించిరి. పంచాంగము చూచి యొకశుభదినమున మేమందరము బయులనమై కలకత్తాకుఁ

బోయితిమి. అచ్చట నొకవిశాలమైనగృహము నద్దెకుఁ దీసికొని యచ్చట నివసించుచుంటిమి.

తరువాత రెండుమూడుదినములలో నొక యూడుడాక్టరును పురుష వైద్యుఁడునుగూడ వచ్చి నారోగమును బరీక్షించి "ఇటువంటి యింటిలో నున్నచో నీజబ్బు కుదురుటకష్టము. మంచిగాలియు వెల్తురునుగల ప్రశస్తమైనభవనము కావలయును. కొంతవఱకు శస్త్రచికిత్సచేయవలయును. కొన్నాళ్ళు మందులను సేవింపవలయును. అట్లుచేసినచో నీశ్వరానుగ్రహమున నీమె కారోగ్యము గలుగవచ్చును" అనిచెప్పిరి.

వారి యుపదేశాను సారముగా మామగారు సర్వకార్యములను గావించిరి. కాని యీవిషయమున నధిక ధనవ్యయ మగుచుండెనని నాభర్తకుమాత్రము మనఃకష్టముగా నుండెను. అదిచూచి నే నాతనితో "ఇప్పుడుమీరు కర్చెక్కువ యగుచున్నదని విచారించిన నేమిలాభము! గోటితోగిల్లి తీసివేయవలసినదానిని గొడ్డలితో నరకవలసివచ్చినది. ఇది వఱకు నేను మీతోఁ జెప్పినప్పుడే నన్ను మీరు కలకత్తాకుఁ దీసికొని వచ్చినచో నాకింతజబ్బును జేయకుండును; మీకింతడబ్బు కర్చగుచున్న దను విచారమును లేకయుండును" అని చెప్పితిని.

## 14. ఏకాగ్రత

నేను రోగశయ్యయందుఁ బడి యతి దుస్సహంబులగు యాతనలఁ బడుచుంటిని. అందుచేత నాబిడ్డకుఁ జేయవలసిన యుపచారాదిభారము లన్నియు మాయత్తగారినెత్తిపైఁ బడియెను. చికిత్సకులు చెప్పిన యౌషధములు, పథ్య వస్తువులు మొదలగువానిని నమకూర్చుటకై మామగారు కష్టపడుచుండిరి. ఇఁక నాస్వామియో, నూతనముగాఁ గుమారునిగన్న తండ్రి, నాయిహపరంబుల కాశ్రయుఁడు, నా ప్రత్యక్ష

దేవతామూర్తి — నిత్య నియమానుసారముగా వేశ్యాసక్తుఁడై సురాపానలోలుఁడై యథేచ్ఛముగఁ బ్రవర్తించుచునే యుండెను.

మర్మాంతికంబగు నప్పటినా నానోవేదనను, హృదయ విదారకంబగు నాదుఃఖావేగమును బురుషపాఠకులు గ్రహింపఁజాలరు. సోదరీమణులగు స్త్రీ పాఠికలలోఁ గూడఁ జాలమంది తెలిసికొనఁజాలరు. వారవనితా జనానుగామియు, సురాపాన మదవిహ్వలుఁడును, స్వజనాభిమాన శూన్యుఁడును, గురుజన సేవా విహీనుఁడును, భృత్యపోషణ కృపారహితుఁడును, కుటుంబోపయుక్త ధనార్జనావిముఖుఁడును, అమితవ్యయ సహస్ర హస్తుండును, సహధర్మిణీ విరక్తుండు నగుభర్తచేఁ దిరస్కృతయగు యువతి కింక నాశాధారము లేమున్నవి? ఆమె దుఃఖదైన్యముల కవధి యెక్కడ నున్నది?

ఔషధములకును, బథ్యపానములకును, నెట్టిలోపమును జరగుట లేదు. కాని నారోగముమాత్ర మించుకంతయు నుపశమించుట లేదు. నేనెంతప్రయత్నించినను నాహృదయమం౯ చారమును దూరము చేసికొనఁ జాలకుంటిని. ఆశ్రయతరుమూలము కీటకదష్టమై పోవుచున్నప్పుడు తదాశ్రితములగు శాఖాసహస్రము లెట్లు పల్లవకుసుమశోభితములు కాఁగలవు?

నాకు మొదటఁ దెలియలేదు- తెలిసినచో నీయామరక్షేత్రము నందు మరణశయ్యను స్వహస్తములతో సవరించు కొనకయే యుందును. అయ్యో "నాకిదివఱకుఁ దోఁచలేదు — తోఁచినచో శ్రీ భగవానుని పాదసన్నిధానమున సుఖప్రార్థనమును గావింపకయే యుందును. సుఖమును వాంఛించినచో దుఃఖమునుగూడ ననుభవింప వలసివచ్చు నని నాకప్పుడు బోధపడలేదు. సుఖముతో దుఃఖమును, జీవితముతో మరణమును గలసియే యుండును.

నేను పూర్వము కష్టపడుచుండు దుర్దినములలో శ్రీభగవానుని చరణ

కమలసాన్నిధ్యమునందు నాసుఖముంగూర్చియు, నానాథునియారోగ్యముంగూర్చియు, సంతానముంగూర్చియు, కుటుంబాదాయముంగూర్చియు, భోగవైభవములంగూర్చియు, నాకాంక్షించి ప్రార్థింపకయేయుందునేని, కేవల మీశ్వరనామస్మరణము గావించుచుఁ దదేకాయత్తచిత్తనై మాత్రమే యుండఁగలిగితినేని పరమేశ్వరుఁడు నాయెడలఁ గరుణించి నాయాత్మోన్నతిపథమును జూపించి వాంఛనీయం బగు నిరవధికసుఖపథమునే ప్రసాదించి యుండునుగదా!

దేవుఁడప్పటి నాప్రార్థనానుసారముగా సుఖమును దయచేసెను; సుఖానుభవమున కవకాశమును గల్పించెను — నాప్రార్థనమును మన్నించెను. కాని సుఖమును గోరినచో దుఃఖమును వచ్చునని చెప్పియుంటినిగదా! అట్టిచో నిఁక సుఖభోగములనుమాత్ర మనుభవించుచు ననివార్యములగుదుఃఖములను త్యజించుట యెట్లు?

దారి తప్పిపోయిన గ్రుడ్డివాఁడు ప్రాంతర మధ్యమునఁబడి దిక్కు తెలియక పరిభ్రమించు చుండును. ఎంతతిరిగినను నాతని కాశ్రయ స్థానము లభింపదు. అయినను నాతఁడు గంతవ్యమార్గము కొఱకు తడవులాడుకొనుచునే శ్రమపడుచుండును. అట్టి సమయమునఁ గన్నులున్నవాఁ డెవ్వఁడైన దూరమునుండి యాతనిం జూచి పిలిచి మంచి త్రోవ నీకుడిచేతివైపున నున్నదని బోధించును. అయినను నాతఁడు వినక తన యిచ్చవచ్చినట్లే పోవుచో తనస్థానము నెట్లు చేరఁగలఁడు. అట్లే దుష్కర్మ పరాయణులగువారు తమహితమునకై బోధించిన సదుపదేశములను నిరాకరించి యసన్మార్గముచే యవలంబించి యధోగతు లగుచుందురు. నానాథుని కట్టిదుర్దశయే సంభవించెను! మోహాంధ నయనుఁడై యాతఁడు తనజీవితసత్పథమును గానలేక యసన్మార్గము నాశ్రయించి పోవుచుండెను. ఆత్మీయులయొక్కగాని, పెద్దలయొక్కగాని, నాయొక్కగాని సదుపదేశము లాతనిచెవులకు విషప్రాయములై పోయెను,

మరియొకమాట — మానవుఁడేకాగ్రచిత్తముతోఁ బ్రాణపణముగాఁ బ్రయత్నించి యేది వాంఛించిన దానిని బడయ గలఁడు. ఇదినిత్యసత్యము! ఆసమయమునందు నాస్వామి త్రికరణశుద్ధిగా నొక నూతనమహాపాతకప్రలిప్తుఁడై తదనుభవముం గాంచుచుండెను. రాత్రులయం దాతఁ డింటియం దుండుట లేదు. కాని యంతమాత్రముచే నేనాతనియెడల నది యొకదోసముగా భావింపలేను. అత డేదోషము గావించిన నేమి? దానింగూర్చి తెలిసికొనవలసిన ప్రయోజనము నాకెంత మాత్రమును లేదని యూరకుంటిని. భోజనమైనతరువాత నాతఁ డింకొక యింటిలోనికిఁ బోయి శయనించుచుండెను.

భోజనమైనతరువాత రాత్రులయందు నాభర్త తనమిత్రులతోఁ గలసి నిజముగా నచ్చటనో విలాసముగా స్వేచ్ఛగాఁ గాలక్షేపము చేసి మునుపు మేమద్దెకుఁ దీసికొన్న యింట శయనించుచుండెను. మేము వెనుక కలకత్తానుండి వచ్చునప్పుడు మా సామానంతయు నచ్చటనే యుంచి యుంటిమి. ఇప్పు డావస్తువులన్నియు మేమున్న యింటికిఁ దెచ్చుకొంటిమి గాని యేఁడాదియద్దెయు ముందే యిచ్చుటచే నాయిల్లింకను మాయధీనమందే యుండెను. అది మావ్యాపారస్థలమునకు దగ్గఱ. అందుచే నానాథుఁ డచ్చటనే శయనించుచుండెను.

## 15. విపరీతమార్గము

ఆసమయమునందలి సంగతులు తరువాతఁ జాలకాలమునకు నేను నానాథునివలన వినియుంటిని. అట్లు నేను విన్న విషయములు వినిన విధముననే విన్నవించుచున్నాను.

నాభర్త రాత్రులు శయనించుచుండు గృహమున కుత్తరపార్శ్వమునందలి యొకమందిరమునం దొక పెద్దమనుష్యుఁడు తనకుటుంబముతో వాసము చేయుచుండెను. ఆయింటియం దొకసుందరీమూర్తి నానాథుని

దృష్టిమార్గమునకుఁ బధికురా లయ్యెను. అప్పు డాతని చిత్తవృత్తి యితరవిషయములను చటాలున మఱచిపోయెను. పాపాసక్తచిత్తులగు వారి మనోవృత్తు లన్నియును బాపభావాపన్నములే యైయుండును. మేఘగర్జనముచే నదీజలము కలఁగి యుచ్ఛ్వసితమైకూలముల దాటి తటోపరిభాగమున కెగసిపడునట్లే, నాస్వామిసౌందర్యోపభోగవాంఛ పొంగిపొరలి యొడ్డుద్రెంచుకొని యామార్గమునఁ బ్రవహింపఁదొడంగెను. ఆతఁ డాసురాంగనరూపరాశింగాంచి మనసు ద్రిప్పుకొన జాలకపోయెను. సతీమణిసతీత్వమును భంగపరుపఁజూచినచో, కులాంగన కులగౌరవమును ధ్వంసము గావింపఁదలఁచినచోఁ దుదకు నిశ్చయముగా దుఃఖము నను భవింపవలసి వచ్చునని యాతఁ డూహించుకొనలేదు.

కొన్నిదినములవఱకు నాతఁ డామెనుగాంచుచుఁ గాంచుచు నెప్పుడు హృదయజ్వాలచే మిగుల దగ్ధుఁ డగుచుండెనో యప్పుడే యామె నెట్లయినఁ దనమాయాజాలంబున నిరికించుకొని తనఘోరపాపాభిలాషను దీర్చుకొనఁదలయునని ప్రయత్నించుట కారంభించెను. అందుకొఱ కాతఁ డాయింటిదాసి నాశపెట్టి తనకు, సహాయురాలిగాఁ జేసుకొనెను. ఒకనాఁ డాదాసి యింటిపనులను ముగించుకొని వీధినిబడి పోవుచుండఁగా నాతఁడు దానిని బిలిచి యాదరించి తనయింటికిఁ దీసికొనివచ్చి యతి మధురంబులగుపలుకులతో "నీవు పనిచేయుచున్నావే! ఆయింటివా రేజాతివారు?" అని ప్రశ్నించెను.

కలకత్తా యందలిగృహపరిచారికలలో మంగలిక త్తెలు చాలవఱకు ధూర్తలక్షణములు గలవారును, దుశ్చరిత్రలు నైయుందురు. విశేషించి బజారునందు క్షౌరములు చేయుజాతివారే యావిధముగా సంసారుల యింటిపనులను జేయుచుందురు. ఆమాటవిని యామె "ఏమిబాబూ అట్లడుగుచున్నారు?" అనియెను.

స్వామి — చెప్పఁగూడదా?

మంగ — కాయస్థులు.

స్వా — వారు కాయస్థులైనచో హిందువులేకదా! క్రైస్తవుల మాదిరిగా దుస్తులను ధరించుచున్నారేమి? స్త్రీపురుషులదుస్తు లన్నియు నట్లే యున్నవి. పీఠనుండి పోవునప్పుడు నేను తలచుచుగాఁ జూచుచున్నాను.

మంగ — వారుహిందువులే. కాని యిప్పటి కలకత్తానగర వాస్తవ్యులలో, జాలమంది యనేకవిధములగుదుస్తుల నిట్లే యలంకరించుకొని జాతిరీతులు తెలియకుండ సంచరించుచుండుట నీవు చూడలేదు కాబోలును! దుస్తులే కాదు. భోజనభాజనాదులలోఁగూడ వారిపద్ధతి యటువంటిదే. ఏమి? ఇప్పుడు మీ రాయింటివారింగూర్చి యిట్లు ప్రశ్నించుటకుఁ గారణ మేమి?

స్వామి — కారణ మేమో నీకుఁ దెలుపవలయు ననియే నిన్నుఁ బిలిచితి! కాని యిప్పుడు నేను నీతోమాటాడినసంగతు లెవ్వరికిని దెలుపనని యొట్టుపెట్టుకొనవలెను. నీవు చేయఁగలిగినచో, నాకోరికను దీర్పఁగలిగినచో, నామరణయాతనను దొలఁగించుటకు సమర్థురాలవు కాఁగలిగినచో నీకుఁ గావలసినంతధనము నిచ్చెదను. నీవు నేను చెప్పినపని చేయఁజాలకపోయినచో నీసంగతిమాత్ర మెవ్వరికిని దెలియనీయకుము. నీవు చేయఁ జాలకపోయినను శ్రమపడినందుకుఁ నీకు గొంత పురస్కారమిచ్చెదనులే!

మంగ — (మందహాసము చేయుచు) ఈకలకత్తానగరమునందు దాసీజనము చేయఁజాలనిపని యుండునా బాబూ! సూదిదూరఁజాలనిచోట గునపమును బ్రవేశపెట్టునంతటిశక్తి మాయొద్ద నుండును.

స్వామి — అందుచేతనే నిన్నుఁబిలిచితిని. చూడుము; ఈయింటియందొకమనోహరభువనమోహినిమూర్తి నివసించియున్నదే; ఆమెను నేనెంతప్రయత్నము చేసినను సంపూర్ణముగా దర్శింపనైనలేకపోయితిని.

వచ్చుచుఁ బోవుచుండఁగా నొకానొకప్పు డలక్తరాగరంజితంబులగుచరణ కమలములు మొదలుగ దుకూలవసనావృతంబులగు నూరువులపర్యంత మును — మఱియొకప్పుడుగవాక్షరంధ్రములనుండి యాకర్ణవిశ్రాంతము లగు నయనకమలద్వయమును, మఱియొకప్పుడు వినిర్ముక్తకవాటద్వార పార్శ్వమునుండి కమనీయనితంబగౌరవసౌభాగ్యములను, మనోహరగ్రీవ భంగీవిలాసమును మాత్రమే చూచిచూచి ముగ్ధుఁడనై తపించిపోవు చున్నాను.

ఆమాటలు విని యా దాసి - అమంగలిది - దుశ్చరిత్రయగు నాపిశాచి నాస్వామిని వలలో నైచుకొనఁ దగినసమయము లభించినదిగదా యని సంతోషించుచుఁ తనలో "ఈతఁడు తరుణవయస్కుఁడగు స్వతంత్రుఁడు; ధనవంతుఁడు; బంగాళీబాబు; శలభమువలె నగ్నిజ్వాలలోఁ బడుటకు సిద్ధముగా నున్నాఁడు; ఈసమయమున రత్ననిధివలె నాకంటఁ బడి నాఁడు: నేనీతని వశపఱచుకొని యీతని రుధిరమాంస మజ్జాసహితముగ సర్వాంగకముల నెంతవఱకుఁ గబళింపఁ గలుగుదునో గదా! కాళీ మాతయు, జాహ్నవీ జననియు నన్నుఁ గటాక్షించినారు; ఇఁక నింతటి నుండిఁ నాకు బ్రతిద్వారము నాశ్రయించి గోళ్లుతీయుట, తలలుదువ్వుట, మొదలగు నీచవృత్తిచే శ్రమపడి పొట్టనింపుకొనవలసిన దౌర్భాగ్యము వదలిపోవును!" అని నిశ్చయముగా భావించుకొని యానందించి యుండును. అందుచేతనే యీయామె మృదుల స్వరముతో "ఏమిబాబూ! సుందరి యగు నారమణీమణితో నీకేమి పనియున్నది?" అనిప్రశ్నించెను.

స్వామి — నీకు మొదటనే చెప్పితినిగాదా? ఆమెను గాంచి నప్పటి నుండియు నామనసు నాలో లేదు.

మంగలిది పకపక నవ్వెను. ఆహాసము భీకరాశని గర్భితమై యున్నను, దానిప్రథమ వికాసము దాహార్తుని శుష్కకంఠనాళమునందు శీతలమధుర జలధారాసేచకముబోలి యాశాద్యోతకమై యుండెను.

అట్లే నవ్వుచు, నవ్వుచు నామె "బాబూ! నేను మంగలికత్తెను; ఇంటింటికిని బోయి కావలసిన గొప్పవారి యిల్లాండ్రను నఖ శిఖాంతము నలంకరించుచుండుట నాపని. ఈప్రక్కయింటికిఁ గూడఁ దఱచుగ వచ్చుచు బోవుచుందును. నీవా సుందరీమణి యెవ్వరో యెఱుంగవు. ఆమె పేరైన నీకు దెలియదు. ఆమెను సంపూర్ణముగఁ జూడనైనలేదు. ఇటునటు దిరుగుచున్నప్పుడు మెఱుపువలెఁ దళుక్కున మెఱసి చటుక్కున మాయమైపోవు చుండుటచే నీప్రాణము చలించి పోవుచున్నది! ఇంతేనా నీవుచెప్పినది?

స్వా — ఔను. భగవంతుఁడు నాకుఁ దగినదాన వగు నీపరిచయమును గలిగించినాఁడు. ఇఁక నాయాశ ఫలించునని తోఁచుచున్నది. నీవు కేవలము మంగలికత్తెవే కావు! రసికురాలివలెఁ గూడ నగపడుచున్నావు!

మంగ — ఇఁక బాబుగారి పప్పుభోజనము వలన రసమంతయు నింపి శర్కర గాఁగలదు. నా యీ దినకృత్యమువలన గడుపే నిండుట లేదు. విశేషములేమి! చెప్పుఁడు!

స్వామి — చెప్పుట కేమున్నది నామొగము? ఇంతటి సరసురాలవయ్యును దెలిసికొనలేవా?

మంగ — తెలిసినదిబాబూ! తెలిసినది? ఆయువతి నీకుఁ గావలయును. ఇంతేనా?

స్వామి — నేను నిన్నింతగాఁ బ్రార్థించు విషయ మదియే — ఇప్పుడు నేను నీదయాధీనుఁడనై యున్నాను. నీవు నాకోరికను దీర్చినచో నీకుఁ దగినబహుమానము చేసెదను. నిన్ను సంపూర్ణముగా సంతోషపెట్టెదను.

మంగ — ఇప్పు డామెసంగతి చెప్పి పోయెదను; తరువాత బ్రయత్నించెదను. ఏదినమున నేమిజరిగించితినో యెప్పటికప్పుడు వచ్చి మీకుఁ జెప్పుచుందును. ప్రయత్నము బాగుగ జేసినచోఁ ఖులికన్నయునను

సంపాదింపవచ్చును. ఏమి జరుగునో చూతము!

పాపవికారచిత్తుఁ డగు నాస్వామి యప్పుడు తొందరగా దన ప్రక్క-నున్న పెట్టెను దెరచుచు మరల నాత్రముతో "చెప్పుము? ఆమె యెవ్వరో నాకు జెప్పవా?" అనియెను.

మంగ — ఆమె యీగృహయజమానుని సోదరి.

స్వామి — సధవయా? విధవయా?

మంగ — పేరునకుమాత్రము సధవయే కాని, యునికిని బట్టి విధవ యనియే చెప్పవచ్చును.

స్వామి — అదియేమి?

మంగ — ఆమెకు భర్తయున్నను నిచ్చట లేఁడు. చిరవియోగిని! ఆమెభర్తయూరు మీదేశమునందే యున్నది. ఆతని తండ్రి సకుటుంబముగ నిట నుద్యోగమునం దున్నప్పు డీయువతి నాతని కిచ్చి పెండ్లి గావించిరి. తరువాతఁ గొన్నాళ్ళ కాతని తండ్రి మరణించెను. అప్పుడు వారందఱును స్వదేశమునకుఁ బోవుచు నీమెనుగూడఁ బంపవలయునని యడిగిరి. కాని దూరదేశమగుటచే వీరామెను వారితోఁ బంపలేదు. ఆకారణముచే నీయుభయ కుటుంబములకు మనస్పర్ధలుకలిగినవి. వారు తమదేశమునకు బోయిరి. తరువాత నాతఁడు మఱియొక వివాహము చేసికొనియెను. అప్పటినుండియు నీమె భర్తృపరిత్యక్తయు, స్వామిపరిగ్రహమున కనర్హయునై యున్నది.

ఆమాటలు వినుచున్న నాస్వామి యప్పుడే మోహాంధకార నిమగ్నుఁడై పోయెను గాని యట్లే కాకున్నచో మంగలికత్తె ముఖభావమును, స్వరభంగియుఁ గనుపెట్టి యిదియంతయు నసత్యమునే చెప్పుచుండె నని నిమిషములో గ్రహించియే యుండును. కాని ముగ్ధుఁడగు నాతఁ డప్పుడు మంగలికత్తె యసత్యము నెందుకు చెప్పునని యనుకొనెను. నాయదృష్టదేవత యెల్లయెడల సుప్రసన్నయై యున్నట్లే యీ

విషయముకూడ సుఖముగనే యున్నదని భావించి "అవ్వా! అట్లయినచో ననుకూలముగనే యున్నది. నీవించుక ప్రయత్నము చేసినచో దప్పక నాయాశ ఫలించును!" అనియెను.

మంగ — అట్లుకాదు బాబూ? ఈ కార్య మంత సులభమైనది కాదు. ఆమె నడవడి చాల మంచిది! శివపూజ చేసుకొనకుండ మంచినీళ్ళయినఁ ద్రాగదు. దేవబ్రాహ్మణభక్తి, గృహకృత్యానురక్తి, సద్గ్రంథ పఠనాసక్తియు నామెకున్నంత మఱియొకరి కుండునని తోఁచుట లేదు. రూపమున్ మాత్ర మప్సరస్సౌందర్యము! కాని యావంకఁ జూచువా రెవ్వరు? అడవిపువ్వుల నెవ్వరును వికసింపఁ జేయుట లేదు. సమయము వచ్చినప్పుడు తమయంత దామే వాయువాహినియందు వికసించి రాత్రియంతయును సుగంధదానముచే బాటసారులకు ఘ్రాణతర్పణము గావించుచుండును. ఆమెకూడ నటువంటిదే.

ఆమె యిట్లు నానాథుని మొగము చూచి చెప్పుచుండఁదనలో లోపల నవ్వుకొనుచు నీవంటి పాపాసక్తుఁడగు నున్మత్తుని తలపగుల గొట్టుచుండును" అని యనుకొని యుండును.

ఆమె పైకిఁ జెప్పుచుండుమాటలను విని యాశపడి నానాథుఁ డొడలు మఱచిపోయెను. అతఁడు చంచలచిత్తముతో "అట్లయినచో నీవు మరల నాకెప్పు డగపడియెదవు?" అని ప్రశ్నించెను.

మంగ — ఇప్పుడు సెలవిండు! ప్రయత్నించి యెంతవఱకు సాధ్యమగునో చూచెదను.

స్వామి — నీవు ప్రయత్నముచేసితివో లేదో నాకుఁ దెలియుట యెట్లు?

మంగ — నేనప్పుడప్పుడు వచ్చి మీకుఁ జెప్పుచుందును. బాగుగఁ బ్రయత్నించినచో నీకార్యము సాధ్యము కాకపోదు. అంతవఱకు ధైర్యముగాఁ జెప్పఁ గలను.

స్వామి యాక్షణమునందే పెట్టెనుండి పదిరూపాయలను నీప

మంగలికత్తె ముందటఁ బెట్టి "ఏకో యిప్పటి కీ హారాయలను దీసి కొనుము. కార్యము ఫలవంతమైనచో నిన్ను సంపూర్ణముగా సంతోష పెట్టెదను. ఒక్కమాట — నీవీపని యెట్లయిన ననుకూలముగఁ జేసి నచో నిఁక నీవు దినదినము నింటింటికి, దిరిగి కూలిపని చేసుకొనవలసిన యావశ్యకము లేకుండఁ జేసెదను" అని చెప్పెను.

ఆకులటాపిశాచి చటాలున నాహారాపాయలను దీసి కొంగున ముడుచు కొనుచు "బాబూ! ఇప్పుడీహారాపాయ లెందులకు? ఇందు డబ్బు ప్రసంగ మేమున్నది? నీవంటి పెద్దమనుష్యుఁడు నావంటిదాని నాదరించి చెప్పినప్పుడు నేనీమాత్రపుఁ బని చేయుటకుఁ బ్రయత్నింపఁగూడదా? అది యంతయు నాపని! చిత్తము, రేపటి ప్రాతఃకాలమున నే మరల వచ్చి దర్శనము చేసెదను. ఏమి జరిగినది చెప్పెదను!" అనియెను.

స్వామి — ఏమి చేసెదవో? నాప్రాణములైదును నీచేతిలో నున్నవి!

మంగలికత్తె సెలవుఁ గైకొని వీధిని బడి గంభీరగమనముతోఁ బోయెను. నానాథుని కాదినమున నేపనియును దోఁచలేదు. నూతన ప్రేమసంబంధమగు క్రొత్తగాలివానలోఁబడి తల్లడిల్లిపోవుచుండెను. వ్యాపారస్థలమునకుఁ బోయెనుగాని యేపనియును జూచుకొనుటలేదు. అందుచేతఁ గర్మచారులవకాశముచూచుకొని తమకు దొరికినవానిని సంగ్రహించుకొని పోవుచుండిరి.

## ౧౬. బీజము

మఱునాఁటి సాయంకాలమునఁ గలకత్తా నగరవక్షమునందలి ప్రతప్త వాయువులు శీతలములై వీచుచున్నప్పుడు - శ్రాంతులగు కర్మ చారులు విశ్రామార్థము తమతమ నివాసముల కేతెంచుచున్నపుడు - నిరుద్యోగులగు విలాసపురుషులు, మనోహరవేషభూషణాలంకృతులై తమగృహంబులు వెలువడి బండ్ల నధిరోహించియు, కాలినడకను వీథుల

వెంట గమనాగమనములు గావించు చున్నప్పుడు నానాథుఁడు తానుండు చిన్నయింటి కెదుటనున్న రాజమార్గమునందు నిలువ బడి వ్యాకులోద్భ్రాంత హృదయముతో మంగలికత్తె రాకకొఱ కెదురు చూచుచుండెను. ఆమె యెప్పుడు వచ్చును? ఇందఱు వచ్చుచున్నారు. ఇంతమంది పోవుచున్నారు! ఆమె రాలేదేమి! రాదా! ప్రాణము చలించిపోవుచుండెను. ఎందఱో స్థూలకాయులు సుదీర్ఘలలాటులు, శ్వేతాంబరధారులు, కమనీయమూర్తులు, ప్రియదర్శనులు నగు పండి తులు గానవచ్చుచుండిరి. ఎందఱో స్థూలోదరులు, తేజోమయులు మధుర మందహాసవదనులు, సంగరక్షకపరివృతులు నగు జమీందా రులు బహుమూల్య యానవాహనారూఢులై వాయువేగముతో గమనాగమనములు గావించుచుండిరి. ఎందఱో యవిశ్రాంతకార్య భారాపన్నులగు పెద్దతరగతి కర్మచారులు స్వేదసిక్తవసనములతో మెల్లమెల్లగఁ బాదచారులై కర్మస్థానములనుండి యిండ్లకుఁ జనుచు నుండిరి. కూలివాండ్రు, పాకీవాండ్రు, వారు వీరననేల ఎందఱో యా వీథిని రాకపోకల గావించుచుండిరి. అంద అగపడుచున్న నాతని యభావము తీరలేదేమి? ఇంకను నెవ్వరిని జూడవలసియున్నది! చూచుట యెట్లు! మఱియు నెందఱో సాయంకాలమునందలి యరవిచ్చుకమ్మ కమ్మమొగ్గలవలె సుందరులగు యువతులు గుఱ్ఱపుబండ్లను, ద్విచక్ర శకటములను నారోహించి కన్నులపండువు సేయుచుఁ జనుచుండిరి. కాని యాతనికి సంతుష్టి గలుగుటలేదు. ఆమెవచ్చుటలేదని క్రమక్రమ ముగా నాభర్తహృదయమునం దభావవిచారము వర్ధిల్లుచుండెను. అందుచే నాతఁడెంతయో నిరాశావిచారము ననుభవించు చుండెను.

ఇందఱు వచ్చుచు బోవుచున్నను నాతనికానందము గలుగలేదేమి! ఆతఁడు వెదకుకొనుచున్న వస్తువు లభింపలేదు! కాని యా వెదకికొను చున్న వస్తువేది? మంగలికత్తెయా? మఱియొకతెయా? మఱియొకతెయో

యనుకొందును. ఆమె యెవ్వతె? ఆయింటిప్రక్కను బ్రతిదినము నగ పడుచున్న సుందరియే - ఆమెను జేకూర్చుననియు, నామెవార్తను గొని తెచ్చుననియు నామెనుబడయు మార్గమును బోధించుననియు నంతమాత్రమునకే మంగలికత్తె ప్రయోజనము! కాని యామంగలి కత్తె యీసుందరిని జూచినదో లేదో నామెతో మాటాడినదో లేదో ఆరమణీమణి యామెమాటలకు బ్రసన్నమై యనుగ్రహించినదో లేదో యావిషయములంగూర్చి యాతఁ డాలోచించుకొనుటయే లేదు. మంగలికత్తె మాయమాటలు సత్యములే యనినమ్మి యాతఁ డావీధి మొగను నిలువఁబడి యాపిశాచిరాక కెదురుచూచుచుండెను. అప్పటి నానాథునిహృదయావస్థకును స్వధర్మాచరణాసక్తులగు మానవుల ప్రవృత్తికిని బోలిక యున్నదా? నారీపిశాచి యగు నామంగలికత్తెను ధర్మప్రచారకులగు గురుపురోహితులకును నెంతయంతరమున్నది?

ఆతనియాశ తీరనేలేదు - ఆరాకాసి రాలేదు. సంధ్యాకాంత తనధూళి ధూసరిత చేలాంచలముచేఁ బ్రకృతివదనమును మలీమసముగఁ జేసివేయ వలయునని వ్యర్థప్రయత్నమును జేయుచు గలకత్తానగరముపైఁ బడు చుండెను. కాని నగరవాస్తవ్యులగు మానవు లాకార్యమును సాగనీయ లేదు. ఆకాశమునందలి విద్యుత్తేజమును భూలోకమునకుఁ దీసికొనివచ్చి సంధ్యావసనాచ్ఛాదిత మగు ప్రకృతి ముఖమండలమును దేజోవిభాసిత ముగఁ జేయుచుండిరి. అంతసేపు తదేకదృష్టితో నానాథుఁడు నిలువఁబడి చూచుచున్నను, బిశాచస్వరూపిణియు, నిత్య దారిద్ర్యదుఃఖా పన్నయు, వికృతశుష్కదీర్ఘమ్లాన శరీరిణియు నగు మంగలికత్తెను దర్శింప జాలకపోయెను. అప్పుడాతఁడు హతాశుఁడై దీర్ఘశ్వాసములను విడుచుచుఁ దననివాస మందిరమునఁ బ్రవేశించెను. అట్లు వచ్చియు మనసు కుదురు పఱచు కొనలేక ధైర్యమును వహింపఁజాలక దుస్తులను మార్చుకొని, తనవ్యాపారస్థానమునకుఁ బోయెను. అచ్చటి కర్మచారు లాతని రాకఁ

గాంచి యెంతమాత్రమును జలించుటలేదు; ఆతనినంతగా లక్ష్యము చేయుటలేదు. నోటికివచ్చిన ట్లానాఁడు తాము గావించిన పనులనుగూర్చి యెఱింగించుటయే వారిపని. ఆతఁ డామాటలను వినుటయే లేదు. వినినను గ్రహించుట లేదు. అప్పటికి వారియొద్ద నున్న ధనమును మాత్రము తీసికొని తన దినకృత్యములను దీర్చుకొనుట తోడనే నానాథుఁడు తృప్తి పడుచుండెను. ఆదినములలో నాతని వ్యాపారపద్ధతి యీవిధముగాఁ బరామరిక లేక పాడైపోవుచుండెను.

నేఁడుకూడ నట్లే జరిగినది. నాభర్త యచ్చటికిఁ బోయి యటనున్న ధనమును దీసికొనిపోయి తన హృదయజ్వాలను జల్లార్చుకొను వాంఛలో మఱియొక నరక ద్వారమునఁ బ్రవేశించెను. అచ్చటికిఁ బోయి కావలసి నంత మద్యపానము గావించి పైశాచికానంద తాండవ విలాసములలో జాలసేపు మేనెఱుంగక విహరించి యుపసన్నుఁడై తుదకు రెండుజాముల రాత్రికి నిజనివాసమున కరుగుదెంచెను. చిరకాలమునుండి దర్శింపని యప్పటి యాతని సురాపాన మదవికృతాకారము గాంచి నేను దుఃఖ సంక్షుభితహృదయనై పోయితిని. ఇఁక నేనెంత యాసించినను, నెన్ని విధములఁ బ్రయత్నించినను దుర్వర్తనములనుండి యాతని నెన్నఁటికిని మరలింపఁ జాలనని యనుకొని చాలదుఃఖించితిని. ఒక్కసారి పాపమార్గ మున బ్రవేశించినవారు, ఆదారి ననుగమించి పోవువారు మఱియెన్న టికిని మరలఁజాలరు!

చాలసేపటివఱకు నేనాతనితో మాటాడఁజాలకపోయితిని. దుఃఖము చేతను, క్షోభముచేతను, నభిమానముచేతను నాగుండెలు పగిలిపోవు చుండెను. ఆతఁ డింటఁ బ్రవేశించి యందరివలెనే మసలుటకుఁ బ్రయత్నించెను గాని యట్లు చేయుటకు సమర్థుఁడు కాఁజాలకపోయెను. ఆతనిపాదములు తడఁబడుచుండెను. చేతులు వడకుచుండెను. తల తిరుగు చుండెను. ఒడలంతయుఁ గంపించుచుండెను. పలుకులు తొట్రుపడు

చుండెను. ఇన్నిటిని గప్పిపుచ్చుటకై యాతఁడెంతయో వ్యర్థప్రయత్నము చేయుచు నన్నుఁగాంచి "నేఁడు వ్యాపారస్థులు చాలమంది వచ్చినారు. వారిపనులను దీర్చి పంపివేయునప్పటి కింత రాత్రియైనది. వారితో సంభాషణలవలననాకుఁ దలనొప్పి వచ్చినది. నేనిప్పు డేమియు భుజింపఁ జాలను. ఊరకపరుండినచో సుఖముగా నుండును!" అనియెను.

ఆతని మొగము వాఁడిపోయెను. కంఠస్వరముకొంచె మనుతాప సూచకముగా నుండెను. అందువలన నేను నామనసునందు "ఈతనికిఁ బాపాసక్తిపూర్ణముగా నున్నను, వివేకశక్తిమాత్రము కేవలము నశించి పోలేదు" అని యనుకొంటిని. ఆ మొగము చూచి, యాకంఠస్వరమును విని నేనుచాల విచారించితిని. అప్పుడు నాలోనేనే "అయ్యో! నేనెంత నిర్భాగ్యురాలను! ఎవ్వని కానందమును జేకూర్చుట నాజీవితఫలమగు శ్రేష్ఠధర్మమో యట్టినా స్వామి యనుతప్త హృదయముతో నా యెదుటఁ దనతప్పునుదాచుకొనుటకై భోజనాదికమును మాని శయనింపఁ బోవుచుండెను. ఇంకను గొంతసేపు నాతో మాటాడుచు నిటునటుఁ దిరుగుచు భోజనముచేయుటకుఁ బూనుకొన్నచోఁ దాను పానముచేసిన మద్యవిషము తనశక్తిని బ్రకోపింపఁజేయకమానదు. అట్లుకాక భోజనము మాని పరుండినచో నాకుఁ దానుచేసిన తప్పు తెలియకుండఁ బోవునని యాతఁ డూహించెను. అయ్యో! ఎంతకష్టము!" అని భావించుకొనుచు నాభర్తనుద్దేశించి "స్వామీ! పాపానలమును రగిలించుకొనుచుండు మానవుఁడు దాని తాపమును దానే యనుభవింతు ననియు, ఆజ్వాలయితరు లెవ్వరిని బాధింపదనియు, నట్టితాపమును దా ననుభవించుచున్నను జాగ్రత్తగా నున్నచో నెవ్వరికిని దెలియకయే యుండు నవియు భావించు కొనుచుందును. కాని యట్లుగాదు ప్రభూ! ఆతఁడెవ్వరితోఁ గలసి కాపురము చేయుచుండునో వారి కా వికృతచేష్టలన్నియు ననుభవమునకుఁ దోఁచుచునే యుండును. తెలిసిపోవుచునే యుండును. విశేషించి

హైందవరమణి తననాథుని ప్రతిరోమకూపమునందలి స్వేదబిందువును ప్రతి చరణ మృత్తికయందలి ధూళికణమును ప్రతిదీర్ఘశ్వాసమునందలి యణు లేశమునుగూడ గ్రహింపఁ గలదు! చూడఁ గలదు. నాయొద్ద నీ వే విషయమును దాఁపఁ బ్రయత్నించుచుంటివో, యేపాపకీలను గొంగు చెంగునముడిచి యగపడఁ జేయకుండుటకుఁ బాటుపడుచుంటివో యది యంతయును నాకుస్పష్టముగాఁ దెలియకుండుట లేదు. ఇదియంతయు నీదోషముగాదు. నీవు దోషివి కావు. నానుదుటివ్రాఁత! నాకర్మఫలము వలననే నీకిట్టిదుర్బుద్ధులు పుట్టుచున్నవి! నీవిప్పుడు భోజనముమాని బాధపడుటెందుకు? ఒక మహా విషపానముచే నొడలు మండిపోవు చున్నది. దానిపై నిరాహారతాపముకూడనా? ఇట్లయినచో నీదేహ మెంతకాలమునిలుచును?'' అని మృదుస్వరముతో బోధించితిని.

నామాటలు విని యాతఁడు క్రోధోద్దీపితుఁడై పోయెను. పాపము చేసిన వాఁడు తనలోపమును స్మృతికి దెచ్చినంతనే మండిపడిపోవును. నాభర్త హృదయమునం దింకను నాచుచేఁ గప్పఁబడిన గీష్మ నదీగర్భము నుండి ప్రవహించు సన్ననినీటిపాయవలె క్షీణవివేకవాహిని ప్రసరించు చుండెను గాని యదినామాటవలన నుద్భవించిన క్రోధాగ్నిచే నొక్క సారిగా నింకిపోయెను. అప్పు డాతని హృదయమున రజోగుణము రగులుకొనెను. ఇంతవఱకును మదవిహ్వాలతచే వినతములగునయనము లింతలో విస్ఫారి రక్తకాంతులను విరజిమ్మఁ దొడంగెను. అతఁడు క్రోధ కంపితస్వరముతో, మదవికల భాషణములతో నన్నుద్దేశించి "ఓసీ! నీవు నాపాలిటి దౌర్భాగ్యదేవతవు! నానయనకంటకమవు! దురదృష్టవశ మున నీవునాకు జ్యేష్ఠాదేవివలె దాపురించితివి. నిజము చెప్పవలసి వచ్చినచో నా యీ దుర్గతికి ముప్పాతికభాగము నీవే కారణమవు! నీయొద్దకు జేరినంతనే నాయానంద మంతయును జచ్చి విరక్తి యుద యించుచున్నది. అందుచేతనే , దినమంతయును శ్రమపడుచున్న

నాకు విశ్రాంతికై పరగృహద్వారము నాశ్రయింపవలసి వచ్చుచున్నది. నిరంతర కర్మక్లాంతమగు నా యీకంటక జీవితమునందు విశ్రాంతికొఱకొక కామాగాని సెమికోలనుగాని యెచ్చటనున్నది? మనోరమయు, సంకల్పానుసారిణియు నగు భార్యగలవానికి కామాసెమికోలనులకొఱకితరద్వారముల నాశ్రయింప వలసినపని యేముండును? అట్టివాఁడెంతటి శ్రమజీవియైనను నిల్లు చేరినంతనే సంపూర్ణానందము ననుభవింపఁగలిగి యుండును. ఇఁకనావంటి నిర్భాగ్యుఁడు జ్యేష్ఠాదేవివగు నీవింటి భార్యగలవాఁడు నిత్యము నిటువంటి పాపపంకిలపథమునఁ బడిపోవలసినదే!" అని గర్జించెను.

నాకెంతయో దుఃఖమువచ్చెను. నామనసులో నేనే "అయ్యో! నేనేల చావక బ్రతికియుంటిని? నాచెంతకు వచ్చుటయే యాతనికసహ్యమైనప్పుడిఁక నాబ్రదుకెందుకు? ఈనారీదేహమును నేను భరించు టెందుకు? ఆతని మనోవృత్తియు నామనోవృత్తియు నొకవిధమైనవి కావని తెలిసియే యుండెను. ఆయన నిజమే చెప్పినారు. హృదయానుసారిణి యగు భార్యలేని మానవుఁడు సుఖింపఁజాలఁడు. ఆతఁడు మద్యపానముచేసి యింటికి వచ్చుచుండును. ఇఁక నేను కోతివలె పండ్లికిలించుచు నాతని వానరమువంటోలి గంతులు వేయించుచు నశ్లీలభాషణములతో మంతనములాడి యాతనియిష్టము వచ్చినట్లు ప్రవర్తించినచో నాతఁడు నాతో గలసి సుఖింపఁగలఁడు. నిర్భాగ్యురాలనగు నేనట్లు చేయఁజాలక నా ప్రత్యక్షదైవతమగు నాభర్తదినమంతయును గార్హస్థ్యకర్మయజ్ఞమునందు పూర్ణాహుతికూడ ముగించుకొని నాచెంతకు వచ్చినప్పుడు నేను శీతల సలిలముతో సహస్రధారాభిషేకము గావించి, చిన్నజలకలశమునందలి యమునాజలమును బ్రోక్షించి, ప్రేమసోమరసమును బానీయముగ నివేదించి, యాత్మార్పణమను హంసతూలికాతల్పమున శయనింపఁ జేయవలయు నని హృదయపూర్వకముగ నేనభిలషించుచుంటిని. అట్టి

నాదురాశను వదలుకొని యాతనిసుఖానంద వర్ధనార్థమై నాచిత్తవృత్తుల నేల మరలించుకొనఁ జాలనైతిని? ఆతనిమనసు వచ్చినట్లే వానరివలెఁ జరించుచు నాతనిఁ గ్రోతివలె నాడించుచు నేల సుఖింప జేయలేనైతిని? స్వహస్తములతో మాంసమును వండిపెట్టి చాలినంతమద్యమును నివేదించి యేల సేవింపలేక పోవుచున్నాను? హార్మోనియమును వాయించుచు నసభ్యగీతముల నుచ్చస్వరముతో మందిరమంతయు బ్రతిధ్వనించి కంపించిపోవునట్లు పాడుచు మదవిహ్వలచిత్తుఁడగు నాతని నానందింపఁ జేయుట కేల ప్రయత్నింపనేరనైతిని? అట్లు చేయఁగలిగి నచో నొకసారిగా నాతనిదుష్కార్యములకు సహాయపడి యతనితోఁగూడ ప్రేతపురమునందు నరకమందిర భగ్నప్రవేశ ద్వారము చెంత నిసిపురమును విహరింపవచ్చునే! ఆతని కదియే సుఖమైన నేనట్లు చేయఁగూడదా? చేసినదోషమేమున్నది?

ఉన్ముక్తగవాక్షమునుండి వీతెంచుసమీరము "హాహాహా" అని నవ్వుచున్నట్లును, నాయెడలనసహ్య భావమును దిరస్కారమును బ్రకటించుచున్నట్లు నాయలకదామమును జిందరవందరగఁ జేసివైచుచుండెను. గగనాంతరాళమునఁ గళాధాముఁడు హసించుచుండెను. తారకామాలికలు మ్లానవదనములతో నీలాకాశపటమున ముసుఁగువైచుకొన్నట్లుండెను. అందు గొన్ని మేఘములమాటునకుఁ బోవుచుండెను. అప్పుడు దిక్కాంతలు వెల్లనైన మొగములతో గటుస్వరములతో "ఓసీ నీవుభారతరమణివి కావా! నీహృదయమునందు దేవకాంతాదుర్లభమగు నమితపావన తేజోరాశి నిరంతరమును బ్రకాశించుట లేదా? నీవు నిత్యమును స్వామి సంతుష్టికొఱకు బలిపశువును సిద్ధపఱచుకొని కూర్చుంటివా? ఏమి యీ భ్రాంతి! ఏది స్వామికి సుఖ మని చెప్పుచున్నావు? పాపము సుఖమా? ఎంతమాట! ఈమాట నీయొక్కతె నోటినుండియే క్రొత్తగా వినుచున్నాము. నాథునియసత్కార్యములకుఁ దోడుపడుచు

నెట్లయిన నాతనిసుఖపెట్టుటకే భారతకాంతలు జన్మించుట లేదు. హైందవయువతులు భర్తృసహచారిణులుగారు — వారెల్లప్పుడును సహధర్మిణులు! ధర్మకార్యములకు సహాయపడువారేకాని పాపకృత్యములకు దోడగువారు కారు. నాథుఁడు పాపపథానుసారియై పోవుచున్నప్పుడు సతీమణి ప్రాణపణముగఁ బ్రయత్నించి యాత్మరక్తమును బలి యొసంగియైనను నాతని మరలింపవలయును. నీవట్టిసాహసమును, నట్టి గట్టి ప్రయత్నమును జేయఁజాలవా? నీకట్టియుపాయములు లేకపోయినవా!" అని తూలనాడుచున్నట్లును, బ్రబోధించుచున్నట్లును నాకుఁ ద్యోతకమయ్యెను.

నేను తదేకచిత్తముతో నిన్నిమాటలను వినుచుంటిని. ఇంతలో నాభర్త క్రోధోత్తేజితకంఠస్వరము నా ధ్యానభంగమును గావించెను. అప్పుడు నానాథుఁడు కోపముతో "ఇఁక నీనీతులను గీతులను గట్టిపెట్టుము! నాపడక సిద్ధపఱచితివా? నేను నిద్రింపవలయును" అనియెను.

నేను బాగుగఁ బరిశీలింపఁగా నాతని యవస్థ యింకను బాడుగానుండెను. తల వాలిపోవుచుండెను. మాటలు తడఁబడుచుండెను. సురాపానమదోత్తేజనము తగ్గుచుండుటచే దేహ మవసన్న మగుచుండెను. ఇఁక నూరకుండిన లాభములేదు. నేను చటాలున లేచి దుస్తులను విడువుమని యాతని బ్రార్థించితిని. కాని యాతఁడు విడుచుటకు సమర్థుఁడు కాజాలకపోయెను. తుదకాతఁడు తాను గూర్చున్న మేజామీఁదనే పడిపోయెను. చెమటచేఁ దలయంతయు దడిసిపోయెను. సర్వాంగికములును జెమర్చుటచేఁ గట్టుబట్టలన్నియును నానిపోయెను. ఆతఁడట్లు విస్మృతుఁడై పడిపోవుటవలన నాకు భయము గలిగెను. ఇంటివారి నెవ్వరినైనఁ బిలిచి చెప్పుదునా యనుకొంటిని. ఈస్థితిలో నెవ్వరినైన బిలిచినచో వారువచ్చి యాతనివదనమునందలి మద్యదుర్గంధముం గాంచి యసహ్యించుకొందురనియు, నీతని దుష్ప్రవర్తనము స్పష్టముగా

వెల్లడియైపోవుననియు, నందువలన నందఱు నీతని ననాదరింతురనియు నాకంతలో నభిమానము గలిగెను. అందుచే నేనట్లు చేయక గత్యంతరము నెఱుంగక స్వయముగనే యాతనిదుస్తులను వదల్చి విసనకఱ్ఱతోఁ గొంతసేపు విసరితిని. శరీరమునందలి చెమట లారిపోయెను. పొట్ట తడిమి చూచితిని. లోపల నేమియును లేదు. అప్పుడు కొన్ని భక్ష్యములను దెచ్చి తినిపించుటకుఁ బ్రయత్నించితిని. కాని ప్రయోజనము లేకపోయెను. మరల విసరుట కారంభించితిని. తరువాత బల్లపైనుండి యాతని నెట్లో మంచముమీఁదికిఁ జేర్చుటకుఁ బ్రయత్నించితిని కాని యట్లు చేయలేనైతిని. ఇఁక చేయునది లేక దగ్గఱఁ గూర్చుండి విసరుచుంటిని. ఇంతలోనాతని నాసికాగర్జనము నాచెవులఁ బడియెను. అప్పుడు స్వామికిఁ నిద్రపట్టినదనియు, నిఁకభయములేదనియుఁ దెలిసికొని స్వస్థచిత్తనైతిని.

అప్పటికిఁ జాలరాత్రి యైనది. గవాక్షద్వారమునుండి శుక్లదశమీ సుధాకరుఁ డస్తమించుచుండుట యగపడియెను. నాథుఁడు బల్లపైఁ బడియుండగా నేను మంచముపై శయనించు టెట్లు! అందుచే నేనాబల్ల యొద్దనే యాతనిపాదములకైపున గ్రింద నొకమూల, బరుంటిని. కొన్ని నిమిషములలోనే సకలదుఃఖసంహారిణియు సర్వతాపప్రశమనియు-నగు నిద్రాదేవి నన్నుఁ దనయొడిలో జేర్చుకొనియెను.

## ౧౭. అం కు ర ము

మరునాఁడు నామగఁడు నాతో నంతగా మాటలాడ లేదుగాని సంసార కృత్యములనుగూర్చి చెప్పుట తప్పదు గావున నేవో కొన్ని విషయములంగూర్చి యొకటిరెండు ప్రశ్నలువైచి స్నానాహారములను గావించి తనవ్యాపారస్థానమునకుఁ బోయెను. కాని యక్కడిపనులైనను జూచుట లేదు. నిష్కారణముగాఁ గర్మచారులంగూర్చి విసిగికొనుచుఁ దుదకుఁ దనకస్వస్థతగా నున్నదని చెప్పి తాను తరచుగానుండు నద్దె

యింటికిఁబోయి మంగలికత్తెరాకకై మరలమరల వీధిలోనికివచ్చి యెదురు చూచుచుండెను. ఒక్కొక్కమాటు కిటికీని దెఱచి యాసుందరి యగు పడుచేమో యని కన్నులు చింపుకొని దృష్టుల నాభవనమధ్యమునకుఁ బ్రసరింపఁజేయుచుండెను. కాని యాగృహామం దారమణినిగాని, వీధిలో మంగలికత్తెనుగాని కానకుండుటచే నాతని కతికష్టముగా నుండెను. ఎంతప్రయత్నించినను లాభములేకపోవుటచే వికలహృదయుఁడై యా తఁడు తనమంచముపై బడియుండెను. కాని మనశ్శాంతి లేదు - అట్లు పరుండుటవలన సుఖము గలుగలేదు, లేచి కూర్చుండెను. ఎదుట నొక చిన్నబల్లపైఁ జినిగిపోయిన భారతగ్రంథము పడియుండెను. దాని నందుకొని యాతఁడు చదువనారంభించెను గాని యొకపుట చదువు నప్పటి కాతనికి విసుగుపుట్టెను. అందుచే నాపుస్తకము యథా స్థానమునందుంచి మరలనొకసారి కిటికీతలుపులను దెఱచెను. ఈసారి యాతనిపుణ్యము పండినది. ఆతనిగుండెలు దడదడ గొట్టుకొన దొడం గెను. రక్తనాళములు నృత్యముచేయ నారంభించెను. పాదాదిశిరః పర్యంతము విద్యుత్తాడితమైనట్లుండెను. ఆతఁడు జూచెను. ఆయువతీ రత్నము తనగదియందలి యొకకవాటమును దెఱచి ద్వారపార్శ్వ మున నిలువఁబడి మంగలికత్తెతో మాటలాడుచుండెను. అగిసెపూ వన్నెగలిగి మృణాలకోమలం బగు నామెహస్త మొకటిరెండుసారులు సాగి యామంగలికత్తె సన్నిధానమునకుఁ బ్రసరించెను. అట్లేందుకుజరిగెనో యాతనికిఁ దెలియదు. అయినేమి ఆతఁడు తనలో "నామనోహారిణి నిశ్చయముగా నన్నుఁగూర్చియే మంగలికత్తెతో మంతనము చేయు చున్నది." అని నిశ్చయించుకొని యావెంటనే గవాక్షమును మూసి వైచి సమీపమందున్న కుర్చీపైఁ గూర్చుండి మాటిమాటికిని వీధి వైపునకు దృష్టిని మరలించుచుండెను. అతిత్వరితముగాఁ దనచెంతకు మంగలికత్తె రావలయు నను యాతనియాశ.

ఆయాశయు ఫలించినది! అరగంటసేపైనఁ గాకుండఁగనే మంగలికత్తె యింటిగుమ్మమునొద్దకు వచ్చి పిలిచెను. నానాథుఁ డులికిపడి "రమ్మా! రమ్మా! నేనిచ్చటనే యున్నాను!" అని కేకవైచెను. చేరవైచియున్న తలుపులను దెఱచుకొని మంకలికత్తె నామగనిచెంతకు వచ్చెను. బాబుగారిఁక దాళలేకపోయెను. ఆశానయనములతో వెఱ్ఱివానివలె నామె మొగము వంక దృష్టిపాతముగావించుచు "నిన్నప్రొద్దుననే వచ్చెద నని చెప్పితివి. రాలేదేమి? నేను రాత్రి తొమ్మిదిగంటలవఱకు నిచ్చటనే నీకొఱ కెదురు చూచుచుంటిని నీవు రాలేదేమి!" అని ప్రశ్నించెను.

లోకానుభవజ్ఞయు, దుష్క్రియాచతురయునగు నామంగలిది "పక్షి వలలోఁబడినది; ఇఁక దాటుకొని పోలేదు!" అని సంతోషించి "ఔను బాబూ! నేను వచ్చెద నన్నమాట నిజమే. కాని నాకొకగొప్పయాపత్తు సంభవించినది. అందుచేత నాకేమియుం దోచకయింటనే పడియుంటిని" అనియెను.

బాబు — నీకుఁ గష్టము వచ్చినదా! ఏమికష్టము?

మంగ — ఆసంగతి నీకేమని చెప్పుదును బాబూ! నీవుకోరిన ప్రకారము కష్టపడి యెట్లో నీపని చేసితీరవలయును. కాని యదియంత సుకరముగా నగపడుటలేదు. చాల కష్టతరమైన కార్యము! దృఢ ప్రయత్నమును జేసినగాని త్వరలో నిన్ను సంతోషపెట్టఁజాలనని భయపడుచున్నాను. సామాన్య యత్నమువలన నీపనిజరగునని నాకు నమ్మకము లేదు.

బాబు — కానిమ్మా! నాయోగ మెట్లున్నదో యట్లగును. ఇప్పుడు నీకుఁ గలిగిన యాపద యేమి?

మంగ — చెప్పెదను లెండు! చెప్పినంతమాత్రమున నేమిలాభము!

బాబు — ఇటురమ్మా! ఈకుర్చీపైఁ గూర్చుండుము. మనసుకుదురు పఱచుకొని నీకష్టమేమో యది యెట్లునివారణమగునో చెప్పుము!

సాధ్యమైనంత వఱకుఁ బ్రయత్నించి చూతము. నీవు నాకోరికఁ దీర్చుటకై యిట్లు శ్రమపడుచుండఁగా నేను నీకష్టనివారణమునకుఁ దోడ్పడకుండుట ధర్మమా!

"ఉరిలోఁబడినపిట్ట చచ్చినట్లే పడియున్నది" అని యనుకొని మంగలిది లోలోపల నవ్వుకొనుచు "మొట్టమొదట నీవలన నాపని యెంతవఱకుసాగునో యంతవఱకు జేయించుకొందును. తరవాత మఱియొకకుట్రపన్ని నీకు సర్వనాశము గావించెదను. నీవంటిధనవంతుఁడగు బంగాళీబాబు నాచేతిలోఁ బడకున్నచో దుఃఖభూయిష్టమగు నాయీదారిద్ర్యమెట్లు దూరమైపోఁగలదు? వయసువచ్చినప్పటి నుండియు వెదకుకొనుచున్నాను కాని లభింపలేదు. ఇప్పటికి విధి యీరత్ననిధిని గన్నులయెదుటఁ బెట్టినాఁడు. ఇఁక నేనీతని నూరక విడువఁజాలను, మెల్లమెల్లగా రక్తమాంసములను బీల్చి పిప్పిచేసివైచెదను." అని యనుకొనెను.

పిమ్మట నామె బాబువంకఁ జూచి దీనకరుణ స్వరముతో "బాబూ! నీవు చాలదయాళునివలె నగపడుచున్నావు. గొప్పయింటి బిడ్డవని నీచేతలే చెప్పుచున్నవి. నేను మీ అమ్మవయసుదానను. నీ కసహ్యాభావము లేకున్నచో - నన్ను దాసి యనక యవ్వయని పిలుచుట నీ కవమానముగఁ దోఁచకున్నచో నన్నింతటినుండి యవ్వాయని పిలుచుచుండుము! ఈకలకత్తాయందలి గొప్పయింటివారిలోఁ జాలమంది మంగలికత్తెల నవ్వాయనియే పిలుచుచుందురు. గొప్పయింటిపెద్దలు, పిల్లలు, స్త్రీలు, పురుషులు, పరిచారకులు, గొల్లలు నందఱును గూడ నన్నట్లే పిలుచుచుందురు." అనియెను.

బాబు — నేనుగూడ నిన్నేమని పిలువవలయునో యని యూహించికొనుచునే యున్నాను. సరే. దానికేమి! ఇప్పుడు నీకుఁ గలిగిన కష్టమేమో చెప్పుము!

మంగ — బాబూ! నాకొక మేనల్లుఁ డున్నాఁడు. వానికంటె నీ

లోకమునందు నాకు నావారనువా రెవ్వరును లేరు. అందుచే నేను వాని నెంతో గారాబముతోఁ జూచుకొను చున్నాను. వాఁడు, నేను కూలి నాలిచేసి తెచ్చిపెట్టిన ధనముతోఁ గల్లుగంజాయిలను గొని సేవించి యొడలు దెలియకుండ నాతతాయులతోఁ గలసి గంతులు వైచుచు జూచువారి కందఱకు నసహ్యముగా సంచరించుచుండెను. అందుచే నాతని నేపనియందైనఁ బెట్టినచో బాగుపడునని యెంచి యొకగొప్పవా రింట భృత్యునిగాఁ బ్రవేశపెట్టితిని. వింటిరా! వాఁడా యింట నొక బంగారునగను దొంగిలించి యంగడిలో దానిని విక్రయించు చుండగాఁ బోలీసువారు పట్టుకొని వానిని జైలులోఁ బెట్టిరి.

ఇప్పుడు పోలీసువారికి రెండువందలు లంచ మిచ్చినఁగాని వారు వానిని విడిచిపెట్టరు. తెలిసినదా? నేను కష్టపడి యిరువదిరూపాయల వఱకును సంపాదించితిని. ఆసొమ్ము వారికి చెల్లించినచో రేపటినుండి నాపొట్టకు గతిలేదు. కాని యీసొమ్మెంత. ఇది ఇచ్చినను వారు వదలె దరా? తక్కిన సొమ్మంతయు నేనెక్కడనుండి తేఁగలను? నేను పని చేయుచుండు పెద్దవారియిండ్లకుఁ బోయి యాచించితిని. వారందఱును ఒకటి రెండు రూపాయల చొప్పున దయచేసినారు. మీరు ప్రేమించి తిరే! ఆయువతీమణి మీవలెనె దయాళురాలు! నాసంగతి యంతయు మనవిచేసి నేనేడ్చుచుండఁగా దానును విచారించి "అవ్వా! నాయొద్ద నున్నచో నంతయు నీకిచ్చియే యుందును. నేనిప్పు డెక్కడనుండి తెచ్చి యియ్యఁగలను? ఇరువదిరూపాయలు మాత్రము నాయొద్ద నున్నవి. వీనిని దీసికొనుము!" అని నాకిచ్చినది. అన్నియును గలసి తేఁబది వఱకును బోగుపడినవి. ఇఁక నూటయేఁబది కావలయును! ఎక్కడకుఁబోయి యెవ్వరినడుగుదును బాబూ! ఏమి చేయుదును! అడవి దప్పివచ్చిన యాఁడుతేఁడివలె నిన్నటినుండియుఁ బరిభ్రమించుచున్నాను.

బాబు — ఇంతేనా? ఇంతమాత్రమున కేనా యీశ్రమ! నిన్ననె సత్తు

నాయొద్దకు రాలేకపోయితివా? అప్పుడే నీపని జరగిపోవునే!

మంగ — రావలెననియే యనుకొంటిని బాబూ! సిగ్గును భయమును నాగుండెల నదిమి నన్ను రానిచ్చినవి గావు. ఇంకను మీకును నాకును విశేష పరిచయము కలుగలేదు. నేనెటువంటిదానో మీకింకను దెలియనే లేదు. పోనిండు! మీరుచెప్పిన పనియైనను జేయుట కింకను నవకాశము కలుగనేలేదు. ఎట్లువచ్చి మిమ్ము సామ్మడుగుదును? అడిగినచో నన్ను మీ రెంతగా నసహ్యించుకొందురోయని భయపడి సిగ్గుపడి రాజాలక పోయితిని.

బాబు — అదియేమవ్వా! ఇంతకష్టములోనుండి నాకుఁ జెప్పుటకు సంశయమా? కానిమ్ము! ఎవ్వరిని యాచింపనక్కఱలేదు! నేనే యిచ్చెదను. సరే! నామాట యేమి చేసితివో చెప్పుము!

మంగ — అబ్బో! ఆమెకఠినపర్వతము! ఆపూజయేమో, చదువేమో అంతేకాని సామాన్యముగ నామాట వినిపించుకొన్నదా? ఎన్నియో బోధించినతరువాత, నీరూపగుణాదికములు వర్ణించి చెప్పినతరువాత, యించుక మనసిచ్చి మాటాడినది. ఈ సాయంకాలము నిన్నామె తన డాబామీఁదికి వచ్చి దర్శించెదనని చెప్పినది. నీవు కారన్వాలిస్ వీధి 20 నెంబరు గృహమున కెదురుగా నిలిచియుండుము! నే నామె తోడనే యుండెదను.

బాబు— సాయంకాలమెప్పుడు? సరియైనవేళ చెప్పఁగూడదాయవ్వా?

మంగ — నాకంత తెలియదుబాబూ! నీవు సరిగా సంధ్యాకాలమున కచ్చటికి వచ్చియుండుము. నేనప్పటి కామెను దీసికొని వచ్చెదను.

అజ్ఞానాంధుఁడగు నానాథుఁడు నింద్యచరిత్రయు, నసత్యవాదినియు నగునామె మాయమాటల వలనను, కపటనటనములవలనను వంచితుఁడైపోయెను. అప్పుడాతఁడు తనపెట్టెనుండి పదిరూపాయల విలువగల యిరువదినోట్లనుదీసి సంతుష్టచిత్తముతోఁ బ్రసన్నవదనముతో మంగలి

దాని కర్పించెను. ఆమె చేతులుచాచి వానిని దీసికొని చెంగున ముడుచుకొని రొండిని దోపుకొనియెను. ఆపిమ్మట "బాబూ! నీకు జయమగుఁగాక! వ్యాపారము లభించుఁగాక! నీకార్యము సంపన్నమై నీ వామెతోఁ గలసి యానందించెదవుగాక! నేనిఁక నాలస్యము చేసినచోఁ బోలీసులు విచారణ కాతని నొప్పగింతురు. మధ్యాహ్నమే యాపని చూచుకొని సంధ్యానంతర మేమిజరిగినదియు నీకు మనవిచేసెదను" అని చెప్పెను.

బాబు — చూడు నీవిప్పుడు చెప్పినమాట మఱచిపోకుసుమా, నా ప్రాణములు నీచేతిలో నున్నవి. నిన్నాధారముగఁ జూచుకొనియే నేను ప్రాణములను ధరించియున్నాను.

మంగలికత్తె హర్షచిత్తముతో, హాసవదనముతో వెడలిపోయెను. నాభర్త హృదయముకూడ నప్పుడు మిగుల నానందముతో నుండెను. "ఇప్పుడు నేనేమిచేసి యామెను సంతోషపెట్టఁ గలుగుదును. ఏవిధముగా నేనలంకరించుకొని యాసుందరిని మోహపెట్టఁగలను! ఏమిచేసినచో నన్ను జూచినంతనే నాకువశురాలై యామెనన్ను ప్రేమించును?" అని యాలోచించుకొనఁ దొడంగెను.

అప్పుడాతఁడు మంచిపరిమళముగల సబ్బును దీసికొని కొళాయివద్దకు బోయి మొత్తమురెండు గంటలసేపాసబ్బుతో సర్వాంగకములను రుద్దుకొనుచు తృప్తిదీరునట్లు స్నానము గావించెను. తరువాత సుగంధతైలమును దలకు రాచుకొని మరలస్నానము చేసి దుస్తులనుదొడిగికొని యాయిల్లువెడలి తలుపు తాళమువైచి తనవ్యాపారస్థలమునకుఁబోయెను.

ఆతఁడానాఁటిమధ్యాహ్న మింటికి భోజనమునకు రాలేదు. అప్పుడప్పుడు పనినిబట్టి మధ్యాహ్నభోజన మక్కడనే చేయుచుండుట కలదు. నేఁడెట్టిపని లేకపోయినను భోజనమునకుమాత్ర మింటికిరాలేదు. ఆవ్యాపారమం దెంతలాభనష్టములు గలుగుచున్నవో యెవ్వరెఱుఁగరు.

అచ్చట భోజనముచేసి వర్తకస్థానమునుండి నూరు రూపాయలను దీసికొని బయటికి వచ్చి యొకబండి నద్దెకు మాటాడుకొని యది రోహించి క్యానింగుస్ట్రీటునకుఁ బోయెను. అచ్చట నొక షాపులోనికి బోయి మంచివిలువగల ప్రశస్తమైన సబ్బులపెట్టెను గొనియెను. తరువాత నొకలవండరు బుడ్డియు, ఇయుడిలాన్‌సీసాయును, పౌఁడరు, గులాబి, మల్లెమున్నగు నత్తరుసీసాలను గొనియెను. పిమ్మట రెండు మూఁడురకముల దువ్వెనలను బెద్దయద్దమునుగొని మరల బండినెక్కి చౌరంగీకిఁ బోయి వైట్ వేకంపెనీ భవనమును బ్రవేశించెను. అట నాతఁడు మూఁడురకములు మూఁడుడజనులు జేబురుమాళ్లను, ఒకడజను షర్టులను మిగులనందమగు వేస్టుకోటును చక్కనివెల్వెట్టుబూటులను మనసునకునచ్చిన మేజోళ్లను గొని బండినెక్కి తిన్నగా దాను శయనించుచుండు నద్దెకొట్టునకు వచ్చెను. చెప్పుట మరచిపోయితిని. చౌరంగీయందే యొకదొరగారిషాపులో నొకబాటిలు మధురసుగంధకలితమగు మద్యమునుగూడఁ గొనితెచ్చుకొనుట కాతఁడు పరాకుపడలేదు. కారణమేమన సామాన్యమద్యమును సేవించినచో నెట్టచక్కనిదుస్తులను ధరించినను దేహకాంతి యంతవికాసముగా నుండదు. అట్టిత్రాగుడువలన మానవునికన్ను లంతగాఁ దళతళ మెఱయవు. చెక్కులపై నంతగా గొజ్జంగిపువ్వురంగులు మిలమిలలాడవు! సర్వాంగకముల నుండియు వన్నెవన్నెల వెన్నెలనిగ్గులు బయలుదేఱవు.

ఆతఁడట్లింటికి వచ్చినప్పటికి మధ్యాహ్నము మూఁడుగంటలవేళ యయ్యెను. ఇఁక మూఁడుగంటలలో నాతఁడు తన యలంకారరచన ముగించుకొని సంకేతస్థలమును జేరుకొనవలయును. ఆతని కాదినము పరుగెత్తుకొని పోవుచున్నట్లుండెను. ఇంకనునాతఁడు బట్టలషాపునకుఁ బోయి చక్కని దోవతులను గొని తెచ్చుకొనవలసి యున్నది. హారిసన్ రోడ్డునం దొకటి రెండు కొట్లలో మంచిబట్టలు దొరకునుగాని, జోడా

సాంకోయందలి స్వదేశవస్త్రములవంటివి మఱి మెచ్చుటను లభింపవు. అవి బాబూఘసందుబట్టలు!

అతఁడు తనగదిలోఁ బ్రవేశించి తాను గొన్నవస్తువుల నన్నిఁటిని మంచముపై జాగ్రత్తపెట్టెను. తరువాత జేబులో చేయిపెట్టి యిఁక నెంతసొమ్ము నిలువ యున్నదో చూచుకొనఁగాఁ బదుమూఁడణాలకాని మాత్రము మిగిలి యుండెను. అప్పుడాతఁడు తొందరగాఁ బెట్టెలో నుండి యిరువదిరూపాయలను దీసికొని యతివేగముగా వీథిలోనికి వచ్చి ట్రాముచెక్కి జోడాసాంకోకుఁ బోయెను. ఆతఁడు బజారునుండి యింటికి వచ్చునప్పుడే యొకదొంగముండకొడు కాతనిస్థితిగతులను బాగుగఁ గనుపెట్టి యాతని ననుసరించియే వచ్చెను!

నానాథుఁడు మరల బజారునకుఁ బోయిన సమయము చూచి యా దొంగ యాకొట్టునందుఁ బ్రవేశించెను. ఆ ప్రక్కలనున్న నాలుగైదు కొట్లును దాళములు వేయఁబడియుండెను. ఆయిల్లంతయు నొక్కరిదే కాని యొక్కొక్కగది నొక్కొక్కర ద్దెకుఁ దీసికొని యుండిరి. వారందఱును వ్యాపారస్థులు నుద్యోగులును! అప్పుడెవ్వరి పనులకు వారు పోయి యుండిరి. ఆయిండ్లలో నెవ్వరును విలువగల వస్తువుల నుంచుకొనుట లేదు. చాలమంది యా గదులనద్దెకుఁ దీసికొనుటవలన రాకపోకలకై బహిర్ద్వార మెప్పుడును దెరచియే యుండును.

ఆచోరుని జేబులోఁ గొన్నిరకముల తాళములున్నవి. ఒక్కొక్క దానినే యుపయోగించి తుదకాతఁ డాయింటితాళమును దెఱచివైచెను. తరువాత నాతఁ డొక్కయుదుటున లోనఁ బ్రవేశించి రెండుజాముల వేళ నెండలో శ్రమపడి నానాథుఁడు తెచ్చిపెట్టుకొన్న యీవస్తువుల నన్నిఁటి నొకమూట గట్టుకొని ప్రక్కనున్న క్యాషుపెట్టెను బగుల గొట్టి చూచెను. అందు నలువదిరూపాయలు మాత్రముండెను. దొంగ యా సొమ్మును జేబులోఁ బడవైచుకొని యామూట చేతబట్టుకొని వెలుపలఁ

బడి యేత్రోవను బోయెనో యెవ్వరికిని దెలియకుండ మాయమై పోయెను. ఆసమయమున నాయింఢ్లలో నొక్కపిట్టయైనను లేదు. అందఱును దమతమపనులకుఁ బోయి యుండిరి. మరల సాయంకాల మైదుగంటలకుఁగాని యిండ్లకుఁ జేరరు!

# 18. వృక్షము

నాస్వామి జోడాసాంకో చేరుకొని యచ్చట పాల్‌బ్రదర్సువారి దుకాణమునందు జలువ చేసిన రెండుపంచెలను పదునేడురూపాయల యెనిమిదణాలకుకొని యొకసారి వాచివంకఁ జూచెను. మూఁడున్నర గంటలయ్యెను! తన శుభ దర్శనసుముహూర్త మెప్పుడువచ్చి యెప్పుడు తనకు దెలియకుండ దాఁటిపోవునో యని యాతనిభయము. అందుచేతనాతఁడు త్వరపడి లేచెను. కాని కంపెనీవారికి రెండుపదిరూపాయలనోట్లు నిచ్చెను. వారియొద్దఁ జిల్లరలేదు. పోనీ దానిని వదలిపైచి పోవుదమనియే యనుకొనెను. కాని యజమాని చిల్లరకొఱ కొకసేవకుని ప్రక్కషాపునకుఁ బంపించెను. వాఁడింకను రాలేదు. అందుచేత నానాథుఁడు తొందరతో "అయ్యా! నాకుఁ దొందరపని యున్నది. ముఖ్యమైనపని యున్నప్పుడే కాలము వేగముగాఁ బరుగెత్తిపోవుచుండును." అనియెను. ఆమాట విని యజమాని నవ్వుచు "అది పరుగెత్తదు బాబూ! అట్టి యుబలాటములో మనమనసే పరుగెత్తుచుండును. కాని యనంతమగుకాలమెప్పుడు నొక్కలాగే నడచుచుండును. మనకష్టసుఖములను గూర్చి యది గ్రీగంటనైనఁ జూడదు!" అనియెను.

నా భర్తయేదో ప్రత్యుత్తరము చెప్పఁదలఁచెను గాని యట్లు చెప్పలేదు. ఇంతలో సేవకుఁడు చిల్లర తెచ్చుటచే వానియొద్దనుండి రెండురూపాయల యెనిమిదణాలను దీసికొని వెలుపలికి వచ్చెను. ట్రాముబండి యప్పుడే కదలిపోవుచుండెను. అప్పుడాతఁడు చావుబ్రదుకుల

నాలోచింపక యీ బండి వెనుకనే పరుగెత్త నారంభించెను. బండి యాఁగనులేదు; ఆతఁడు పరుగును మానను లేదు. ఇట్లుకొంతదూరము పోవునప్పటికి కాతని కాలిజోడూడిపోయెను. చేతిలోని చిల్లర క్రింద పడిపోయెను. ఇంతలో రెండుబండ్లును, నొకగుఱ్ఱపు బండియు నాతని కడ్డముగ వచ్చుచుండెను. ఆప్రమాదావస్థఁజూచి బలిష్ఠుఁడగు నొక పురుషుఁడు చటాలునఁబోయి యాతని బలవంతముగఁ బట్టుకొని ప్రక్కనున్న కాలిబాట కీడ్చుకొనిపోయి "నీకుఁ జావుబ్రదుకుల లక్ష్యము లేదా? ఇప్పుడీ నడివీధిలో నీశవమునకుఁ బంచాయితీ జరిగింప వలసిన దే కదా! కలకత్తా వీధులవెంటఁ బోదలఁచినవాఁడు బయలు దేఱునప్పుడే పెండ్లాముబిడ్డల కప్పగింతలు చేసిరావలయును. మరల భగవదనుగ్రహమున నిల్లుచేరఁగలిగినచో నేఁటి కీగండము గడచినదని సంతోషింపవలయును! తెలిసినదా?" అని యదలించెను.

ఆమాటలకు నాభర్త విరక్తుఁడై యాతనిపైఁ గోపించి "నీవు నాకు బుద్ధులు చెప్పనక్కఱలేదు! కలకత్తాసంగతి నాకుఁ దెలియనిది గాదు! ఏదోగొప్పపని చేసినట్లు నీవు గర్వపడనక్కఱలేదు. పోపో"మ్మనెను.

ఆపథికుఁడు నామగనివంకఁ జూచి తిరస్కారసూచకముగా గంభీర స్వరముతో "ఓహో! నీవు భాగ్యవంతుఁడవగు బంగాలీబాబువలె నగపడుచున్నావే! అందుకే యింతటి మిడిసిపాటు!" అని మొత్తిపొడిచి తనదారిని బోయెను. తరువాత నాభర్త క్రిందఁ బడిపోయిన డబ్బులను వెదుకదొడంగెను. కొన్ని మాత్రము దొరకెను. తక్కినవి మట్టిలోఁ గూరుకొనిపోయినవో, కాక దారినిబోవు నెవ్వరిజేబులోనైన దూరిపోయినవో తెలియలేదు. ఆసమయమున వెనుకనుండి ట్రాము వచ్చుచున్న శబ్దము వినవచ్చెను. ఆతఁడు తత్తరముతోఁ గాలిబాట ప్రక్కకువచ్చి నిలువఁబడి బండి సమీపించినంతనే దాని నధిరోహించెను.

ఆతఁడు బండినెక్కినంతనే కండక్టరువచ్చి టిక్కెట్టునకు సొమ్మడిగెను.

నా స్వామి జేబులో నదివఱకుఁ బదుమూడణాలచిల్లర యున్నట్లు చెప్పితిని గదా. అది మొదటి ట్రాముబండి వెనుకఁ బరుగెత్తునప్పుడే క్రిందఁ బడిపోయినదో, అపాయము తప్పించుకొని కాలిబాటకు జేర్చఁబడినప్పు డాగొడవలో నేజేబుదొంగ చేతిలోనో పడిపోయినదో కాని యెంత వెదకినను జేబులో నొక్కకానియైన నగపడలేదు. అందుచే నాతఁడు మిగుల విచారించి దారిలో దొరికిన రూపాయనుదీసి కండక్టరునకిచ్చి తక్కిన చిల్లర యిమ్మనెను. వాఁడారూపాయను మ్రోగించి చూచి "ఇది మంచిదికాదు ! ఇంకొక్కటి యిమ్ము !" అనియెను.

ఆయనయొద్ద నింకొకరూపాయ యెక్కడిది? గత్యంతరము లేక ఈరూపాయ మంచిదేనయ్యా !" అనియెను.

కండ — మంచిదికాదు. మఱియొకటిమ్ము !

బాబు — ఇఁక నాయొద్ద లేదు.

కండ — అట్లయినచో దిగిపొమ్ము !

బాబు — మీరుబాగుగ బరిశీలింపుఁడు! ఇది మంచిదే. ఇప్పుడే పాక్ర్బదర్సువారు నాకిచ్చినారు.

కండ - మీవంటిబాబు లిట్టిరూపాయలను దీసికొన్నఁ దీసికొందురు. కాని మాయజమాని యిట్టివానిని ద్రిప్పి వైవక మానఁడు.

అనుటయు బాబు తనప్రక్కనున్న యొకపెద్దమనుష్యునకు దానిని జూపి "అయ్యా! ఇది మంచిదగునోకాదో చూడుఁడు!" అనియెను. ఆతఁడు దానిని దిరుగమరుగవైచి చూచి బల్లపైఁ గొట్టి మ్రోగించి "మంచిదికాదు! ఇది సత్తురూపాయ!" అనియెను.

ఇఁక నొకచిల్లిగవ్వయైన నామగనియొద్ద లేదు. అందుచే నాతఁడు దిగిపోయి కాలిబాటను నడచుట కారంభించెను. అప్పు డాతనికి "ఓయీ నీవు పోఁదలఁచుకొన్న దుర్మార్గమున మొదటి యడుగింకను మోపక మునుపే చేతఁ దమ్మిడియైన లేకుండఁ బోయితివే, యీవిధముగా నింక

నెన్ని సారులు ధననాశనము గావించుకొని జీవితకాలమునంతను గడపఁ గలుగుదువు?'' అని బోధించువారు లేకపోయిరి.

నడచిపోవుచుండుట యాతనికి మొదట గష్టముగనే యుండె గాని క్రమముగా నంతయిబ్బంది లేనిపోయెను. ఆతనిహృదయపటముపం దొక మనోహరచిత్ర మంకితమై పరమానందమును జేకూర్చుచుండెను. అప్పు డాతఁడు తనలో "ఇఁక నేనింటికిఁబోయి గులాబిసబ్బుతో సర్వాంగము లను రుద్దుకొని స్నానము చేసెదను. నేను కొని తెచ్చిన యత్తరులను రాచుకొందును. వాసననూనెలోఁ దలదువ్వుకొందును. సుందరవస్త్రముల నలంకరించుకొందును. జోళ్ళుతొడిగికొందును. అత్తరుపరిమళముల గుబాళించు చేతిరుమాలును జేబున నుంచుకొందును. మీసములను బాగుగదిద్దుకొందును. మునిజనులుగూడ నన్నుఁజూచి మోహించునట్లుగా నవమన్మథునివలెనలంకరించు కొందును!'' అని భావించు కొనుచుండెను.

మునిజను లనియెను గాని, మునికన్యలనుకొనిన బాగుగ నుండు నేమో! కాని యాతఁ డట్లుభావింపనప్పుడు నేను మునికన్యలని యన త్యము చెప్ప నెందుకు? కాని నేనొక్కమాట చెప్పమఱచితిని. ఆతఁడు కాలిమేజోళ్ళు మొదలు, పరిధేయవసనము, నుత్తరీయము, జేబు రుమాలుసహితముగా సుగంధద్రవసిక్తములుగాఁ జేసికొనవలయు నని భావించుకొనుటలో లోటు చేయలేదు. తరవాత జేబులో వాచి నుంచు కొని, బంగారుగొలుసు మొఖమల్ వేస్టుకోటుపై మెఱయుచుండఁ గుడిచేతితో సన్నని బెత్తమును నెడమచేతితోఁ జదివినను జదువకపోయి నను, అణాపెట్టికొనిన దినపత్రికను బట్టుకొని వీథివెలుపల నిలుఁవబడి తురకవానిచే జఫాచేయుటకు సిద్ధముగనున్న కోడిపుంజువలె కురుకురు మనుచుఁ దనప్రణయినికిఁ బ్రథమదర్శన మీయవలెననియు, నాఁటిరాత్రికి మాత్రము దుస్సహావియోగ విషానలజ్వాలల ననుభవించుచు వేగింప వలసి వచ్చినను మరునాఁడు మాత్రము శుభసమ్మేళన మహానందము

తప్పక లభింపఁగలదని యాతఁడు భావించుకొనుచు నుబలాటపడుచుండెను.

కాని పాపమోహాంధుఁడగు నానాథుని సుఖచింతనముం దెట్టి యశుభసంశయ మేర్పడినను బొడకట్టుటలేదు. ఆప్రాసాద ప్రాంగణమునం దాసుందరి నిలువఁబడి నవమన్మథాకారుఁ డగు తన్నుఁ గాంచినంతనే మోహపరవశయై చటాలున నెట్టిసూక్ష్మాంతరముం గాంచునో యాయవస్థల నన్నిటిని భావించుకొనుచుఁ బొంగిపొరలుచుండెను.

ఏమైన నేమి! ఆతఁడప్పుడు తనకుఁ దోఁచిన ట్లా నారమణీసందర్శన కల్పనానందము ననుభవించుచు నడచినడచి క్రమముగా దననివాస గృహద్వారముకడకుఁ జేరుకొనెను. ఇంటివైపు చూచునప్పటి కాతని స్వేదసిక్త కళేబరమంతటను ముచ్చెమటలు గ్రమ్ముకొనియెను. "ఏమది? గృహద్వారమున బీగమేది? గొళ్లెమే వేయబడలేదే. పోవునప్పుడు నేను గొళ్లెమును బీగమును వేయుట మఱచితినా!" అని నివ్వెఱపడి చటాలున లోనఁ బ్రవేశించెను. చూడఁగా నాతనిసర్వస్వము నపహృతమైపోయెను. ఎంతయో కష్టపడి తెచ్చుకొన్న ప్రియవస్తువులన్నియును బోయినవి. ఇఁక నుపాయమేమున్నది? మరల దెచ్చుకొనుటకు వేళకూడ లేదు. ఆతఁడు తనపెట్టె తెఱచి చూచుకొనియెను. దానితాళమును బగులఁ గొట్టినట్లుండెను. అందుంచిన డబ్బుతోనైన సమీపమునందలి యంగళ్లలో మరలఁ గావలసిన వానిని గొనఁదలఁచెను గాని యందొకగవ్వయైనను లేకుండఁబోయెను. హతాశుఁడగునాతఁడు వికలహృదయముతో మేజాపైఁబడి పొరలుచు నేడువనారంభించెను.

"అయ్యో! ఇంతటి శుభదినమునం దీ విషాదసంఘటన మేమి! ఇట్టిదొంగపని చేసినవాఁ డెవ్వడై యుండును? అట్టిదుర్మార్గుఁడు నా వస్తువులు ముట్టినంతనే యేల చావలేదు. దేవుఁ డున్నాఁడా లేఁడా! ఉన్నచో నపరాధులను శిక్షింపనక్కఱలేదా? ఇంతటి పాపకృత్య

మును గావించి చల్లగా వీధిని(బడిపోవుచున్న యాచోరునితలపై( బిడుగు పడలేదేమి?'' అని యనేకవిధముల( జోరునుద్దేశించి శాపములను, దేవునింగూర్చి తిరస్కారములను గావింప నారంభించెను.

ఆసమయమున నెవ్వరైన సమదర్శనులగు ధర్మబోధకు లచ్చట నుండుటయే తటస్థించినచో "ఓయీ! దేవుడున్నాడు! ఆతని ధర్మ శాసనమును లేకపోలేదు. పాపాత్ముల తలలు బ్రద్దలగుటయు వాస్తవమే కాని యందఱు నాదృష్టితో( బరీక్షింపజాలరు. అందఱు నారీతిగా ననుభవింపజాలరు. అందుచేతనే యీదుఃఖము నీవిప్పు డేమిచేయుటకు నిశ్చయించుకొని యుంటివో యించుక భావించి చూచుకొనుము! ఒకకులాంగనను ఒకసతీమణి పావనచరిత్రమును గళంకితముగ జేయుటకై యొకపాపాత్మురాలిని నియోగించి నీవును నామెయడుగు జాడలనుబట్టి యుందఱికి బోవుచుంటివి. మోసము ప్రలోభనము ధనదానము మున్నగు నసత్కార్యములలో నెట్టిలోపమును గావించుటలేదు.'' నీవిప్పుడు గావింప(దలంచిన మహాపరాధము నెదుట సామాన్యములైన నీవస్తువులను దొంగిలించిన దరిద్రుడగు చోరునియపరాధ మెంత పాటిది? ఆచోరుడు పాపబుద్ధి వగు నీవస్తువుల నపహరించి పరమేశ్వరుని ధర్మశాసనమునకు వికాసమును గల్పించినాడు! ఇప్పటికైన బుద్ధి తెచ్చుకొనుము. అనంతమహిమామయుడగు మహాదేవుని ధర్మశాసనమును స్మరించుకొనుశక్తి యింకను నీలో నింకిపోలేదు. కావున బాగుగ నాలోచించుకొని యనుభవమునకు దెచ్చుకొనుము. ఇంకను నీవీదుర్మార్గమున( బడిపోయినచో నిట్లే తుదివరకును దుఃఖ భోగము ననుభవింపవలసియే యుండును'' అని బోధించి యుందురు.

కాని — అయ్యో! అచ్చట నెవ్వరును లేకపోయిరి. అందుచే నాతని కప్పటికి మిగిలియున్న వివేకలేశము పాపాచరణోత్సాహో ద్రేకముచే నంతరించిపోయెను. అంతలోనే యతడొక్క నిట్టూర్పువిడిచి

లేచి మరలఁ దన వ్యాపారస్థలమునకుఁ బోయి మఱియొక నూఱు రూపాయలు తీసికొని ట్రాముబండినెక్కి చితూ్పరురోడ్డునకుఁ బోయి యచ్చట పాక్ బ్రదర్సు కంపెనీలోఁ దనకుఁగావలసిన యన్ని వస్తువులను దీసికొనియెను. తరువాత నింటికివచ్చి హర్షవిషాద హృదయముతో నగురీతి సుసజ్జితుఁడై సాయంకాల మైదుగంటలకుఁ దలుపుతాళము వైచుకొని మంగలికత్తె నియమించినచోటికిఁ బోయి యావీధిలో నటునిటు పచారుచేయుచుండెను.

౧౯

క్రమముగా సూర్యుఁ డస్తంగతుఁ డగుచుండెను. క్రమముగాఁ గల కత్తావీథులన్నియు సంధ్యాభ్రమణకారులగు ప్రజలచే నిండియుండెను. అంగళ్లన్నియు మెఱుపు దీపములచే విరాజిల్లుచుండెను. సంధ్యాంధ కారము క్రమముగా ఘనీభవించునప్పటికి కలకత్తానగర మహోపద్రవ ధూమపటలము సుఖసమీరము నాచ్ఛాదించి పథికులకు దృష్టిభ్రాంతిని గల్పించుచుండెను. అంతవఱకు నాతఁడచ్చటఁ గనిపెట్టుకొని యుండి తరవాత మరలి తనవిడిదికిఁ జనుదెంచెను. ఎప్పుడేముహూర్తమునం దెవ్వ రాతనిసందర్శించిరో, దర్శింపనేలేదో యాతనికెంతమాత్రమును దెలియదు.

ఆతఁ డింటికి వచ్చి యావిషయమునే యాలోచించు కొనుచు, జేబులోనుండి విలువగల యొకసిగరెట్టును దీసి దానిమొగమున నిప్పంటించి ధూమపానము చేయఁ దొడంగెను. సరిగ నాసమయమునకు నగుమొగముతోఁ గార్యసాఫల్యమును సూచించు గర్వితపదవిక్షేప ముతో మంగలికత్తె వచ్చెను. బాబు దానిని జూచినంతనే నోటియందలి సిగరెట్టును జేతఁ బట్టుకొని, వదనాంతరాళమునందలి ధూమము నూది వాయుమండలమున మిళనము గావించి "వచ్చితివా? ఈకుర్చీపైఁగూర్చుం డుము! విశేషములేమి? నేను రాలేకపోయినందుకు క్షమింపుము. ఒక

ముఖ్యకార్యముంగూర్చి పోవలసివచ్చుటచే నిట్లు జరగినది!" అనియెను.

నానాథుఁ డప్పు డాపాపాత్ముఁరాలిని పరీక్షింపవలయు నని యట్లు చతురతతోఁ బలికెను. కాని అయ్యో! ఆతనివంటి కామపిశాచగ్రస్తు లగు తరుణ వయస్కులకట్టి తాత్కాలికవైన మ్మాయాజాలములు, విడి పించుకొనఁ దగినవే మైనచోఁ గలకత్తాయందలి బహుసాధుకుటుంబ ములు హాహారవప్రతిధ్వనితము లగుట కవకాశ మెట్లుండును? అప్పుడా మంగలికత్తె నవ్వుచు "ఇదేమిబాబూ! అవ్వతో హాస్యమాడు చున్నావా? నీవు వచ్చుటకుముందే మేము డాబాపైకెక్కి చూచు చుంటిమి. నీవటనుండి మరలినంతనే నేనును మేడదిగి వచ్చితిని" అనెను.

బాబు పరమానందముతో "నిజమే! నీకార్యమునం దెట్టి సంశయ మునులేదు." అని చెప్పుచు నామెవలన సర్వవృత్తాంతమును దెలిసికొన వలెనని యుబ్బాట లూరుచుండెను. మంగలికత్తె నవ్వుచు "నేను నీపనిలో లోటు చేయుదునా? వెఱ్ఱివాఁడా! నిన్ననీయొద్ద సొమ్ము దీసి కొని పోయి నలుగురు పెద్దమనుష్యులసాయమున పోలీసువ్యవహారమును దీర్చుకొంటిని. ఆపెద్దమనుష్యులకుఁ బదునెనిమిదిరూపాయ లీయవలసి వచ్చినది. ఈయకుండ నింటికివచ్చుట యెట్లు? ఊరివా రందఱికిని నాయం దధిక మగు గౌరవమున్నది. ఆసొమ్ము సాయంకాలమునకుఁ దెచ్చి యిచ్చెదనని వారి నొప్పించితిని. కాని యాప్రయత్నము చేయనేలేదు. ఈనాడంతయు నీపనిమీఁదనే తిరుగుచుంటిని. కావలసిన సహాయ మంత యును నీవేచేసితివి. బాబూ! ఈలోటుకూడ నీవేతీర్పుము!" అనియెను.

బాబు వికలచిత్తముతో "అవ్వా! అలాగే చేయుదును. కాని నాపని యేమి చేసితివో చెప్పుము!" అనియెను.

మంగలికత్తె నవ్వుచు "వెఱ్ఱివాఁడా! ఈయవ్వ చేయిచేసికొన్న పనియం దెన్నఁటికిని లోటు జరుగదు! కాని నీవొకపొరపాటు చేసితివి. దుస్తులుమాత్రము —" అనియెను.

బాబు — దుస్తులవిషయమున జెప్పవలసినగోల చాలగా నున్నది. తరువాతఁ జెప్పెదను. నాయదృష్ట మేమనిన — నాప్రాణప్రియతమురాలు నాజీవనసర్వస్వము, నాహృదయేశ్వరి యగునా సుందరీమణి నిమిషమాత్రమైననేమి నన్ను దర్శించినది! అదియే పదివేలు!

మంగ — నిమిష మేమి? పూర్తిగా నొకగంటసేపు! నీవు మరలిపోవునప్పు డామెతరళనయనములు నీదర్శనార్థమై నిన్నే చాలసేపనుసరించినవి. చేతిలోనియాటవస్తు వాకస్మికముగ నెచ్చటనో పడిపోయినప్పుడు దిగ్భ్రాంతుఁడై పోవుబాలకునివలె నీవు కనుమఱుగైనంతనే యాబాలిక యస్థిరచిత్తయై తల్లడిల్లిపోయినది.

బాబు — నిజమేనా? నిజమేనాయవ్వా! నేనెంతయదృష్టవంతుఁడను! నేనుమాత్ర మామెను జూడఁ జాలకపోయితిని. అట్టి శుభముహూర్తము నాకు లభించునా! అందుకొఱకు నాప్రాణములనైన నిచ్చుటకు సిద్ధముగా నున్నాను.

మంగ — ప్రాణము లీయనక్కఱలేదు బాబూ! ఈనాచేతులయందుఁ గార్యభారముంచితివి! ఇది యెన్నఁటికి నిష్ఫలము గాదు.

బాబు — మరల నెచ్చట దర్శన మొసంగునో యడిగితివా?

మంగ — అడుగ కేమి?

బాబు — ఎక్కడ?

మంగ — కాళీఘట్టమునందు — నీవిచ్చటనుండియే తిన్నగా కాళీఘట్టమునకుఁ బోయి దేవినాట్యమందిరమునం దుండవలయును. అప్పు డామె యచ్చటికి వచ్చును. నిన్ను దర్శించును. తరవాత నేవోకొన్ని వస్తువుల గొనుటకు వెలుపలికిఁ బోవును. అచ్చట నీతో నొకటి రెండు మాట లాడును. ఇఁక నా నాటికం తే.

బాబు — ఆమెతోఁగూడ నెవరైన నుందురా?

మంగ — ఆమె పినతల్లియుండును, తల్లిలేనియామెను పినతల్లియే

పెంచినది. ఆసుందరి "అమ్మా!" అని యామెనే పిలుచుచుండును.

బాబు — ఎంతమందియువతులో కాళీదర్శనమునకు వచ్చుచుందురు. వారిలో నే నాసుందరి నెట్లానవాలు పట్టఁగిలను.

మంగ — ఏమి! నేనెక్కడకుఁ బోయెద ననుకొన్నావు?

బాబు — అట్లయినచో నింకేమి? కాని బయటికి వచ్చి వారు బజారుచేయుచుండఁగా నేను వెనుకనే యుండి యొకటిరెండు మాట లాడినచో వారేమియు ననుకొనరా?

మంగ — నేను పరిచయము చేసెదను. నామేనల్లుడు మీయొద్దనే పనిచేయుచుండెనని చెప్పెదను.

బాబు — మంచిది. అప్పుడు నే నేవిధమైన నొకటిరెండు భక్ష్యముల పొట్లములు వారి కిచ్చినచోఁ దప్పు లేదుగద.

మంగ — తప్పులేదు. అంతకు నేనున్నానుగదా ఇదిగోచూచుము. తరువాత మీరిద్దఱు నొకచోటఁ గలిసికొని స్వేచ్ఛగా సంభాషించు కొనుటకుఁ దగిన యేర్పాటుకూడఁ జేయుదును.

బాబు — ఎట్లు చేయుదువు. నేను నీద యాభిక్షుకుఁడను.

మంగ — ఆలిపురోద్యానమును దర్శించుమిషమీద వారిని కాళీ ఘట్టమునుండి పయనము చేయింతును. అప్పుడుమీకు మహానుకూల ముగానుండును. వారితోఁ గలసి రెండుమూడుగంటలు తిరుగుటకును, సమయముదొరికినప్పుడు మాటాడుకొనుటకునుగూడ నవకాశముండును. నీ వా సుందరితో మాటాడుమాట లామెపినతల్లి తెలిసికొనఁజాలదు. ఆమెకు గొంచెము చెవుడు.

బాబు — అవ్వా! ఇఁక నీవంటి వారు నాకీజీవితమునం దెవ్వరు కలరు. బ్రదికియున్నంతవఱకు నేను నీదాసుఁడనై యుందును. ఆమెపిన తల్లి నేనుగూడ నాయుద్యానమునకు వచ్చుటకు సమ్మతించునా?

మంగ — నీవు బండికుదుర్చుకొని వచ్చెదవుగాదా ఇఁక నుద్యాన

మునకుఁ బోవుటకు కర్చుక్కఱలేదు. అందుచేత నామెయు నంగీక రించును. ఒకవేళ సంశయించినను నేను సరిది చెప్పెదను. అదికాక పట్టణములోని గొప్పయింటి యాఁడువాండ్రు త్రాఁడువిప్పుకొన్న యావుల వలె నిల్లువదలినంతనే షికారులు చేయుటకు నెక్కడికి బోవుటకును సందేహింపరు. యజమానులు పబ్బియ్యకపోయినను థియేటరులు, కాళీఘట్టము, మ్యూజియము, గంగాతీరములు, మందిరములు, మఠములు- ఇవి యవి యననేల యిష్టమువచ్చినట్లు తిరుగుదురు.

బాబు — ఎప్పుడు బయలుదేరెదరవ్వా!

మంగ — నీయిష్టము వచ్చినప్పుడు.

బాబు — రేపు?

మంగ — ఆప్రసంగము వచ్చినది. బయలుదేఱుదురు. ఎప్పుడో యింకను నిశ్చయము గాలేదు. నే నాసుందరితోఁ జెప్పవలెను. ఆమె పినతల్లిని బట్టుకొనును. పినతల్లి యింటివారందఱి నడుగవలెను. ఎట్లయి నను రేపో యెల్లుండియో తప్పదు.

బాబు — మంచిది.

తరువాత నెన్నియో మాటలు జరిగెను. అంతట నామగఁడు తన హితాకాంక్షిణి యగుమంగలికత్తెకుఁ బదునేను రూపాయలను సమ ర్పించి సెలవిచ్చి పంపెను. పగలంతయు నెన్నియోపాట్లుపడి యలసి పోయిన నాభర్త యారాత్రి యచ్చటనే యుపవాసముతోఁ గలతనిద్దు రతో గడపివైచెను.

## 20. పుష్పము

పదిగంట లయ్యెను. కాళీఘట్టమున మాతృమందిరమునకు జనుల గమనా గమనములు విశేషించుటచేఁ జీమ దూరుటకు సందైన లేకుండెను. ఆదినమున జనసంఘము క్రిక్కిరిసిపోవుటచే నాట్యమందిరమున గొందఱు

చండీస్తోత్రములను బఠించుచుఁ గూర్చుండిరి. కొందఱు మాతృనామ స్మరణము చేసికొనుచుండిరి. కొందఱు హోమాదులను గావించుచు మాతృకృపాకర్షణము చేయుచుండిరి. నాట్యమందిర దక్షిణభాగమునఁ బెద్దపెద్ద మేకల ఖండితకంఠములనుండి రుధిరధారలు వెలువడి యాప్రదేశమును బంకిలముగఁ జేసివైచుచుండెను. అంతటను జనసమ్మర్దమే. అంతటను గోలాహలమే.

నానాథుఁడు చాలసేపుక్రిందటనే వచ్చి యామందిర పశ్చిమభాగమున మూడవస్తంభమునొద్దఁ గ్రిందిసోపానముపై గూర్చుండి స్తబ్ధహృదయముతో "ఆమె వచ్చును!" అని గంపెడాసతో నెదురుచూచుచుండెను. తొమ్మిదిగంటలకే వారు రావలసినది. పదియైనను మంగలికత్తె దర్శనము కూడ లేదయ్యెను. రారేమో యని యాతనిగుండెలు కొట్టుకొని పోవుచుండెను. పదేసినిముషములకొకసారి యాతఁడు "వత్తురా, రారా?" యను తర్కవితర్కములతోఁ గొట్టుకొనిపోవుచుండెను. ఎంతయో యాశలో నెంతయోనిరాశ మృత్యుబాధకంటెను ఘోరమైనది. ఇంకను గనుపెట్టుకొని యుండవలయునా, లేచిపోవలయునా? ఏదియు నిశ్చయించుకొనలేక ద్వారమునొద్ద నిలువఁబడి నలువంకలఁ బరీక్షించుచుండెను.

ఇంతలో దాహముచే శుష్కించిపోయిన కంఠముగల చాతకమునకాకాశమున మేఘదర్శన మైనట్లు నాస్వామికి మంగలిదాని దర్శనము లభించెను. ఆమెచుట్టుప్రక్కల జనసంఘము నిండియుండెను. తనమనోహారిణి యందున్నదియో లేదో? ఆమేఘమునందు జలమేయున్నదో పెళపెళగర్జించుచుఁబడు పిడుగే యున్నదో చాతకమున కింకను బోధపడ లేదు. ఆమంగలికత్తెమేఘము కర్ణకఠోరభీకరధ్వనితో "ఆమె రాలేదు" అనుపిడుగువంటి వార్తనే తలపైఁ బడవైచినచో నిఁక నాచాతకము జలాశను వదలుకొని భయదనిర్ఘాతానలజ్వాలలోఁబడి భస్మము గావలసినదే. కాని చాతకమున కిప్పు డాభయము వదలిపోయినది. ఆ నీల

మేఘము జలభారానతమై చాతకమును సమీపించెను. అందుచే నావాన కోయిలహృదయ మానందనర్తనము చేయఁదొడంగెను. అప్పుడు ద్వారమునందలి జనసమూహము పాయవిడిచి గుంపులుగుంపులుగాఁ దమ నిర్దిష్టస్థానములకుఁ జేరుకొనుచుండెను. అప్పుడు తాను చెప్పినట్లు మూడవ స్తంభమునొద్దఁ గూర్చుండియున్న నాస్వామిని మంగళికత్తె దర్శించెను. ఆమెనెనువెంటనే యతసీకుసుమ సువర్ణాంగియు, పరిపుష్ట మనోహరావయవయు, నిబిడనితంబయు, ఘనజఘనయు, పయోధర భరానతయు, అలక్తకయుత చరణయుగళయు, మదమరాళగమనయు నగు నారమణీమణి దర్శనీయమై యుండెను. వేషభూషణాదులచే నాయువతి రూపుదాల్చిన సౌందర్యదేవతవలె నాతనికన్నులకు దనియించుచుండెను.

నాస్వామి యామె నెమ్మొగమువంకఁ దిలకించెను. ఆకర్ణవిశ్రాంతము లగు నానయనములు, ప్రవాళమణిసన్నిభంబులగు నాయధరోష్ఠములు, గులాబిపువ్వులఁ దులకించు నాచెక్కుటద్దములు నాతనికన్నులపండువు గావించుచుండ నాతనిసర్వాంగకములును విద్యుత్తాడితము లైనట్లుండెను. ఒక్కమాట యామె నోటినుండి యాలింపవలయునని యాతనిప్రాణములు తల్లడిల్లిపోవుచుండెను. ఆమె తన్నుఁ బలుకరింపకున్నచో నాతఁడు జన్మ మెత్తినందుకు ఫలమేమున్నది? అందుచేతనే కాబోలు మానవజన్మము దుర్లభ మని పెద్దలు వక్కాణించుట! పశ్వాదిజన్మములయం దిట్టి సౌంద ర్యమును నిట్టిసుఖానుభవమును లభించుట యెట్లు? ఆమె యేమియును మాటాడక తనపని చూచుకొని చల్లగాఁ దనదారినే పోయినచో నిఁక నుపాయ మేమి? ఉపాయమా? గొంతుక కురిత్రాడు బిగించుకొని చావవలసినదే!

కాని యావిచారముకూడ నాతని నెంతయోసేపు బాధింపలేదు. ఆ యువతి పినతల్లి నామగని కతిసమీపమునందే నిలిచియుండెను. ఆమె వెనుకనే యా మనోహారిణియగు సుందరి నిలువఁబడి యుండెను.

ఆమె పార్శ్వముననే చంచల నయనయు, దూరదృష్టి సంపన్నయు, ఖర్వాంగియు ప్రౌఢవృద్ధ వయోమధ్యస్థయు నగు మంగలికత్తె యొక్క గుడ్డమూటను చేతబట్టుకొని నిలిచియుండెను. నాస్వామి తత్తరముతో లేచి ముందుగా నాసుందరి పినతల్లికి నమస్కారము చేసెను. కాని యా యువతికిఁ బ్రణామము చేయలేదు. అందుచే నాయువతి యప్పు డేమను కొనియెనో సరిగాఁ జెప్పఁజాలము.

ఇఁక దేవతాదర్శనము చేయించుభారము నాస్వామిపైఁ బడియెను. ఇదివఱకు మంగలికత్తె చెప్పినప్రకార మాతఁడు దేవీమందిరమునం దానాటిపంతువా డగుపండాను దర్శించి యాతనికిఁ బదిరూపాయలు సమర్పించి జనసమ్మర్దము లేకుండఁ దమకొక్క నిమిషమాత్రము దేవీ దర్శనము చేయించునట్టి యేర్పాటు గావించియుండెను. అందుచేత పండా కొందఱు సేవకులతో వచ్చి బలవంతముగా జనసంఘము నొత్తి గించి వారిని నలుగురిని కాళీమందిరమునకుఁ దీసికొనిపోయెను. వారు సుఖముగాఁ గాళీమాతను దర్శించి వెలపలికి వచ్చిరి.

అప్పుడు పెద్దపూజారి నామగనిచెంతకు వచ్చి "అయ్యా! మీవంటి వారికి మనవి చేయనలసిన దేమున్నది? నేఁడు మీరు కాళీమాతకు భోగము చేయింపవలయును. ఆపుణ్యకార్యము మీకొక లెక్కలోనిది గాదు - ఏబదిరూపాయలు చాలును. తరువాత షోడశోపచార పూజ చేయింపవలయును." అని చెప్పెను.

అంతటి సుందరీమణియు, నవప్రణయినియు నగుయువతి చెంత నుండఁగా డబ్బునకు వెనుదీయుట యవమానము గాదా! నాభర్త యొకటి రెండుసారులు వలదని వారించెను గాని తుదకాతని కేఁబది రూపాయల ముడుపును బూర్తిగాఁ జెల్లించివైచెను.

పిమ్మట వారు మందిరసోపానములను దిగివచ్చుచుండఁగా కాళీఘట్ట మునందలి కుమారికలును, బ్రాహ్మణులును భిక్షార్థులై వారిని జుట్టఁ

బెట్టుకొనిరి. మఱియు ననేకవిధములగు బిచ్చగాండ్రు గుంపు గుంపులై వచ్చి వారి నావరించి కాలుగదలనీయకుండఁ జేసిరి. ఇఁక గత్యంతరము లేక నాభర్త మరల నాపండాను బిలిచి మఱి పదిరూపాయ లాతనిచేతఁ బెట్టి మమ్మాచెరనుండి తప్పించుమని వేడుకొనియెను. ద్విగుణిత మగు సంభావనను గ్రహించి యాపండా యతిసులభముగా వారి నా విపత్తు నుండి యుద్ధరించెను.

ఇఁక గావలసినది విశ్రాంతియు సంభాషణమును - అప్పుడు నాభర్త యా యువతిపినతల్లి నుద్దేశించి "అమ్మా! ఇఁక మీభోజనాదికము మాట యేమి?" అని ప్రశ్నించెను.

పిన — మేము బండిపై వచ్చితిమి. ఆబండివానికి మొదటిగంట కనిమిదణాలును దక్కినగంటల కొకటి కారణాలచొప్పునను నద్దెయిచ్చుట కేర్పాటు చేసికొంటిమి. కావున మేమింటికిఁ బోయియే భుజింతుము.

బాబు — మ్యూజియమును జూచుటకుఁ బోరా!

ఇంచుకదూరమున నిలిచియున్న యువతీమణి యామాట నాలకించి మంగలికత్తెను సమీపించి మృదుస్వరముతో "పోవుదము!" అనియెను. ఆమాటవిని నానాథుఁడు స్వర్గమునుండి కిన్నరీగీతము నాలించినట్లు పరమానందభరితుఁడై "అట్లయిన రండు. పోవుద" మనియెను.

అదివిని పినతల్లి యించుక సంశయించుచు "ఎక్కడి మ్యూజియమమ్మా!" అనియెను.

సుందరి — ఇక్కడనే! ఆలీపురమునందు. నీవెప్పుడును చూడలేదు. నేను నాచిన్నప్పుడు చూచితిని. అది యెంతయో రమణీయమైన దృశ్యము! అనేకజంతువులు, పక్షులు, పాములు, పెద్దపులులు, సింహములు జీవముతో నచ్చట నున్నవి. ఆయుద్యానమునం దెన్నియో జలాశయములు, పుష్పలతానికుంజములు, జలయంత్రములు హృదయనయనానందకరములై యుండును. జన్మ మెత్తినందు కట్టి మనోహరోద్యాన

మును జూచి తీరవలయును.

పిన — ఇంటిలో నెవ్వరికిఁ జెప్పలేదు. అంతవఱకును బోయి వచ్చుటకై బండియద్దెకైనను సొమ్ములేదు. పోవుట యెట్లు?

ఆమాట విన్నంతనే నాస్వామి వినీతస్వరముతో "మీరావిషయమున సంశయింపనక్కఱలేదు. నేనున్నాను. చూడవలెనను కోరిక యున్నచో బయలుదేఱుఁడు! కర్చులకేమి లెండు!" అనియెను.

సరే యని నిశ్చయించుకొని యప్పుడు వారందఱును బజారు చూచుటకు బయలుదేఱిరి. కాళీమందిరము నెదుట నున్న దుకాణము మొదలు తుదివఱకును గల యంగళ్ళన్నియు దిరిగి యెవరికిఁ గావలసిన వస్తువులను వారు కొని తీసికొని వెనుకనే వచ్చుచున్న బండిలోఁ బడవైచుచుండిరి. ఆవస్తువుల కీయవలసిన సొమ్మంతయు నామగఁడు చెల్లగట్టుచుండెను. కాని యావస్తువు లాయువతివియు, నామెపినతల్లివియు, మంగలిదానివియును — అంతేకాని నామగని కొక్కటియును లేదు. తరువాత వారందఱును కాఫీహోటలునకుఁ బోయి కావలసిన యుపాహారముల నారగించిరి. అనంతర మా ముగ్గురు యువతులును జక్కగా శకటారూఢులైరి. బండివాని ప్రక్కను నానాథుఁడు కూర్చుండెను. బండి బయలుదేఱి పోయెను.

సకాలమునకు వారు జులాజికల్ గార్డెనుచేరుకొని యందలి చిత్రవిచిత్ర వస్తువులను సందర్శించుచు దిరుగుచుండిరి. ఆసమయమునఁ బ్రణయినీ సహితముగ నట్లు సంచరింపఁ గలుగుట నానాథునకు స్వర్గసుఖము లభించిన ట్లుండెను. కాని ప్రతికార్యమునందును విరతియు, వ్యవధానమును, వ్యవధానమునం దభావమును గానవచ్చుచుండును. మూఁడుగంటల వేళకు వారు మ్యూజియమునుండి బయటికి వచ్చిరి. ఎప్పటివలె బండి నెక్కి పయనమై ధర్మతలావీథికిఁ జేరుకొనిరి.

నాస్వామి యచ్చట దిగి వారింటివద్ద బయలుదేరినది మొద లప్పటి

వఱకున్నైన యద్దె యంతయు బండివాని కిచ్చి తా నా యుంగనలయొద్ద సెలవు గైకొనెను. వారితోఁగూడ నింటివఱకును బండి నెక్కి పోవుట కాతని కధికారమేది? ఆతఁడు గూడ వారితోఁ బోయినచో నింటివా రందఱు నేమనుకొందురు? — బండి యుత్తరాభిముఖముగ గదలి పోయెను. నానాథుఁడు ట్రాముబండికొఱకుఁ బ్రతీక్షించుచుండెను. వియోగ విచారముచే నప్పుడాతని ప్రాణములు తల్లడిల్లి పోవుచుండెను. అప్పు డాతఁడు తనలో "ఓవిశ్వమా! నీకించుకంతైన నంతస్సారము లేదేమి? నీయందలి యేపదార్థమునకును స్థిరత్వమనుమాటయే లేదే? నేఁటి దినమంతయు నెంత యానందముతో వికసించినదో యావికాస మంతయు నింతలోనే యవసితమై పోయెనేమి? ఆనందరస వాహిని యందు ద్విగుణీకృతమగు దుఃఖానలజ్వాల యంతర్లీనమై యున్నదని యెవ్వ రెఱుఁగుదురు?" అని యనేకవిధముల తర్కవితర్కములు చేసి కొనుచుండెను.

"సుఖానందానుభవముతో హాయిగాఁ గడపిన యా శుభ దిన మెప్పుడు నట్లే యుండవలయునని యాతని యభిలాష! ఏది సుఖముగఁ దోచునో యట్టికార్యము నాచరించుటయే మానవస్వభావము. ఆలు బిడ్డలుగాని, బంధుమిత్రులుగాని మరణించినచో నెవ్వరును గూడఁ బోఁ జాలరు. అంతయును మూన్నాళ్ళముచ్చట! జనుఁడు మరణించినచో శ్మశానము స్వాగతమిచ్చును. అంతేకాని యాతనవెంట నెవ్వరును బ్రయాణము చేయరు. కావున బ్రదికియున్న నాలుగు దినములలోను దన మనసు వచ్చినట్లు సుఖభోగముల ననుభవింపవలసినదే!" అనికూడ నాతఁడు నిశ్చయించుకొనెను.

చాలకాలమునుండి పాపకార్యాసక్తుఁడై యున్న యాతనికి వివేకశక్తి చాల దుర్బలమైపోయెను. ఆతఁడు తనయవివేకోక్తులకును నవివేకాలోచనలకును లోఁబడి తలయెత్తఁ జాలకుండెను. అట్లు చాలియేయున్నచో

జీవనమునకు మరణ మున్నదనియు, నాలుబిడ్డలెవ్వరు నప్పుడు వెంట రారనియు జ్ఞానమే యున్నచో నింకను నూతనబంధములచే బద్ధుడగుటయు, నూతన పాపకృత్యములం దనురక్తుడగుటయు నూతన హృదయ జ్వాలలలో దగ్ధుడగుటయు నెందుకు? కొలదిదినములలోనే యంతయు బోధపడకమానదు. ఈపాపకర్మముచే బ్రజ్వరిల్లు పరితాపానలము భగభగమండుచు సర్వాంగకములను దగ్ధములుగాఁ జేయుచుండ సుఖావాసమును ఆశాసౌధమును దుఃఖాశ్రువాహినులలో దేలిపోవుచు నెన్నఁడు నెఱుంగని యేయంధకారక్షేత్రమున మునిఁగిపోవునో యను భవమునకు రాక మానదు. ఈజగత్తునం దానందము త్యాగమం దున్నదిగాని భోగమునందు లేదు.

ఇంతలో ట్రాముబండి వచ్చెను. ఆతఁడు దాని నధిరోహించి పోవుచు నానాటికర్చులను లెక్కవ్రాసుకొనుచుండెను. మొత్తముమీఁదఁ గాళీదర్శనప్రయాణమున కైన కర్చు రెండువందలడెబ్బదియేడు రూపాయలు!!

## ౨౧. ఫలము

ఇఁక సహింపలేకపోయెను. మూఁడుదినములైనను మంగలికత్తె రాలేదు. విరహవికారముచే నాభర్త మిగులఁ జిరాకుగా నుండెను. వ్యాపారమునందు బుద్ధియే లేదు. కర్మచారులు చెప్పుమాటలను విని పించుకొనుట లేదు. ఎప్పుడు నున్మత్తునివలె నొక్కటేదృష్టితో వీథి వైపునకే చూచుచుండెను. ఆమూఁడుదినములలోఁ గొన్నినిమిషములు మాత్రమే తనయింగడికొట్టునం దుండఁగలిగెను. ఒకనాఁటిరాత్రి పది గంటలప్పుడుమాత్ర మొకసారి యింటికి వచ్చెను. తక్కినకాలమంతయు దాను ప్రత్యేకముగ నుండు నద్దెయింటనే పడి యుండెను.

ఆమంగలిదాని యిల్లెక్కడనో యాతనికి దెలియదు. అందుచే నాతఁ డామెను వెదకి కనుఁగొనలేకపోయెను. కిటికీతలుపులు తెఱచియే యుంచు

కొనెను గాని మునుపటివలె నాసుందరి దర్శనమును లభించుట లేదు. అప్పుడప్పు డాయింటిలోనుండి కలహాసంభాషణములును విధినిర్బంధ వాక్యములును సగముసగముగా నాతని చెవులం బడుచుండెను. కాని వాస్తవ మాతనికి బోధకాకుండెను. అందువలన నాతని కెన్నియో విపరీతాలోచనలు పుట్టుచుండెను.

క్రమముగా నాతనిప్రవర్తనమంతయు నామామగారికిం దెలియ వచ్చెను. ఆయన యెంతయోప్రయత్నించి చూచెను గాని కారణ మాతనికిం దెలియరాదయ్యెను. అప్పు డాయన నన్నడిగెను. నాకును దెలియదని నేను చెప్పితిని. మామగారు చాలవిచారించుచుండిరి. ఎట్లయిన నేమి! అదృష్టవశమున నాభర్త రాత్రి యింటికి వచ్చెను. ఎప్పటివలెనే యుండెను. గాని భిన్న భావమేమియు నగపడలేదు. ఆతం డారాత్రి సురాపానముకూడం జేయలేదు. కాని యాతని చింతాన్విత మగు మ్లానముఖమును, సంకుచిత దృష్టులును మాత్ర మాతని మనో వికారమును బయటంబెట్టుచుండెను.

ఆతనియవస్థను భావభంగిని గనిపెట్టి యాతనికి వ్యాపారమునం దేదియో వ్యాఘాతము కలిగెనని యనుకొంటిని. కాని యావిషయముం గూర్చి నేనప్పు డేమియు మాటాడలేదు. ఎప్పటివలెం గాలుసేతులు గడుగుకొనుటకై జలము నందించి లోనికిం దీసికొనిపోయి కూర్చుండం జేసి రుచ్యములగుభక్ష్యములతో భోజనమును వడ్డించితిని. అప్పు డాతండు భోజనము చేయుచుండంగా నేను మృదుస్వరముతో "అదియేమి యిట్లున్నారు?" అని ప్రశ్నించితిని.

నాభర్త విరక్తభావముతో వికృతముఖభంగితో "ఎట్లున్నాను?" అనియెను.

నేను — మీమ్లానవదనముం బట్టిచూడంగా మీ మనసులో నేదియో విచార మున్నట్లు తోంచుచున్నది.

స్వామి — నాకువిచార మున్నట్లు నీ వేవిధముగా గ్రహించితివి?

నేను — మీగండస్థలములందలి కాళిమము, మీలలాటమునందలి నాడీసంకోచనమును, మీ దృష్టులయందలి చాంచల్యమును మీమనసులోని విచారమును సూచించుచున్నవి!

స్వామి — చాలుఁజాలు! ఇఁక నీకవిత్వమును గట్టిపెట్టుము! క్రయవిక్రయములు చేసికొనుచుండుమాకుఁ గవితామాధుర్యము బోధపడదు! వ్యవహారమునందలి లాభనష్టములు, క్రయవిక్రయములందలి హెచ్చుతగ్గులు చూచుకొనుటతోనే మాసర్వశక్తులును సన్నగిలిపోవును. అందుచే దేహమునం దించుక యారోగ్య నారోగ్యములు గానవచ్చుచుండును. ఇవియన్నియు నింటిలోనియాఁడువాండ్రకు నివేదింపవలయునన్నచో నీకఁ జెప్పవలయునా?

నేను — నేనూరక యట్లు చెప్పుట లేదు. మీయొద్ద నాకెట్టిరహస్యమును లేదు. మీరు నాకుఁ బ్రత్యక్షదేవతాస్వరూపులు. దేవతలసన్నిధి నాత్మగోపనము చేసికొనుట మహాపాతకము. మీరు స్వకార్యములయందు విముఖులై యుంటిరి. సకాలమునకుఁ గర్మస్థానమునకు బోవుట లేదు. కొట్టునుండి తీసుకొన్నధనము నందు కర్చుపోగా మిగిలిన సొమ్మును దిరిగి యిచ్చుటలేదు. లెక్కకూడ నిచ్చుట లేదు. రాత్రులు సరిగా నింటికి వచ్చుటలేదు. కర్మస్థానమునందైన నున్నట్లులేదు. ఈ సంగతులన్నియును మీ బాబుగారు కనుపెట్టి యేమియుఁ దెలిసికొననేరక యీవిషయముంగూర్చి నన్నడిగినారు. నాకును దెలియదని నేను బదులు చెప్పితిని —నిజము చెప్పుఁడు! మీరిట్లున్నా రేమి?

నాభర్త నా మొగమువంకఁ జూచి, కుటిలభ్రుకుటియై వికృతస్వరముతో "చెప్పనా? నిజము చెప్పనా? — నాకు లోలోపల నేదియో రోగ మంకురించినది!" అనియెను.

నే నదరిపడితిని. తత్తరముతో "ఏమి జబ్బు చేసిన?" దంటిని.

స్వామి — చిరాకుతో "ఏమిజబ్బా? మృత్యురోగ" మనెను.

నేను — మృత్యురోగ మను నొకవిధమైన జబ్బున్నదని నేనిదివఱకు వినియుండలేదు. నిశ్చయముగా నిది కోపముతో నన్నమాటయా; కాక యసలుమాటయేనా?

స్వామి — అసలుమాట యొకటి నకలుమాట యొకటియుండునా? రోగము పుట్టినదని చెప్పినప్పుడు తెలిసికొనలేనిదాని కసలుమాట యింకేమని చెప్పుదును?

నేను — రోగమే యైనచో మంచిడాక్టరునకు జూపించి మందుతీసికొనఁగూడదా? కొంతకాల మేపనియును జేయక ఇంటనుండి విశ్రాంతి తీసికొనఁగూడదా?

స్వామి — డాక్టరునకు జూపించుటయు నైనది. మందు తీసికొనుటయు నైనది. కాని యేమియు లాభము లేకపోయినది.

నేను — అట్లయినచో నిఁక నుపాయమేమి?

స్వామి — ఇది యేమిచేయఁ గలదో చూచుచుండుటయే.

ఆరాత్రి యీవిషయమైన సంభాషణలోనే గడచిపోయినది. సత్య విషయము మాత్రము లేశమైనను నేను గ్రహింపలేకపోయితిని. అయినను నేనాతని పాదములుపట్టుకొని "స్వామీ మీరు పగలంతయు నెచ్చటనున్నను రాత్రులుమాత్రము తప్పక యింటికి వచ్చుచుండుఁడు! రాత్రులు మంచిభోజనమును, నిద్రయు, నుపచారములును లేకున్నచోఁ బగలంతయును శ్రమపడువ్యాపారుల కనారోగ్యము గలుగక మానదు! మీరు దయయుంచి నామాట వినవలయును!" అని యనేకవిధముల బ్రతిమాలుకొంటిని. ప్రాణపణముగఁ బ్రయత్నించి యెన్నియో యొట్లు పెట్టుకొని యెంతయో ప్రార్థింపఁగా దుదకాతఁడు నావిన్నపమును మన్నించెను.

తెల్లవారినంతనే యాతఁడు పోవుటకు సిద్ధపడుచుండఁగా "పదిగంట

లకు హాయిగా భోజనముచేసి పొండు!" అని ప్రార్థించితిని. ఆతఁడు నామాట వినక "భోజనముకొఱ కింటియొద్ద గనుపెట్టుకొనియున్నచోఁ బను లెట్లు సాగును!" అని వీథిలోనికిఁ బోయెను. కాని యాతఁడు సరిగాఁ గర్మస్థానమునకుఁ బోలేదు. తాను నిత్యము నుండు నాచిన్న యింటికే పోయెను.

ఆనాఁడు తొమ్మిది గంటలకు మంగలికత్తె యచ్చటికి వచ్చెను. కానియప్పటి యామె మొగము వెలవెల పోవుచుండెను. ఆ మొగము చూచి నానాథుఁడు చాల దిగులుపడిపోయెను. మంగలికత్తె పిలువకుండ గనే లోపలఁ బ్రవేశించి నిర్దేశింపకుండఁగనే కుర్చీని దనచెంతకు లాగి కొని కూర్చుండెను. అప్పుడు నాభర్త "ఏమియవ్వా! మంచివార్త యేమియును లేదా?" అని ప్రశ్నించెను.

మంగ — లేదుబాబూ! ఉన్నచోఁ దెలుపుటకు నేనిన్నాళ్లును రాక యుండుదునా! అని తనముసలిముడుతల మొగమును బైటచెంగుతో మూసి కొనియెను. తరువాత నాయిరువురికిని సంభాషణ యారంభ మయ్యెను.

బాబు — దుర్వార్తయేనా అవ్వా!

మంగ — అంత వ్యతిరక్తమైనది కాదు. ఇప్పుడారమణీమణి తన మామగారియింటికిఁ బోయియున్నది. కాళీఘట్టమునుండి వెడలివచ్చిన నాఁటిరాత్రియే యామె యటకుఁ బోయినది. ఎంతయో వేడుకొనుటచే నేనుగూడ నామెవెంటఁ బోయితిని. నిన్నరాత్రియే పదిగంటల కింటికి వచ్చితిని. కాని యామెమాత్ర మచటనే యుండిపోయినది.

బాబు — ఆమెమామగారి యిల్లెక్కడ?

మంగ — ఫరాసుడేంగాలో.

బాబు — అచ్చట నామె యెన్నాళ్ళుండును?

మంగ — సరిగాఁ జెప్పలేను. కొన్నిమాసము లుండవచ్చును.

బాబు — వచ్చునప్పు డామె నీతో నేమైనఁ జెప్పినదా?

మంగ — చెప్పనేమి? నేను బయలుదేఱుచుండ నామె, నన్ను రహస్యముగఁ బిలిచి యేడ్చుచు "అవ్వా! ఇంతప్రయత్నమును వృథయై పోయినది. నన్నింత యాశ గొలుపు టెందుకు? అతని నాకంటఁ బెట్టు టెందుకు? ఇఁక నేనెట్లు చూడకుండఁ గలను? నీవే నాశత్రురాలవై పోయితివి! నీమూలముననే నాప్రాణములు చలించిపోవుచున్నవి. నేను పంజరమునుండి విడివడినపక్షివలె స్వేచ్ఛగా బ్రదుకుచున్నాను. అట్టినాకు నీవీ నూతనజ్వాలను రగులుకొలిపితివి. ఇఁక నుపాయ మేమి?" అని యెన్నియో విధముల విచారించినది.

బాబు మెల్లగాఁ బడకనుండి లేచి తెలియకుండగనే పరాకుగా, మెల్ల మెల్లగా మంగలికత్తె సమీపమునకు వచ్చి యాలించుచు నామెమాటల నారగించుచున్నట్లుండెను. ఆమాటలన్నియు నొక్కముద్దయైనచో నామంగలి పిశాచిబుఱ్ఱకాయతోఁ గూడ గుటుక్కున మ్రింగివేసి యుండును. ఆమెయు నాయుబలాటమును గ్రహించి కుర్చీని కొంచెము దగ్గఱగఁ జరపుకొని చెప్పవలసిన మాట లన్నియును జెప్పి ముగించెను.

హతాశుఁడగు నాతఁడు వ్యథితహృదయముతో నిట్టూర్పులు విడుచుచు దీనార్తస్వరముతో "తరువాత నేమిజరిగినది?" అని ప్రశ్నించెను.

మంగ — తరువాత నిక నేనేమిచేయఁగలను? ఆమెకుఁ గొంచెము ధైర్యము చెప్పి కఠినహృదయముతో మరలివచ్చితిని.

బాబు — అవ్వా! ఎంతసర్వనాశనమైపోయినది! నాపనులన్నియును జెడిపోయినవి. నిద్రాహారములు లేకుండఁ బోయినవి. ఇట్లు తటస్థించునని యెఱిఁగియుండియు నీ సమ్మేళన మేల చేసితివి! ఇఁక నుపాయాంతర మేమి యును లేదా?

మంగ — ఒక్క యుపాయము మాత్రమున్నది.

బాబు — చెప్పుము! నాకోరిక తీర్పఁగలవేని నాప్రాణములు నీచేతఁ బెట్టుమనినను బెట్టెదను. ఆమెను బడయకున్నచో నేనిఁక బ్రదుకజాలను.

మంగ — చూడుబాబూ! మీయిరువురికిని గల మనస్సంబంధము నామెపినతల్లి గ్రహించినది. జాలిపడి యామె తోడుపడకున్నచో నా నాఁడు కాళీఘట్టమున మీయిరువురికిని బరస్పరసందర్శనము లభించి యుండదు. నేనీయుదయముననే పోయి యామె కెల్లసంగతులును దెలిపి వచ్చితిని. నీపనిలో నేనొకనిమిషమైన నేమరియుండుట లేదని యెఱుంగుము! నాయింట బియ్యములేవు. కూరలులేవు. బజారుచేసుకొనుటకు పైసలేదు. అయినను నీపనిలోనే పడి కొట్టుకొనుచున్నాను. ఆమెయే నాకొకయుపాయము సూచించినది. విని నీవేమిచేసినను జేయవచ్చును.

బాబు — ఆమె యేమని చెప్పినది?

మంగ — మంచి యుపాయమే. ఆమె చాలబుద్ధిమంతురాలు! ఆమె నాతో "ఇరువురును స్వేచ్ఛగా నీయింటియందుఁ గలిసికొనుట యసంభవము; అదికాక యిప్పుడామె యిచ్చటలేదు. ఉన్నను బ్రక్కనున్న యిండ్లన్నియు బెద్దమనుష్యులు గలవి; ఆమె గౌరవకుటుంబములోఁ బుట్టినది; అన్నలు, తమ్ములు, అక్కలు, చెల్లెండ్రు, పిన్నలు, పెద్దలు, దాసదాసీజనులు — పదిమందిగల యాఁడుబిడ్డ; తనపరివారమునంతను గన్నుగప్పి చరించుట కామె కవకాశము లేదు — నేను చాలదినముల నుండి కాశికిఁ బోవలె నని యనుకొనుచున్నాను. ఆ బిడ్డను నేను పెంచితిని. అయినసేమి భాగ్యహీనురాలు! ఆమెనుగూడ నావెంటఁ దీసికొని పోయెద నని చెప్పియుంటిని. రెండుమూఁడు దినములలో నాప్రయాణము సాగినచో నామెనుగూడ నాతోఁ దీసికొనిపోవుదును. ఆబాబునకు డబ్బు లోపము లేదు. రెండువేల కంటె నీప్రయాణమున కెక్కువకర్చుగాదు. ఆయన యట్లు చేయఁ గలిగినచో నాబిడ్డను వెంటఁబెట్టుకొని నీవు నేనును ఆయనయును గలసి కొన్నాళ్ళు తీర్థయాత్రలు గావించుచు స్వేచ్ఛగఁ గాలక్షేపము చేయవచ్చును. కాశి, బృందావనము, ప్రయాగ, హరిద్వారము మొదలగు క్షేత్రముల దర్శించి రెండుమూఁడు మాసములలోఁ

దిరిగి రావచ్చును. మీబాబిందుకిష్టపడినచోఁ జెప్పుము. ఈరహస్యము మనముగ్గిరిలోనే యుండవలెను" అని చెప్పినది!

బాబు కొంతసేపాలోచించి "చాలనుత్తమమైన యుపాయము! నేను సిద్ధపడుటకుఁ బ్రయత్నింతును. నీవును జాగ్రత్తపడుము! ఎప్పుడు బయలు దేఱవలయునో నాకుఁ గొంచెము ముందుగాఁ దెలుపు" మనియెను.

మంగ — బాబూ! నీపనితోనే కాలము గడచుచుండుటచే నావృత్తి యేమియును సాగుటలేదు. నన్ను పోషించుభారము నీవు వహింపవలె నని సిగ్గువిడిచి కోరుచున్నాను. ప్రస్తుతము బజారు చేసికొనుటకు డబ్బు కావలయును. బయలుదేఱవలసియే యున్నచో నేవో బట్టలని, పెట్టె లని కావలసినవస్తువులు కొనుక్కొనవలెగదా. ఆమెకుఁగూడఁ గొంత ధనము కావలసియుండును. అదియును నీవే భరింపవలయును.

బాబు — ఇప్పుడే బయలుదేఱి పోవుట లేదుగదా! రేపో యెల్లుండియో ప్రయాణము చేయవలసియుండును. ఏవేవి కొనవలెనో, నీకెంత కావలెనో, యామెకెంత కావలెనో కొంచెము ముందుగా నాకుఁ దెలిపి నచోఁ గావలసినసొమ్ము నిచ్చెదను. నీకు గావలసినవి నేసేయకున్నచో బాపము నీవు నాపనియెట్లు నిర్వహింపఁగలవు?

మంగ — నే నాసంగతు లన్నియును దెలిసికొనియే వచ్చితిని బాబు! ఎంతో యీయనక్కఱలేదు. ఆమె కర్చుల కొక యేబదిరూపాయలు చాలును. ఇఁక నాకా? పదునేనురూపాయలతో సరిపెట్టుకొందును. ప్రస్తుతము బజారుచేసికొనుటకుఁ గొంతడబ్బు కావలెను.

ఆవెంటనే బాబు పెట్టెను దెఱచి యైదురూపాయలనుదీసి మంగలి దానిచేతఁబెట్టి "ఇవి నీయింటికర్చునకు - సాయంకాలము మరల వచ్చి నచో నప్పు డామెకీయవలసిన యేబదియును, నీ కీయవలసిన పదునేను గూడ నిచ్చెదను. ప్రయాణ మెప్పుడో యామె నడిగి తెలిసికొన్నిరమ్ము. నేనును బ్రయత్నమునం దుండెదను" అని చెప్పి యామెను బంపివైచెను.

# ౨౨. భోజనము

నాఁటిరాత్రి పదిగంటల కాతఁ డింటికివచ్చెను. పరిమితముగా మద్య పానము చేయుటచే నాతనికన్ను లించుక వికసించి యుండెను. ఆతఁడు స్వభావముగనే యగపడుచుండెను. ఆతనిరాక నిరీక్షించుచు నేనొక మేజాపైఁ బడకయందు బిడ్డను బరుండఁబెట్టుకొని హరివంశమునందలి కృష్ణావతారఘట్టమును జదువుకొనుచుంటిని. ఏపాపము నెఱుంగని నాబిడ్డ శయ్యయందు హాయిగ నిదురించుచుండెను. నాభర్త లోనికి వచ్చినంతనే దుస్తులను దీసివైచి యథాస్థానమునందున్న జలముతోఁ గాలుసేతులు గడిగికొని నాయొద్దకు వచ్చి కూర్చుండి "నీకింకను నిద్ర రాలేదా? ఇంటివారందఱును దలుపులు మూసికొని నిద్రించుచున్నారే!" అనియెను.

నేను — ఎప్పుడు నిట్లే నిద్రించుచుందురు. మీరువచ్చుట యాలస్య మగునని వారు భోజనములు చేసి తమతమ శయ్యలయందు శయనించు చుందురు. నేను మాత్రము మీభోజనమును గంచములో వడ్డించి మీకొఱకు రాత్రి రెండు జాముల వఱకును వేచియుందును. అప్పటికిని మీరు రాకపోయినచో నాఁకలియైనచో రెండుమెదుకులు నోటవైచి కొనియు, లేకున్నచో నూరకయుఁ బరుండి యేదోవిధముగా నిద్రించు చుందును. మీభోజన పదార్థము లెక్కడి వక్కడనే పడియుండును. మీరు రానిరాత్రి నేనెంత కష్టముతో వేగింతునో నాప్రాణేశ్వరులు, నాయిష్టదైవతములు, నాపరమ గురువులు నగు మీకేమని తెలుపుదును? మీసంసారమును సక్రమముగ నిర్వర్తించుకొనుచు, మీయాత్మీయులను త్రికరణశుద్ధిగా సేవించుచు, మీసంతానము నతిశ్రద్ధతోఁ బాలించుచు నీనిర్భాగ్యురా లెట్లు జీవితమును గడుపుచున్నదో మీరు కన్నులతోఁ జూచుటయైన లేదేమి? మీరు సంతుష్టి నందినచో నాదేవత లందఱును

తృప్తులగుదురు. మీతృప్తియే ముజ్జగములకును తృప్తి. ఇట్టిభావముతో నారాధించుటయే నేను మీవిషయమునందుఁ గావించు గౌణపూజ! మీ పాదములను గడిగి, మీకభిషేకము గావించి మీచే భోజనాదికమును గావింపఁజేయుటయే నాకు ముఖ్యపూజ! అట్టియారాధన మీనిర్భాగ్యురాలికి నిత్యములభింపకుండ మీరేలవంచించుచున్నారు! ప్రతిదినము నింటికి రాకుండుటకుఁ గారణ మేమి? నీవు నాప్రభుఁడవు! నాస్వామివి! మీ సేవకురాలనగు నాకు నాయధికారమును లేకుండఁజేయఁ గారణమేమి?

స్వామి — (గంభీరస్వరముతో) నీవింతగొడవ పెంచుట బాగుగలేదు. ఏదో కంపెనీలో గుమాస్తాగా పనిచేయువాఁడు కలము క్రిందఁబెట్టి కార్యస్థానము విడివడినంతనే యిఁక నాబాధ్యత వదలుకొని యింటికి వచ్చి హాయిగా నిల్లాలితో నిష్టాలాపముల నాడుచు సుఖింపఁగలిగి యుండును. కాని స్వకీయమగు వ్యాపారభారమును వహించి యుండువాని కది యెట్లుసాగును. నేను చెప్పినమాట విని నాకిప్పు డేమైన [illegible]

నేను తక్షణమే భోజనపాత్ర నాతనిచెంత నిడితిని. ఆతఁడు భుజించుచుండఁగా "మీ రేదో మాట చెప్పెద నంటిరే! చెప్పాడు!" అని ప్రశ్నించితిని.

స్వామి — నేను కొన్నాళ్లవఱకును బశ్చిమదేశమునకుఁ బోయి యుండెదను. నాశరీరము క్రమక్రమముగా శుష్కించిపోవుచున్నది. జీవశక్తి యంతకంతకు క్షీణించిపోవుచున్నది.

నేను — మంచిది. ఆరోగ్యముకొఱ కేమైనను జేయవలసినదే! మీతోఁగూడ నేనును వచ్చెదను.

స్వామి — నీవెందుకు?

నేను — భర్తతో భార్య నిరంతరమును ఛాయవలె ననుసరించి యుండవలయును. నన్ను మరపించి మీరొక్కరును బోయి తీర్థయాత్రలన్ సేవించి వచ్చెదరా! నేనుమాత్ర మేల రాఁగూడదు! తప్పక

నేనును వచ్చెదను.

స్వామి — వలదు! నేను నిన్నుఁ దీసికొని పోఁజాలను. నీవుకూడ నున్నచో నాకు స్తిమితముగా నుండదు. స్తిమితము లేనప్పు డారోగ్య మెట్లు గలుగును.

నేను — నేనున్నంతమాత్రాన మీకంత యశాంతి కలుగుటకుఁ గారణ మేమి? నిజము చెప్పుడు. నన్నుఁ జూచుట మీకసహ్యాముగా నుండునా?

స్వామి — అసహ్యామో, సహ్యామో యామాట వేఱు. ఆఁడు వాండ్రను వెంటఁబెట్టుకొని విదేశములకుఁ బోవుట నాకిష్టములేదు. ఊరక లేనిపోని ప్రసంగములు చేయవలదు. ఎన్ని చెప్పినను నిన్నుమాత్రము వెంటఁబెట్టుకొని పోవుట తటస్థింపదని నిశ్చయముగా నమ్ముము.

అభిమానముచే నాహృదయము సంక్షుభిత మైపోయెను. హృదయాంతరాళ మంతయు దుఃఖమేఘాచ్ఛన్న మైపోయెను. నేనిఁక నేమియు మాటాడఁ జాలకపోయితిని. ఆదిన మచ్చటనే యామాటలంగూర్చిన సమస్తాలోచనములును పరిసమాప్తము లైపోయెను.

నాఁటికి మూఁడవదినమున రెండుజాముల వేళకు నాస్వామి యింటికి వచ్చెను. సాధారణముగా నట్టివేళయందు దాతఁ డింటికి వచ్చుట లేదు. ఏదియో ముఖ్య కార్యముండుటచే వచ్చియుండు నని భావించి నేను నివ్వెఱపడుచు "ఏదియుఁ గానివేళ నిప్పుడు వచ్చితి రేమి?" అని ప్రశ్నించితిని.

స్వామి — నేఁడే ప్రయాణము. అందుకుఁ గావలసిన పరికరములను సరుదుకొనుటకై వచ్చితిని.

నేను — ప్రయాణ మెన్నిగంటలకు?

స్వామి — సాయంకాలమందే!

నేను — మరల నెప్పుడు వచ్చెదరు?

స్వామి — ఏమో! ఇప్పుడు సరిగా జెప్పజాలను.

నేను — ఇచ్చటి వ్యాపారమంతయు నేవిధముగా జరగును. పంటలు వచ్చు కాలము! కావలసిన సరకులను గొని నిలువలు చేసికొనవలయును గదా! సంవత్సర వ్యాపారమున కంతకు నీసమయమే యాధారమై యున్నది. మీరిప్పుడు మాత్రోనను మీరు పోయినచో నిక వ్యాపార మెట్లుజరగును?

స్వామి — తగిన యేర్పాటు చేయకున్నచోఁ బనులు జరుగవనియు, నందువలన వ్యాపారమున కించుక నష్టము గలుగుననియు ననుకొనుట వలన నుపయోగము లేదు. దినదినమునకు శరీరారోగ్యము చెడిపోవు చుండఁగా నారోగ్యము కొఱకుఁ బ్రయత్నించుటకంటె వ్యాపార మంతముఖ్యమైనదిగాదు. ధనమైనను, వైభవమైనను భార్యాపుత్రు లైనను వ్యవసాయ వాణిజ్యము లైనను బ్రదుకునకుఁ దరువాతివిగదా!

నేను — మీకిప్పుడు సంభవించిన ముఖ్యమైనజబ్బేమి?

స్వామి — దానినిగూర్చి యిట్టిదని చెప్పఁజాలను. కాని నాశరీరమం దేదియో రోగముండుట మాత్రము నిశ్చయము. కొన్నాళ్ళు పశ్చిమ దేశమునకుఁ బోయి యుండనిచో నారోగము నన్నుఁ జంపుననుట కూడ నిశ్చయమే.

నేను — మీయేమాటయందును నాకు నమ్మకము కలుగుట లేదు. మీరు ముఖ్యవిషయములను రహస్యముగ నుంచుకొని నన్నుమరపించు టకై యసత్యము చెప్పుచుంటి రని నాయూహ. మీరెప్పుడు దేశాంత రము పోమెదననియు, నన్నుఁ దీసికొనిపోవుట జరుగదనియుఁ జెప్పితిరో యప్పుడే — నిజము చెప్పుచున్నాను. అప్పుడే నామనసులో "నా యాశ్రయమందారము నన్నుఁ ద్యజించి బోవుచున్నది! నాప్రాణప్రదీపము నాజ్ఞాననేత్రములకు దూరమై యేగుచున్నది!" అని సంశయము కలిగి నది! స్వామీ నాసంశయమును దీర్పుఁడు! ఈ నాయూహ నిజమా, భ్రాంతియా? నేనూరక యనుమానపడుచు మీయెడల ననేకాపరాధము

లను గావించుచుంటినేమో! మీరు నా పరమగురువులు! కాని మీ యీగురువచనములందుఁ బరమేశ్వరాదేశము లను విశ్వాసము నాకుఁ గలుగుట లేదేమి?

స్వామి — అది నేనెట్లు చెప్పఁగలను? నీసత్యాసత్యములు నీకుఁ దెలియవలయును. నావి నాకుఁ దెలియవలయును. నేనిప్పుడు నాయిష్టము ననుసరించి పోవుచుంటిని. మరల నిష్టము గలిగినచో నప్పుడు తిరిగి వచ్చెదను. ఈవిషయమున నీకు సందేహమే కలుగుచుండెనో, మఱియేమగుచుండెనో నాకుఁ దెలియదు. మేము వర్తకులము! మాకు సత్యాసత్యవిషయమున నంతపట్టుదల లేదు.

అనిచెప్పి యాతఁడు తనపని చూచుకొనఁ బోయెను. నేనా యింటనే కొయ్యవలె నిలువఁబడి చింతింప నారంభించితిని. మొట్టమొదట నాకిట్లు తోఁచెను. "నీవేల విచారించెదవు? ఆతఁడు మగవాఁడు! తన వ్యాపారమును కట్టుదిట్టముగఁ జేసికొని శరీరారోగ్యముకొఱకు విదేశమునకుఁ బోవుచుండెను. కొంచెము నెమ్మదిపడినచో మరల వచ్చును. ఇందుకొఱకు నీమనసు పాడుచేసికొను టెందుకు?" అని — కాని యాతని చరిత్రము దోషయుక్త మగుటచేతనే నాకిన్ని సంశయములు కలుగుచుండెను. ఏపాపాత్మురాలో, ఏపిశాచియో యాతనిఁ దనవలలో వైచుకొని దేశాంతరమున కీడ్చుకొనిపోవుచుండెనేమో యని నాయనుమానము! ఆసంశయము నెట్లయిన మనసునుండి దూరము చేయవలయునని ప్రాణపణముగఁ బ్రయత్నించి యీవిధముగా మన స్సమాధానము చేసికొంటిని — "కలకత్తానగరమునందలి వారసుందరులు తమకుఁ గావలసిన పనులన్నియు నిర్బాధకముగాఁ దమవిలాసభవనములనుండియె తీర్చుకొనుట కవకాశ ముండఁగా నే పడుపుపడఁతికైన నీతని విదేశమునకుఁ గొనిపోవలసిన పని యేల తటస్థించును?" అని —

కాని యీయాలోచన మొదటియూహకడ నిలువఁ జాలకపోయెను.

మొదటియూహ దీని నెదిరించి యుచ్చస్వరముతో "వారకాంతల స్వభావములును, విలాసములును, నటనములును, వంచనలును గులకాంత వగు నీవెట్లు గ్రహింపఁగలుగుదువు?" అని యదలించెను. రెండవ యూహ క్షీణస్వరముతో "ఆమాట నిజమే — కాని నాస్వామి యింటనేయుండి వ్యాపారమును జూచుకొనుచుఁ దనయిష్టమువచ్చినరీతిని సంచరించుట కెవ్వరియడ్డమును లేదుగదా! ఇట్టిచో నిచ్చటనే యుండక విదేశములకుఁ బోయి కష్టపడవలసిన పనియేమి వచ్చినది?" అని యెదిరించుటయు మొదటియూహ యవసన్నహీనస్వరముతో "నీభర్త సంపూర్ణముగ నధోగతుఁడగుట కిచ్చట నవకాశములేదు. ఆయభావమును ఆయసంపూర్తిని సంపూర్ణముగఁ జేయుటకే యేపాపాత్మురాలో యాతని దనపాపబాహుబంధమున నిరికించుకొని దేశాంతరముల కీడ్చుకొనిపోవుచున్నది!" అని బదులుచెప్పెను.

ఆవెంటనే నాకన్నులనుండి యశ్రుధారలు ప్రవహింపఁ దొడంగెను. "నిశ్చయముగా నాస్వామి యధఃపతితుడై పోవుచున్నాఁడు! నిజముగా నాతని నేపాపాత్మురాలో వంచించి తనవెంట నీడ్చుకొనిపోవుచున్నది!" అని నాకుఁ నమ్మకము గలిగెను.

ఇంతలో నామగఁడింటిసేవకుని బిలిచి యొక ట్రంకుపెట్టను దీయించి దానినిండఁ దనకుఁ గావలసినదుస్తులు మొదలగు పరికరములను జేర్పించి తాళము వైచుకొని బండిని దీసికొని వచ్చుటకై వానిని బంపించెను. తరువాత నాతఁడు తనప్రయాణముంగూర్చి తల్లికి నివేదించెను. ఆమె యదరిపడి పోవలదని యెన్నియోవిధముల వారించెను. కాని యాతఁ డెవ్వరిమాటలను వినిపించుకొనలేదు. ఆసమయమునకు సరిగా బండివచ్చి ద్వారముచెంత నాఁగెను. ఆతఁడు సేవకునిచే ట్రంకుపెట్టను బండిలో వేయించుకొని తాను బండినెక్కి "తోలుము!" అనియెను. బండి కదలి పోయెను.

ఆతఁడప్పుడు శౌబజారునందున్న మాయంగడి యొద్దకుఁబోయి యచ్చటనుండి రాత్రియెప్పుడో హౌరాస్టేషను చేరి యటనుండి పశ్చిమమునకుఁబోవు నే రైలు మీఁదనో ప్రయాణము చేయు నని మేమందఱము ననుకొంటిమి.

అప్పుడు నేను నామనసులో "ఆతఁ డెప్పుడు వచ్చునో యెవ్వరితోఁ గలసి వచ్చునో యేబండిపైఁ బోవునో రహస్యముగా నుండి చూచి రమ్మని పరిచారకుని హౌరాస్టేషనునకుఁ బంపవలయు" నని యను కొంటిని. కాని నాయాలోచన యంతయు వ్యర్థమైపోయెను. ఆతఁ డిచ్చటనుండి తిన్నగా వాసగృహమునకుఁ గాని, దుకాణమునకుఁ గాని పోలేదనియు, ఆకెంటితాళములను గూడఁ బ్రొద్దుననే కర్మచారులచేతి కిచ్చివైచెననియు భోజనము చేయకుండ నామధ్యాహ్నపు బండిమీఁదనే యాతఁడు ప్రయాణమై పోయెననియు సాయంకాలమే నాకుఁ గబురు తెలిసెను. అది విని యందఱు నాతఁ డేమాయలాడి వెంటనో తప్పక పోయి యుండునని నిశ్చయించుకొనిరి.

నాగుండె గుభిల్లు మనిపోయెను. అప్పటినాహృదయవేదనను స్పష్ట ముగాఁ దెలుపుట కేభాష నుపయోగింపవలయునో నాకుబోధపడుటలేదు. దేనితోఁ బోల్చి చెప్పుటకును నాకేదియు స్ఫురించుట లేదు. కాని యింతవఱకు మాత్రము చెప్పెదను. మేజాపైఁ బడి పొరలుచు నప్పుడు కన్నులు వాచునట్లు చాలసేపేడ్చితిని. నాలుగైదుసారులాయనను నిశ్శబ్దదుఃఖ స్వరముతోఁ బిలిచి నిరాశాహృదయాంతరాళమును బ్రతి ధ్వనితముగా జేసివైచితిని. అప్పుడు నాకెంతమాత్రమును స్మృతి లేకుండఁబోయెను. ఒకటి రెండుసారులు మాయత్తగారు నాగదిలోనికి వచ్చి నాతలపై జలసేచనము గావించి పోయెనఁట!

ఒకవారముదినములు గడచిపోయెను. కాని నాస్వామి యొద్దనుండి జాబు రాలేదు. ఏవార్తయును లేదు. మేమనుకొన్నమాట నిజమే యని

యప్పుడు మాకు నిశ్చయ మయ్యెను. నిజముగా నాతఁడొక వెలయాలిని వెంటఁబెట్టుకొనియే పోయెను. కాని కలకత్తాను విడిచి పోవుటకుఁగారణ మేమైయుండును? కలకత్తానగర వారాంగనల పాపభవనములం దెన్నియో యకార్యకరణము లగుచుండును. అతఁడాయిండ్లకుఁదరచుగ రాకపోకలు గావించుచుండుటచే నట నేదుష్కృత్యమును గావించిన వారో యొకరు తమనేరము నాతనిపై మోపయుండురు. అందుచే నాతఁడు పోలీసువారల కన్నుగప్పి తప్పించుకొనుటకై యీనగరమును త్యజించి యుండును. అని చాలమంది కనుమానముగా నుండెను.

ఆమాటలు మామామగారు విని మిగుల విచారించిరి. ఆయన చిరకాలమునుండి వర్తకవ్యాపారముచేయుచున్నను సత్య వర్తనుఁడై సాధుపురుష విఖ్యాతిని గాంచి యుండెను. ఈయనుమానమే సత్యమైనచో నాతఁడు తనప్రాణప్రియుఁడైనపుత్రుని నట్టియుపాయమునుండి యేయుపాయముచేఁ దప్పింపఁ గలఁడు! ఆదినమున మాయింట నెవ్వరును భోజనముచేయలేదు. పనిపాటులన్నియు నిలిచిపోయెను. ఒక్కసారిమాత్రము మామగారు కొట్టువద్దకుఁ బోయి యంతలోనే తిరిగి యింటికివచ్చి మాయత్తగారిం గాంచి "కుఱ్ఱవాఁ డీనడుమ నప్పుడప్పుడు కర్చుపెట్టిన సొమ్ము రెండువేల రూపాయలు! నిన్నటి దినమున మనకాతాదారులయొద్దనుండి వసూలు చేసిన సొమ్మెంతయో లెక్కలో వ్రాయించలేదు. అది యించుమించుగ మూడువేలవఱకు నుండును. ప్రస్తుతము వ్యాపారము సాగించుటకు దమ్మిడీయైనను నిలువ లేదు. ఇఁక గతియేమున్నది? ఈముసలితనముసం దేవైపు చూచినను, సర్వనాశనమే సంభవించునట్లు ద్యోతక మగు చున్నది." అని విచారింపఁ దొడంగెను.

అప్పుడు నామఱదిగారు తనతండ్రితో "ధైర్యము నవలంబించి భవిష్య త్కార్యమునకుఁ గడంగవలయును గాని యిట్లువిచారించుట పురుష ధర్మముగాదు. అన్నగారిపోఁబడి తెలిసికొని యాతని నెట్లయిన నింటికి

రప్పింపవలెను. అంతవఱకును వ్యాపారము నెట్లో సాగించుచుండ వలయును'' అని చెప్పెను. ముసలితనముచేతనే క్రుంగియున్న మామగారు పుత్ర వియోగ విచారముచేతను, సర్వస్వవినాశనముచేతను మిగుల నవ సన్నుఁడై "నాయనా! ఇప్పుడు పంటలన్నియు నింటికిఁ జేరుదినములు! చేత నొక దమ్మిడియైన లేనప్పుడు సరకులను గొని వ్యాపారము సాగించుట యెట్లు!'' అనియెను.

మఱఁదిగారు నా మొగముపంకఁ జూచెను. అప్పుడు నేను "వ్యాపార మెట్లును జరుగవలసినదే కాని దాని నాపఁగూడదు. ధనము కావలసియున్న నానగలను విక్రయించి యుపయోగించుకొనవచ్చును'' అనిచెప్పితిని.

ఆమాట విని నామామగారికన్ను లశ్రుపూరితములై పోయెను. అతఁడు నిట్టూర్పు విడిచి "హరిహరీ! నేను బ్రదికియుండఁగా నాకోడలి నగ లమ్ముకొని జీవింపవలసినగతి పట్టినదా?'' అని విచారింపఁ దొడంగెను.

నేను – అదేమి యట్లనెదరు? వస్తువు లమ్మి తినుట యేమి? వ్యాపార స్థులు సమయానుసారముగా భార్యలకును గోడండ్లకును నగలు చేయింతురు. అదియే వారికి మూలధనము! మరల నావశ్యకమైనప్పుడు వానిని దాకట్టుపెట్టియో, విక్రయించియో సొమ్ము తీసికొని వ్యాపారము చేసి కొనుచుందురు. లాభము వచ్చినప్పుడు మరల రెట్టింపు జవాహరీ చేయించు చుందురు. ఇట్టిస్థితిలో మీరీవిషయమున నంతగా సంశయించు టెందుకా!

గుంటలుపట్టిన కన్నులనుండియశ్రువులను గంపితకరములతోఁ దుడుచు కొనుచు మామగారు నిట్టూర్పువిడిచి రుద్ధకంఠమునుండి హీనస్వర ముతో "అమ్మా! నీవుపాయము చెప్పఁగా గ్రహింపఁదగినట్టి వయసేనా నాది? నేను తలపండువఱకును గలకత్తానగరమున వ్యాపారము చేసి మంచిపేరును స్వాస్థ్యమును సంపాదించితిని. నాహృదయరుధిరమును నీరుచేసికొని కష్టపడి నేను సంపాదించినధనము నానిర్భాగ్యుఁడు దుర్వ్య

యము. గావింపక యే యున్నచో వ్యాపారపుం బెట్టుబడి కింత చిక్కుపడు టెందుకు తటస్థించును? నీనగలను గుదువపెట్టుటకుంగాని నేను దుఃఖపడు టకుంగాని యేయావశ్యక మేముండును? అమ్మా ముప్పుగాలమున నాకీగతి పట్టినది. ఆతనిపై నేదియో యపరాధమును మోపి పోలీసు వారాతని బట్టిబంధించుటకుం బ్రయత్నించి యుందురు. ఇష్టమువచ్చినంతధనమును వారికి లంచమిచ్చి యాతఁడువారిచేతి వదల్చుకొని యెక్కడకో పారి పోయియుండును. ఇంక నేనో? ఈముసలితనమునందు చేతులుముడుచు కొని రాతిబొమ్మవలె నింటం గూర్చుండి కోడలియొడలినగలను విక్ర యించి వ్యాపారము నడుపుటకుం బ్రయత్నము చేయుచున్నాను. ఆతని కష్టమును నివారించుట కెట్టియుపాయమును జేయంజాలకున్నాను. అగతి కుండను వృద్ధుండను నేనెక్కడకుం బోంగలను? ఏమిచేయంగలను? ఏశక్తిచే నాతని వెదకి గనుంగొనం గలుగుదును? ఇచ్చట వ్యాపారస్థు లెందఱికో సమాధానము చెప్పవలసియున్నది. మంచిమాట లాడి వారియొద్దం గొంతసొమ్ము తీసికొనవలసి యున్నది. అట్లు చేయుటకుం దగిన తెలివి యున్నది గాని శక్తియేమియును లేదు.

అమ్మా! నాజీవితకాలమునందే కష్టపడి పెంచుకొన్ననా మందిరా రామ మీవిధముగా ఘోరదావానలదగ్ధమైపోవునని నేను స్వప్న మందైనభావించి యుండలేదు.

అప్పటి నామామగారి యవస్థయు, కంఠస్వరమును, సంభాషణభంగి యునుం గాంచి జాలిచే గోడలును, గవాటములును గూడం బగిలిపోవు చుండెను. అప్పుడింటివారందఱమును గొలుగొలున నేడువనారంభించితిమి. కాని మామగా రింకను నధైర్యపడిపోవుదు రని భయపడి నేను దుఃఖా వేగము నడంచుకొని "ఆయన యేదియో రాజకీయవిపత్తునం బడి పాఱి పోయియుందురనుట కేవలమును మనయనుమాన మాత్రమేగదా! సత్యము మనకుం దెలియలేదు. మనయూహామాత్ర మసత్యము గాం

గూడదా? ఆయన యింకను భోగినీవిలాసానుభవమునందుఁ దనివి తీరక యేపిశాచినో వెంటఁబెట్టుకొని దేశాంతరమునకుఁ బోయియుండ నేమో!'' అని సమాధానపఱచితిని.

మామగారించుకసే పాలోచించి "అట్లు జరగియుండదమ్మా! దుకాణమునందలి డబ్బంతయుఁ దీసికొని నగరము విడిచిపోవునంతటిమూఢుఁడు గాఁడువాఁడు? వాఁడు చిరకాలము నుండి మనసువచ్చినట్లు తిరుగుచునే యున్నాఁడు. కాని యెన్నఁడు నింటికి రాకుండఁ బోవుటలేదు. ఇంతకాల మీవిధముగా నెవ్వరియడ్డము లేకుండ సంచరించుచున్నవాఁ డాకస్మికముగా నిల్లువిడిచి, యాత్మీయులను విడిచి, వ్యాపారమును విడిచి దేశాంతరమున కేలపోవును? అది కాదమ్మా! తన యొద్దనున్నంతవఱకు సొమ్ము పోలీసువారికిచ్చి వారిబారిని దప్పించుకొనుట కిఁక నవకాశము లేకయే వాఁడు బంధుమిత్రులను సర్వమును బరిత్యజించి పాఱిపోయి నాఁడు!'' అనియెను.

సహకారచ్యుతమగు మాధవీలత బహుజనపదదళితమై ఛిన్నభిన్నమై మథితమై చూర్ణమై శుష్కించిపోవునట్లే యామాట విన్నంతమాత్రాన నాశరీరమునందలి ప్రత్యవయవమును నస్తవ్యస్తమైపోయెను. అప్పుడు నామనసునందు "నేనేల యాత్మహత్య చేసికొనఁ గూడదు? ఇఁక నేను సహింపఁ జాలను — కాని వృద్ధులగు నాయత్తమామలగతి యేమి? వా రాయనతల్లిదండ్రులుకదా! ఆత్మసుఖమునకై నేను ప్రాణత్యాగము చేసికొన్నచో, నత్తమామలసేవయెడల లోపముచేసినదాన నగుదును.'' అనుభావనలు కలుగుచుండెను. నేను కొంతసేపటివఱకును మౌనముద్ధురాలనై యుండి యనంతరము "మామగారూ! మీరు మాకాశ్రయతరుస్వరూపులు! ఇట్టిమీరు చలించిపోయినచో మిమ్మాశ్రయించియున్న మేమందఱము నెట్లునిబ్బరముగా నుండఁగలము? ఈ విపత్సమయమున మీరు ధైర్యమువహింపవలయును. ఈనాయలంకారములన్నియు మీరు

లములై వికసితకుసుమములతో దిగ్దిగంతముల కామోదముం గూర్చు చున్నప్పుడు "ఆహా! ఇవి యెంతటిసుఖస్పర్శము ననుభవించి యానం దించుచున్నవి! ఇట్టిసుఖము వైకుంఠమునందుగాని, గోలోకమునందుగాని యుండునా" యని నామనసునకుఁ దోఁచుచుండును. ఆ యభావస్మృతి యందు "స్వామీ! ఇఁక నీవు రావా? ఎక్కడకుఁ బోయితివి? ఏమి యప చారము చేసితి? మమ్ముందఱిని విడనాడితివి? ఈదాసి గావించు నీసేవలయం దేమిలోపము కలిగినది? రమణీజీవితమునకు సారమును, సతీలోకమునకు నిత్యభోగ్యమును, నిత్యవ్రతమును నగు పతిదేవతారాధన భాగ్యము నాకేల లేకుండఁజేసితివి? ప్రభూ! నాప్రాణమానధనంబులు నీయధీనము గావించి నీరాకకుఁ బ్రతీక్షించుచు దుఃఖపడుచున్నాను. నీవీవిషయమును గ్రహించుటయే లేదేమి? రమ్ము ప్రభూ! నాప్రత్యక్షుఁడై యికచూ రమ్ము!" అని తలపోసికొనుచుంటిని.

కాని యెవ్వరును రాలేదు. ఎవ్వరును నన్నుఁ బలుకరించుట లేదు. నాభర్తవృత్తాంతమును దెలిసికొనుటకై నియోగించిపంపిన మనుష్యుఁడు కాశి, గయ, ప్రయాగ, బృందావనము మొదలగు పుణ్యక్షేత్రములకుఁ దిరిగితిరిగి వెదకి యెందు నాతనిజాడ తెలియఁజాలక తిరిగి కలకత్తాకు వచ్చెను. ఆతని నింకను వెదకఁబంపినచో నామనుష్యునకు నాలుగైదు మాసముల జీతమును, కర్చులు నిచ్చి పంపవలసియుండును. అంతేకాక నానాథునివార్త తెలిసికొనివచ్చినందుకు బహుమానముకూడ నీయవల యును. అయినను నేటిమధ్యాహ్నమాతఁ డొకపెద్దయుత్తరమును వ్రాసిపంపెను. అది గౌహాతినుండి వచ్చినది. ఆయుత్తరము గూర్చి నామఱఁది నాతోఁ జెప్పెను. "అంతయు నీశ్వరానుగ్రహము!" అని నే నూరకుంటిని.

నామఱఁది నామొగమువంకఁ గొంతసేపువీక్షించి నాస్థితిగతులను బరీక్షించి విస్మితుఁడై "ఏమి వదినే! నీవీమాటవిని యాత్రములో నన్ను

తొందరపెట్టి యెంతోయాశతో నెంతోదీనముగా నాతని నెట్లయినఁ దీసికొనిరావలయునని ప్రార్థించి బతిమాలి పంపింతువని యనుకొంటిని. కాని నీవక్లేమియుఁ జేయుక యిట్లూరకుంటి వేమి!'' అనెను.

నేను — (శుష్కహాసముతో) దాదా! ఇవి యట్టిదినములుగావు! అనేకదుఃఖములను, కష్టములను ననుభవించి యావిషవిషమానుభవము వలన, మానవమాత్రులెన్ని ప్రయత్నములు గావించినను నేమియు లాభము గలుగదనియు నెవ్వరికైనను శ్రీగోవిందకృపాకటాక్షముకంటె గత్యంతరము లేదనియుఁ దెలిసి తెచ్చుకొనఁ గలిగితిని. అధమురాలను, నల్పురాలను నగు నేనెంత? అట్టినే నెంతకొట్టుకొని యెంతగా నేడ్చిన నేమి లాభము! — సరే. ఆసంగతి యటుంచుము! ఇప్పుడు నీయన్న గారిం గూర్చి వచ్చినసమాచారమేమో తెలుపుము!

తత్క్షణమే యాతఁడు లోనికిఁ బోయి దీపమును వెలిఁగించి తెచ్చి మేజాపై నుంచి తనజేబులోనియుత్తరమును బైకిఁదీసి దీపమునొద్దఁ గూర్చుండి యీక్రిందివిధముగాఁ జదువనారంభించెను.

"ప్రస్తుతము నేను మీవేతనము గైకొను కర్మచారినిగాకపోయినను నిదివఱకుఁ గొంతప్రయత్నించి విఫలుఁడనైన కారణముచే నెట్లయినఁ గార్యసాధనము గావింపవలయునని పట్టుదలవహించియుంటిని. ఈనడుమ నొకనాఁడు నేను మీయన్న నివసించు నింటికెదుటనున్న రాజవీధి యందలి కాలిబాటనుబట్టి పోవుచుంటిని. అప్పుడాయింటి ప్రక్కగుమ్మమునుండి యొకపెద్దమనుష్యుఁడు బయలుదేరి నావెంటనే వచ్చుచుండెను. ఆయవ కాశము చూచుకొని నేనాతనిం గాంచి "అయ్యా! మీరీయింట నెన్నాళ్ళనుండి యున్నారు?'' అని ప్రశ్నించితిని.

పెద్ద — ఏమయ్యా! నాలుగైదేండ్లనుండి యున్నాను.

నేను — మీకు విసుఁగుగాఁ దోచినను నాకుపయోగము లగుటచే నేను మిమ్మొకటిరెండు మాట లడుగఁదలఁచితిని. అందుకొఱకు మీరు

నన్ను క్షమింతురని విశ్వసించుచున్నాను.

పెద్దమనుష్యుఁడు నావంకఁ జూచి వడఁకిపోయెను. అట్లు కంపించుచునే యాతఁడు కంపితస్వరముతో "మీరు పోలీసువారా?" అని ప్రశ్నించెను.

నేను — కాదు. మీరట్లుసంశయింపనక్కఱలేదు.

పెద్ద — అట్లయినచో మీరిప్పు డడుగఁదలఁచిన దేమో యడుగుఁడు!

నేను — మీరున్నయింటి కుత్తరమందున్నయింటిలో నివసించుచుండెడి బంగాళీబాబుతో మీకుఁ బరిచయ మున్నదా?

పెద్ద — ఉన్నది.

నేను — ఆతఁడు కొన్నిమాసములనుండి యగపడుటలేదు. ఆతఁడేదియైన నేరము చేసియున్నట్లీపట్టణమునఁ గాని మఱి యెచ్చటను గాని వినియుండలేదు. తీర్థయాత్రలకుఁ బోయె ననుకొండమన్న నచ్చటను వెదకితిమి. ఆతని జాడ లేదు. ఏయూఁడువాంఢ్ర యపరాధమో యాతనిపైఁ బడుటచే నాతఁ డూరువిడిచి పారిపోయియుండు నని యనుకొనుచున్నాము.

పెద్ద — (గంభీరస్వరముతో) మేమును మొట్టమొదట నట్లే యనుకొంటిమి. ఆయింటికిఁ జేరియున్న గృహమునం దొక సుందరియగు యువతి యున్నది. ఆమెను దీసికొని యాతఁడు పలాయితుఁ డయ్యెనని యనుమానపడితిమి. కాని యది సత్యము కాదు. ఆరమణీమణి మిగుల ధర్మాత్మురాలు ఒక్కనాడైన నిల్లువిడిచి యావల నడుగుపెట్టునది కాదు. ఆమెను గూర్చి యిరుగుపొరుగులవారి నందఱి నడిగి తెలిసికొంటిమి. ఆమె నడవడింగూర్చి వ్యతిరేకముగఁ జెప్పినవా రెవ్వరును లేరు.

నేను — ఆతఁ డెనిమిదిమాసములై పోయినాఁడు. వాని సమాచారమేమియు నింతవఱకుఁ దెలియుట లేదు. ఆతఁడు కొంచెము జారవృత్తి కలవాఁడే కాని ప్రస్తుతమాతని పలాయనమునకును జారత్వమునకును

సంబంధ మున్నట్లు తోఁచుట లేదు. అతని దుర్వర్తనములకు సాయ పడుచుండు మిత్రులందఱు నిచ్చటనే యున్నారు. అతనికిఁ బరిచితలై యున్న వారాంగనల యిండ్లకుఁ బోయి యన్వేషించితిని. ఎక్కడివార లక్కడనే యున్నారు గాని యెవ్వరును గ్రామము విడిచి పోలేదు. ఇట్టి స్థితిలో నాతఁడెందుకుఁ బోయెనో, యెచ్చటికిఁ బోయెనో తెలియరా కున్నది?

పెద్ద — అయ్యా! చూడుము! నీతో నొకమాట చెప్పు చున్నాను. దానిని బట్టి ప్రయత్నించినచో నీకాతనిజాడ తెలియవచ్చును.

నేను — చెప్పుఁడు బాబూ! ఏమాత్రమవకాశము దొఱకినను నేను సాధింపఁగలను!

పెద్ద — అప్పుడప్పు డొకమంగలికత్తె యీతని యింటికి వచ్చుచు నుండుట జూచితిని. అతఁ డీయూరువిడిచి పోయినప్పటినుండియు నది యగపడుటలేదు. అది యీయిరుగుపొరుగిండ్లలోని యువతుల కలంకార రచనలు గావించు చుండెడిది. ఈయెనిమిది మాసముల నుండియు దాని జాడ యగుపడుట లేదు.

ఈసూత్రము నాధారముగఁ జేసికొని కార్యసాధనము గావింపఁగల నని నాకు ధైర్యము తోఁచెను. "మీదయవలన నాకుఁ గొంతయాధా రము లభించినది" అనిచెప్పి నేనాతనికడ సెలవుగైకొని దక్షిణపువీథి ననుసరించి పోయితిని. ఆతఁడును దనత్రోవను బోయెను.

మరునాఁటి ప్రాతఃకాలముననే లేచి నేను మీయన్నగారి యా యింటికి వెనుక నున్న యింటిగుమ్మము కడకుఁ బోయి తలుపు తట్టితిని. కొంతసేపటి కొక తొమ్మిదేండ్ల చక్కని బాలిక వచ్చి తలుపు తెఱచి "మీరెవ్వరు?" అని ప్రశ్నించెను.

నేను — అమ్మా! నీవు నన్నెఱుఁగవు — నీపేరేమి?

బాలి — నాపేరు విరజ.

నేను — మీయింట నేనొక సంగతి తెలిసికొనవలె నని వచ్చితిని. పెద్ద లెవరైన నున్నారా?

ఆమాట విని బాలిక లోనికిఁ బోవుచుండఁగా ద్వారముప్రక్క నున్న గదియందుండి పురుషకంఠస్వరముతో "ఎవరుమీరు? ఈగదిలోనికి దయచేయుఁడు!" అనుమాట వినవచ్చెను.

నేనాయింటఁ బ్రవేశించితిని. అచ్చట నొక పటుపుపై నైదుమూళ్ళ వస్త్రమును గట్టుకొని కూర్చుండి యొకబాబు తేనీటిని ద్రాగుచుండెను. ఆతని ప్రక్కనే యున్న యింగ్లీషు దినపత్రికను జూచుచుండెను. ఆతఁడు నన్నుఁ జూచి "అయ్యా! మీరు వచ్చినపనియేమి? అనియడిగెను.

నేను — పనియేమియును లేదు. ఒకసంగతి తెలిసికొనవలె నని వచ్చితిని.

బాబు — అది యేమో తెలుపుఁడు!

నేను — ఎనిమిది మాసముల క్రిందట నొకమంగలికత్తె తరచుగా మీయింటికి వచ్చి పని చేసి పోవుచుండెడిది. ఆమె యిప్పుడు మీ యింటికి వచ్చు చున్నదా?

బాబు కొంచెము సేపాలోచించి యొకగ్రుక్కెఁడు తేనీటిని ద్రావి విరజవంకఁ జూచి "ఇంటిలోనికిఁ బోయి తెలిసికొనిరమ్మా!" అనియెను.

ఆబాలిక లోనికిఁ బోయి వెంటనే వచ్చి "లేదు! అది యీనడుమ మనయింటికి వచ్చుటలేదు!" అని చెప్పెను.

అప్పుడు నేను బాబుం గాంచి "అయ్యా! నాకొక సమాచారము తెలియవలసి యున్నది. తమరొక్కసారి లేచి యాడువారి యొద్దకుఁ బోయి నేను కోరినవిషయములను దెలిసికొనివచ్చి చెప్పినచో నన్నను గ్రహించినవా రగుదురు. దయచేసి శ్రమయని యెంచక నాప్రార్థనమును మన్నింపవలయును" అని వేడుకొంటిని.

బాబు — అయ్యా! మీరు కోరినట్లన్నియుఁ దెలికొనివచ్చి చెప్పి

వను. కాని నిజము చెప్పుచున్నాను. మీవంటి పోలీసుకర్మచారులకు సాహాయ్యముచేయఁ బోయి గొప్ప గృహస్థులనేకు లనేకసమయము లందు సపరివారముగా కడగండ్లఁ బడుటను జూచి యుంటిని. గొప్ప యింటి యాఁడువాండ్రుకూడఁ గోర్టులలో సాక్ష్యము లీయవలసి వచ్చు చుండెను.

నేను — బాబు! నేను పోలీసు వాఁడను గాను. ప్రస్తుతము బాగుగ జదువుకొన్న పోలీసు కర్మచారులుకూడ నంత తెలివి తక్కువగాఁ బని చేయరు. అట్లు చేసినచో వారి యనుసంధానమార్గములు బద్ధములై పోవా?

బాబు మారుమాట చెప్పక తేనీటిని బూర్తిగాఁద్రాగి లేచి "ఏమి తెలిసికొనిరావలెనో చెప్పుఁడు?" అని ప్రశ్నించెను.

నేను — ఆమె యెన్నాళ్ళనుండి వచ్చుట లేదో, దానినివాస మెచ్చటనో, యేయూరికిఁ బోయెద నని చెప్పియుండెనో యింకను దాని విషయమై విశేషము లేమి తెలిసినను తెలిసికొని రాఁగోరెదను.

బాబు లోపలికిఁ బోయి కొన్ని నిమిషములలోఁ దిరిగివచ్చి "ఆ మంగలికత్తెం గూర్చి విశేషవిషయము లేవియు, మాయాఁడువాండ్రకుఁ దెలియవఁట! శివపురమునందలి చౌదరీ మందిరమున కెదురుగా నామె యిల్లున్నదఁట" అని చెప్పెను.

నే నానాటిమధ్యాహ్నమే శివపురమునకుఁ బోయితిని. దాని యింటి నెట్లో వెదకి కనిపెట్టితిని. దానినిబట్టుకొని యెల్లసంగతుల నడిగితిని. కాని యది తనకేమియుఁ దెలియ దని బొంకెను. అప్పుడు నేను చౌదరీబాబు నొద్దకుఁ బోయి యెల్లవిషయముల నెఱింగించి "అయ్యా! నాకీ విషయమునఁ దమరు సాహాయ్యము చేయక తప్పదు." అని బతిమాలు కొంటిని. నేను పోలీసుకర్మచారిని గానని యాతఁడు విశ్వసించి యా మంగలికత్తెను బిలిపించి ధిక్కరించి యడుగుటయు నామె "అతఁ డొక

వేశ్యను, వేశ్యమాతను వెంటఁ దీసికొనిపోయి గౌహతీనగరమున నివసించు చుండెను; ఆ వెలయాలి పూర్వనివాసము కలకత్తాయందలి యుద్యాన ద్వయపార్శ్వమునం దున్నది!" అని యావీథిపేరును, నింటినంబరును గూడఁ దెలియఁజేసెను.

ఆసమాచారము తెలిసికొని యామాటలు నిజమో కావో తెలిసి కొనఁదలఁచి మరలఁ గలకత్తాకు వచ్చి వెదకితిని. పాపమది యసత్యము చెప్పలేదు. నిజముగా నాతఁ డాయింటి వేశ్యను దాని తల్లిని దీసికొని పోయినట్లు సమీపస్థులవలన వినియుంటిని. ఇఁక నీసంగతి మీకెవ్వరికిని దెలుపకుండఁగనే యారాత్రి బయలుదేఱి నేను గౌహతికిఁ బోయితిని.

నేనిచ్చటికి వచ్చి యొకటి రెండుదినములు శ్రమపడి వెదకితిని. తుదకు మీయన్నను దర్శించితిని. ఇప్పు డాతఁడు చేత దమ్మిడీయైన లేక యున్నాఁడు. చాల కష్టముతో దినములు గడుపుకొనుచున్నాఁడు. ఆతఁ డావేశ్యను గులాంగనయనియే భావించు కొనుచు నామెతో సంసారము చేయుచున్నాఁడు. నేనెల్లసంగతులను స్పష్టముగాఁ దెలిపితిని. కాని యాతఁడు నిశ్చయపడియు నామె కులకాంత యనియే నాతోఁ జాలసేపు వాదించెను. మంగలికత్తె చేసిన మాయయంతయు నాతనికిఁ దెలిపి యామె నిన్ను భ్రమపెట్టి కులకాంతయని యీవెలయాలిని నీకంటఁగట్టి నీయొద్ద డబ్బులాగినదని పూర్వోత్తర సందర్భము లన్నిఁటి నెఱింగించితిని. అప్పటికాతనికి విశ్వాసము గలిగెను. అంతటినుండి మీయన్న యాయింటికిఁ బోవుట లేదు. ఎక్కడకో నాయిష్టము వచ్చినచోటికిఁ బోయెద నని నాతోఁ జెప్పియున్నాఁడు. ఈయుత్తరము చూచి నంతనే కొంతసొమ్ము తీసికొని నీవు బయలుదేఱి రావలెను. ఇచ్చట నాతఁడు చేసినఋణములను దీర్చి యాతని వెంటఁ దీసికొని పోవచ్చును"

నేనాయుత్తరమునంతను వింటిని. నానాథుఁడు జీవించియుండెనని తెలిసి

కొంటిని. అయినను నాకప్పుడంతయానందము గలుగదేమి? భర్తను బోఁగొట్టుకొన్న భార్యకు - స్వామివియోగ విధురయగు సాధ్వికి నాథుఁడు చెంతకు రాగలఁడను వార్త యెంతయానందముగా నుండును? నాకప్పుడట్టి యానందలేశమైనను గలుగలేదేమి? హృదయమంతట నావరించియున్న దుఃఖానల ధూమపటలము మఱింతఘనీభూతమై పోయినది! ఈ వార్త విన్నమాత్రాన లోపలిదుఃఖజ్వాల యొక్కసారి తళుక్కున వెల్లి విరిసినది. అంతేకాని యంతలోనే పొగచూరిపోయినది. క్రమముగా నాకన్నీరు మున్నీరైపోయెను. అక్కటకటా! నేనింకను జావక యేల బ్రదికియుంటిని! నాభర్త వేశ్యాలంపటుఁడు! వెలయాలిని వెంటఁబెట్టుకొని పోయి దూరదేశమున నివసించియున్నాఁడు. నిత్యవేశ్యాసాహచర్యము వేశ్యాన్నభోజనము నాతనికి బ్రియదాయకములై యుండెను. జీవిత కాలమంతయు నాతనికి వేశ్యాసక్తిలోనే గడచిపోవుచుండెను. అట్టి మహాపాపప్రవర్తకుని యిల్లాలికి – అట్టి పతినయన కంటకమగు పిశాచికి నరకమునందైనను నిలుచుటకుఁ దావుండునా? ఎవ్వనితండ్రి వృద్ధుఁడయ్యు నింకను వడకుచేతులతో గృహకృత్యములను గావించుచుండెనో, ఎవ్వని తల్లియు నిల్లాలును పోష్యవర్గమునుగూడ నావృద్ధజనకుని లాలనపాలనములపై నాధారపడి యుండెనో యట్టి నాభర్త నాప్రత్యక్షదైవతము నగు నాతని కేనరకమునందు జోటున్నది. ఓనారాయణా! నీచేతిచక్ర మెవ్వరి కొఱకు? నావంటిపిశాచిపైఁ బ్రయోగించినచో నాసుదర్శనమున కవమానము సంఘటిల్లునా? – నాకన్నులనుండి దుఃఖాశ్రువులు వరదవారుట యేకాని యీ నాప్రశ్నల కెట్టి సదుత్తరమును బడయఁజాలకపోయితిని.

నామరది యాయుత్తరమును వినిపించి దానిని మరల జేబులో నుంచుకొని తనతల్లిచెంతకుఁ బోయెను. నేనచ్చటనే కూలఁబడి నాజీవిత మింకను నెంతగా మండి బూడిద కానున్నదో యనువిషయముం గూర్చి భావించుకొనుచుంటిని.

# ౨౮. పరిణతి

ఆమరునాడు బయలుదేఱి నామరది గౌహతిపోయి యతికష్టముతో నన్వేషించి నానాథు నింటికి దీసికొనివచ్చెను. ఆతఁడుపోయి వచ్చినసమాచారములన్నియు నేనాతనివలన విన్నవి విన్నట్లు మీకుమనవిచేయుదును.

“స్టేషనున కనతిదూరమునసే యతివిశాల మగు బ్రహ్మపుత్రానది ప్రవహించుచుండెను. ఆనదీగర్భమునం దస్తంగత రవిప్రతిబింబము రక్తకాంతులతో దరంగాందోళితమగుచుండెను. వాయుతాడితములగు నా తరంగములు గంభీరధ్వనులతో నెగసిపడుచు ప్రకృతినంతను భీకరముగ జేయుచుండెను. ఆవలియొడ్డు చేరి యాతనిజాడ నన్వేషింపకున్నచో నిక నాతని దర్శనము లభింపదని వినియుంటిని. కలకత్తానగరవాసులైనచో నాసమయమం దానదిని దాటుట కెంతయు భయపడెదరు. కాని నేను తూర్పుబంగాళపువాఁడనగుటచే నెంతమాత్రము జంకలేదు. మా దేశమునందు అనేకనదులు ప్రవహించుచుండును కావున నేను నిర్భయముగా నా దరికిఁ జేరితిని. కాని యెక్కడకుఁ బోయి యన్వేషింతును. నాకు వ్రాసినయాతఁడైనను నాతని విలాసముంగూర్చి తెలుపలేదు. ఎట్లో కష్టపడి తిరిగితిరిగి యా వేశ్యాసుందరి యింటిని జేరుకొంటిని. అన్నగారి యిల్లనక నీవుకూడ వేశ్యామందిర మనుచుంటి వేమని నీవునన్నడుగవలదు. నిజముగ నాయిల్లుదానిదే. ఆఘోర దుస్సహ దుఃఖ సమాచారమును విన్నచో నీవును మిగులదుఃఖింతువు. కాని నీవు నీ పేరిమీఁద నొట్టుపెట్టుకొని యెల్లవిషయములను స్పష్టముగా నొక్కముక్కయైనను దాపకుండఁ జెప్పవలయు నని నిర్బంధించితిని. అందుచే సమస్తవృత్తాంతమును సంపూర్ణముగ దెలుపుచుంటిని.

దాదా చేతఁ బట్టుకొని పోయిన సొమ్మంతయు నాశనమైపోయినది. ఆవేశ్యమాయలకు జిక్కికొలఁది దినములలోనే యాతఁ డాసొమ్మంతయు

సానిదాని చరణపీఠముచెంత సమర్పించివైచెను. అప్పు డామెకుక్కలాడి స్వస్వరూపమును బ్రదర్శించెను. కప్పుకొన్న మేషచర్మమును దొలగించు కొని యాకలిగొన్న పెద్దపులి నిజరూపమును బయటబెట్టునప్పుడు గోపాల కుఁడు గాంచి యెట్లు భయపడునో యామెం గాంచి యన్నగారు తన సర్వస్వమును నామెకుసమర్పించివైచెను. ఇప్పుడు వారి సత్యవృత్తాంతము గూడఁ దెలిసికొని నిర్విణ్ణుఁడై యామెపేరుచెప్పిన భయపడిపోవుచుండెను.

ఆయన మొట్టమొదటఁ దాను దీసికొనిపోయిన సొమ్మునంతను దన యొద్దనే యుంచుకొనెను. కొన్నాళ్ళ కావెలయాలు "నాయందు నీకు నమ్మకములేదా" యని పొలయలుక వహించి యాతనియొద్దనున్న ధనమంతయుఁ దనవశము గావించుకొనెను. ఆ తరువాతనే తారుపుకత్తె యగుమంగలిది మరల గలగత్తాకుఁ జేరుకొన్నది. అప్పటినుండి యాసాని మాయన్నతో నిత్యకలహమున కారంభించినది. దినవెచ్చమైన గడప లేని నీకీ తేరమాగతన మెందుకని యీసడించినది. "నేనెక్కడను చాకిరి చేసి యెఱుంగను- తెచ్చినసొమ్మంతయు నీకేయిచ్చితిని. ఏవ్యాపార మైనచేసి గడింతమన్నను పెట్టుబడికి డబ్బుకావలయును. నీకిచ్చిన సొమ్ములోఁ గొంతమూలధనమునకై యిమ్ము! అని యన్నగా రామెను వేడుకొనుచుండిరి.

కాని యాలంజె యొక్కపైసయైన నీయలేదు. తుదకునాయన్నగారు దానికృపాచరణములకు సేవకుఁడై బికారియైయన్నదాసుఁడై యదిచెప్పిన పనులను జేయుచు నీజాతినీచజీవితమును గడుపుకొనుచుండెను. అన్నిసం గతులును విమర్శించి నీకుఁ జెప్పుటకుఁ సిగ్గగుచున్నది. అతఁ డేవిధముగా మసలుచుండెనో, యెట్టియవస్థల ననుభవించుచుండెనో యావిషయముం గూర్చి పెద్దమనుష్యులయెదుట వెల్లడించుట యంతగౌరవమైనపనిగాదు. నీవు కులాంగనవు. మాతల్లివంటిదానవు! కావున నింతకంటె నీకు విస్త రించి మనవి చేయఁజాలను." అని చెప్పెను.

ఆతని యుద్దేశమును నేను చాలవఱకు గ్రహించితిని. ఇంకఁ జెప్పవల దని వారించితిని. ఎట్లయిననేమి కొందఱు పెద్దమనుష్యుల సాహాయ్యము వలన నామరది నాస్వామిని వేశ్యాపిశాచినీ నరకబాహుబంధమునుండి వదలించి ఇంటికిఁ దీసికొని రాగలిగెను. ఇంటికిఁజేరుకొన్న తరువాత నైనను నామగనికిఁ బూర్వప్రవర్తనము మారలేదు.

ఆతఁడు క్రమముగాఁ బ్రకృతిదేవి కఠోరదండనములచే శిక్షితుఁ డగుట కారంభ మయ్యెను. జ్వరము మొదలగుననేక నీచరోగము లాతని నాక్రమించి సంపూర్ణముగా నాలుగైదుమాసములవఱకు బహు విధముల బీడింపఁదొడంగెను. నేను నిత్యము నతిజాగరూకతతో నాతనికి శుశ్రూషలు గావించుచుంటిని. ఒకనాఁ డాతఁడు నన్నుఁగాంచి "నేను నీయెడల ననేకాపరాధములను గావించియుంటిని. కాని నీవు ప్రాణపణ ముగా నాసేవ చేయుచు నింతశ్రమపడుచుంటి వేమి ? నిద్రాహారములను విసర్జించి నాయుపచారములతోనే దినమంతయు గడుపుచున్న నీకు నేనెట్టి గారవమును జూపించితిని? నేను నీకెవ్వఁడను? నిజముచెప్పుము!" అనియెను.

నేను సత్యము చెప్పుచున్నాను. త్రికరణశుద్ధిగా నాతనికుపచారములు గావించుపట్టున నాకెట్టికష్టమునుదోఁచుటలేదు. సరిగదా - ఆయుపచారము లందే నాజీవశక్తి యంతయు నిరంతరమును వర్ధిల్లుచుండెను. కాని యాతని వృత్తాంతమంతయు నాలకించుటవలన నా కాతనియెడల ననసూయాభావము మాత్రము గలుగకుండఁ బోలేదు. "ఆస్వామిమూర్తి నా హృదయ ఫలకమం దంకితమగుట కేమికారణము? ఆతఁడు నాకెవ్వరు?" అని నా మనసునఁ దోఁచుచుండెను. - నేను కన్నులువాల్చి మొగమువంచుకొని "నాకర్తవ్యమును నేను చేసికొనుచున్నాను. ఇదియే నాపతిపూజ! దీనినే నేను నిర్వహించుకొనుచున్నాను." అని చెప్పితిని.

ఆతఁడు మరి నాలుగు మాసముల కారోగ్యవంతుఁడయ్యెను. ఇంక నాతఁడు పాపపథమును బరిత్యజించునని నేనెంతయో యాశపడితిని,

ఏకార్యమునకైనను గొంత యవధి యున్నదిగదా — ఈరీతిగా దిర స్కృతుఁడై యింతటియపకీర్తికిఁ బాత్రై యింతనీచముగఁ బ్రవర్తించి యప హృతసర్వస్వుఁడై యనేకకష్టముల ననుభవించి యాత్మీయులచే నవ మానితుఁడై యామయగ్రస్తుడై పోయిన యాతఁడు తిరల నట్టి దుష్కృ త్యములలోఁ బ్రవేశించునా? పడినపాటులన్నియు నాతని తలఁపునకు రాకుండఁబోవునా! — నే నీవిధముగా భావించితిని.

కాని యాతఁ డారోగ్యము కలిగినంతనే యెప్పటివలె సంచరించుట కారంభించెను. నాయాశయంతయు నడుగంటిపోయెను. ఇఁక జెప్పుట కేమున్నది? నామగనియత్యాచారములు, నపచారములు ననాచారము లును మునుపటికంటె నినుమడించిపోయెను. విదేశములకుఁ బోయి నేర్చుకొనివచ్చిన విద్యలన్నియు నిప్పుడు విజయగర్వముతో నుపయో గించుకొనుట కారంభించెను.

ఆతఁడుకొంత సేపుమాత్రము సొంతవ్యాపారమునుజూచుకొని యెప్పటి వలె జీకటిపడినంతనే యిల్లు విడిచి పోవుచుండెను. రాత్రియంతయు స్వేచ్ఛగ నుండి యే తెల్లవారుజాముననో యింటికివచ్చుచుండెను. ఒకప్పు డింటికి వచ్చుటయే లేదు. ఇంటివారందఱు నెవరికి దోచినట్లు వా రాతనికి బోధించుచుండిరి. నేనాతనిపాదములపై బడి యేడ్చుచుంటిని; ప్రార్థించుచుంటిని. బోధించుచుంటిని; వీనినన్నిటినిగూడ లెక్కచేయక యాతఁడు తనయిచ్ఛవచ్చినట్లు సంచరించుచుండెను.

ఇట్టి దుర్భరావస్థతో, నిట్టి దుఃఖవేదనలతో నాకింకొకయేడు గడచి పోయెను. ఆతఁ డింతనిర్లక్ష్యముగా మసలుచున్నను దైవానుగ్రహముచే మావ్యాపారము మంచియున్నతస్థితికి వచ్చెను. బియ్యపువర్తకములో మాకు లక్షరూపాయలలాభము వచ్చెను. క్రమముగా వర్తకము వృద్ధి యగుచుండెను.

ఆసమయమునందు నాకొక యాఁడుబిడ్డ కలిగెను. ప్రసవించినప్పటి

నుండియు నేను రోగగ్రస్తనై మంచముపట్టితిని. మంచముపై నొత్తి గిలుటకుగూడ నాకు శక్తి లేకయుండెను. నామగని దుర్వ్యాపారములు దినదినమును వర్ధిల్లుచుండుటచే విచారమువలన నాకు రాత్రులు నిద్ర పట్టుటలేదు నామంచముప్రక్కనే యొకకిటికీ యున్నది. అది యెప్పుడును గాలికొఱకుఁ దెరవఁబడియే యుండును.

రాత్రిగాఢాంధకారము నేను కిటికీదార్వమునుండి వెలుపలికిఁజూచుచు విచారించుచుంటిని. ఆకస్మికముగా నాకసమునం దొకమెఱపు మెఱసెను. మేఘము గర్జించెను. వాయువు పిచ్చియెత్తినట్లుగా చెలరేగెను. వానితోఁగూడ నతివేగమున వర్షము కురియుట కారంభించి కలకత్తా నగరవీధులనన్నిటిని ముంచివైచుచుండెను. ఈవిధముగా గొంతసేపటి వఱకు దైవదుర్యోగము ప్రచారిత మగుచుండెను.

ఆవర్ష ప్రవాహమునుగాంచియాకస్మికముగా నాహృదయమునం దొక దుర్విచారము గలిగెను. "ఆయన ఇప్పుడు బయటనుండరుగద! ఉన్న యెడలఁ దడిసిపోయి యెంతో కష్టపడుచుందురు" అని — అంతలోనే మరల "అట్లుజరుగదు వర్షము రాకముందే యాతఁడు తన వాసగృహము చేరుకొని నిద్రించుచుండును. అట్లు గాకున్నచో నాతని యిష్టము వచ్చినచోట నెక్కడనో సుఖముగా నుండి యుండును." అని సమాధానపడితిని.

కాని మొదటి యూహయే సత్యమయ్యెను. మఱికొన్ని నిమిషములకే యాతఁడు స్నానముచేసినట్లు తడిసి యిల్లుచేరుకొనెను. ఆతనిపాదములు పంకిలములై యుండెను. తడిసిన పాదరక్షలను జేతితో బట్టుకొనియెను. బట్టలన్నియును పూర్ణముగ దడిసిపోయెను అప్పు డాతనిం గాంచినంతనే నాకు దుఃఖము వచ్చెను. లేచి పొడిబట్టల నిచ్చుటకైనను నాకు శక్తి లేదు. అందుచే నాతఁడే వస్త్రపరివర్తనము గావించుకొని యేదియో యుపయుక్త కార్యము చేసి వచ్చినవానివలె నిస్సంశయముగా నా

చెంతకు వచ్చికూర్చుండెను. అప్పుడు చంటిబిడ్డలేచి యాకలిచే నేడువ నారంభించెను.

ఆబిడ్డయవస్థయు జాలిగొలుపు దాని యేడ్పును నాలేవలేనితనమును మూఁడును గలసి నా హృదయమును సంక్షుభితముగ జేసివైచెను. నాకన్నులనుండి దుఃఖాశ్రువులు ప్రవహించి తలదిండునంతను దడిపివైచెను. పిల్లయేడ్పు క్రమముగా వర్ధిల్లుచుండెను. అత్తగారు చాలా రాత్రివఱకును శిశువుచెంతనే యుండి పాలుపోసి కొన్ని నిమిషములక్రింద టనే పోయిశయనించెను. వృద్ధురాలును చాలసేపు మేల్కొని నదియు నగుటచే నామెకు వెంటనే నిద్రపట్టెను. నా క్షీణకంఠస్వరముతోడి పిలుపామెకు మెలఁకువ కలిగింపఁజాలకపోయెను. పైగా నాకంఠస్వరము విని బిడ్డ మరింత యేడ్పుట కారంభించెను. అందుచేత నాకన్నీరు మఱింత వేగముగఁ బ్రవహింపఁ దొడఁగెను. దుఃఖముచేత నాగుండెలు పగిలి పోవుచుండెను. నాకప్పుడు దేవునిపై గోపము గలిగెను. నేనార్తస్వరముతో "హా భగవానుఁడా! ఎవ్వతె కన్నియ నుండి ఎవ్వరును లేరో యెవ్వతెభర్త పరకాంతా నిరతుఁడో, యెవ్వతె కదలలేనంతటి రోగముతో మంచముపట్టియు నున్నదో యట్టి నిర్భాగ్యురాలికి సంతానము నేలప్రసాదించితివి? ఇదియును నాకొకవిధమైన శాస్త్రియేనా!" అని వదరితిని.

తరువాత నాబిడ్డంగూర్చి "దురదృష్టవంతురాలా! జన్మించుటకు నీకు మరి యేస్థానమును లభింపలేదా! తండ్రి నరకసుఖ నిమగ్నుఁడు! రోగార్తయగుతల్లి యెత్తి చన్నిచ్చుటకైనను శక్తిలేనిది. ఆకలిచే నారి పోవుచున్న కంఠమునం దొక పాలచుక్కయైన బోయువారెవ్వరును లేరు. ఇట్టి నీవు జన్మించుట దుఃఖమునకు గాక మఱి యెందుకు! అయ్యో! నీగొంతార్చుకొని పోవుచున్నది. ఆఁకలి మండుకొని పోవుచున్నది. నీవొక ప్రక్కను బడి యేడ్చుచున్నావు. నీ ప్రక్కకుఁ దిరు

గుటకైన శక్తిలేక నిర్భాగ్యురాలనగు నేనూరక చూచుచు నేడ్చుచున్నాను. చెవులతో జాలితో నీయేడుపు వినుచున్నాను. అయ్యో! దైవమా!''అని యేడువ నారంభించితిని.

ఇదియంతయును విని నా మగఁడు బిడ్డను లేవ నెత్తి యొడిలోనికి జేర్చుకొని నన్ను ద్దేశించి "పాలెక్కడ నున్నవి ? నేనైనను బిడ్డకు బోసెదను?'' అనియెను నాకప్పుడు నిజముగా గోపము వచ్చెను. "ఇదియేమి! మీరంతకష్టపడుటెందుకు?'' అంటిని. ఆతఁడించుక ఖిన్నమును బరుషము నగు కంఠస్వరముతో "నీ వేమనుచున్నావు?'' అనియెను.

నేను — అనుటకేమున్నది? అంతయు నాప్రారబ్ధము ఇప్పుడెంత రాత్రియైనది!

స్వామి — మూఁడుగంటలైనది. ఏమి!

నేను — ఇంతరాత్రివేళ నెచ్చటనుండి తడిసివచ్చితిరి ?

స్వామి — పనియున్నచోటినుండి.

నేను — ఒకమాట చెప్పెదను మీకు గోపమురాదుగద!

స్వామి — మాట వినకుండ గోపము వచ్చునో రాదో యెట్లు చెప్పఁగలను?

నేను — చూడుఁడు. నేను మీయిల్లాలను. భార్యకు భర్తకంటె నితరాశ్రయ మేదియును లేదు. నేను చావునకు సిద్ధముగ నున్నాను. వైద్యుఁడు శస్త్ర చికిత్స చేసి కేవలము పాలు మాత్రమే పథ్యముగా నియోగించి యున్నాఁడు. బ్రదికెదనో లేదో యాతఁడుకూడ నింకను నిశ్చయింపఁ జాలకున్నాఁడు. మీరునాయవస్థ కన్నెత్తి చూచుటయైన లేదు. వృద్ధులగు మీతలిదండ్రులు నన్నును నీచంటిబిడ్డను బెట్టుకొని చాలదినములనుండి యనేక కష్టములకు లోనగుచున్నారు. ఈచిన్ని బిడ్డ ఈ నెత్తురుకందు తల్లియొడియైన నెఱుంగనిపసికూన — నీకన్న సంతానము దీనినైన గడకంటనైనఁ జూచుచుంటిరా? ఇంతేకాక మీ

శరీరావస్థనైన మీరు జూచుచున్నారా? రేపేకాసరోగము విజృంభించి బాధించునోయని భయపడుచున్నారా? ఈశ్వరానుగ్రహమున నీనాలుగు నెలలనుండియు గొంచె మారోగ్యముగా నున్నారు. మీయొడలియందలి రోగము లెంతటిభయంకరమైనవో యనుభవించిన మీకుఁ దెలియదా? కాని మీరు వీనింగూర్చి యెంతమాత్రమును లక్ష్యము చేయుట లేదు. లేదు! ప్రేమ, భక్తి, మైత్రియనునవి యెంతమాత్రమును లేక బ్రదుకు నందే యుదాసీనత వహించి యెవ్వరికొఱకు — మఱి యేసుఖముకొఱకు రాత్రులనక పగళ్ళనక తిరిగి తిరిగి బాధపడుచున్నారు. మానవత్వము మాట యటుండ నిండు? పశువైనను గన్నబిడ్డలను గాపాడుకొనుటకు ప్రాణపణముగాఁ బ్రయత్నించునే. ఇట్టిచో మీరాలుబిడ్డల మాటయే మఱచి తిరుగుచుంటిరే. ఇంకమీబిడ్డలకు గతి యేమున్నది! వారి బ్రదుకెట్లు!

నామాటలు విని యాతఁడు చాలసేపటివఱకును మాటాడఁ జాలక పోయెను. తరువాత నించుక కర్కశమును నించుకయుగ్రము నగు స్వర ముతో "నేను పనులమీదఁ దిరుగుచున్నాను. నీరోగమున కెంతడబ్బు కర్చగుచున్నదో యెఱుగుదువా? ఆడబ్బంతయు నెక్కడనుండి వచ్చు ననుకొన్నావు?" అనియెను. నాకాఘోరదుఃఖము నందుఁగూడ నవ్వు వచ్చెను. నేనట్లు నవ్వుచునే "రాత్రులయందు గలకత్తానగర ప్రజలంద ఱును నిద్రించుచున్నవేళ మీరు ధనసంపాదనముకొఱకు ద్వారము ద్వారము చెంతకును బోయి ప్రయత్నించుచుంటిరా? మీకు డబ్బిచ్చు టకై యానగరమునం దెవ్వఁడు రాత్రిమూడుగంటలవఱకు మేల్కొని వేచియుండునో నాకు బోధపడుటలేదు." అని యంటిని.

ఆతఁడు నామాటకుఁబదులు చెప్పలేదు. నేనును మఱిమాటాడలేదు. మౌనముతో నుంటిని గాని నాహృదయమునందు మాత్రము వేయి తేళ్లు గుట్టినట్లు వేదనానుభవ మగుచుండెను. మృత్యుముఖమునఁ బడినఁ

గాని యీ ఘోరబాధ యుపశమించుట గలుగదని నేనప్పుడు సిద్ధాంతము చేసికొంటిని.

## ౨౮. సంభాషణము

మానవుల సుఖదుఃఖములను గాలము కడగంటనైనఁ జూడఁబోదు. అది యెప్పుడు నంతరాయాంతకములులేని యవిరతగతితోఁ బ్రవహించి పోవుచుండును. అట్లుపోవుటయే దాని స్వభావము. తరువాత నాలు గేండ్లు గడచిపోయినవి. ఆదినములలో నావశ్యకములగు సుఖదుఃఖ సంఘటనము లెన్నియో జరిగిపోయినవి. ఆదినములలో మేముకొన్నాళ్లు స్వదేశమునందును గొంత కాలము, కలకత్తాయందును నివసించి కాలక్షేపము చేసితిమి.

ఇప్పుడు క్షేమండఱమును మరలఁ గలకత్తాయందే కాపురము చేయుచుంటిమి. కొడుకును గూతురును, దాసదాసీజనమును వ్యాపారోన్నతివలనం గలిగిన యైశ్వర్యమును, విశేషముగ నలంకారములును మఱియు ననేక బాహ్యాడంబరములును గలిగియున్న నన్నుఁ గాంచి లోకులందఱును మహాసుఖవంతురాలిగా భావించుచుండిరి. కొందఱు నావంటి యదృష్టమును బడయుదుమనయు నని భగవానుని బ్రార్థించు చుండిరి. కాని - అయ్యో సుఖమెక్కడ నున్నది? విజ్ఞానసంపన్నులగు పెద్దలు తమగ్రంథములందు త్యాగమునందే సుఖమున్నది. భోగము నందుఁ గేవలము దుఃఖమే యున్నది. అని లిఖించి యుండిరి.

కాని యిప్పట్టున నేను త్యాగము చేయవలసినది దేనిని? సతీమణికి దేనిని విడుచుట యసాధ్యమో, దేనిని త్యజించుటకుఁ బ్రత్యేకాధికారము లేదో యట్టి వస్తువు ధర్మమా? కర్మమా? ఇవి యేవియును గావు. ఆనర రూప నారాయణుఁడు పరమేశ్వరుఁడును గురురూపము క్షేత్రపదుఁడు నగు నానాథుఁడు నీచచరిత్రుఁడు. అతఁ డందఱివలెనే సంసారము చేయు

చుండెను. సంతానము గనుచుండెను. వ్యాపారము వృద్ధిచేసికొనుచుండెను. నావిషయమునం గూడ నెట్టి యపచారమును గావించుటలేదు. కాని యాతఁడు చపలచిత్తుఁడు, నీచచరిత్రుఁడు! సురాపానము, వార విలాసినీ సమాసక్తి యాతని జీవితమర్మగ్రంథిని జుట్టఁబెట్టుకొని యుండెను.

నేనెన్నియోవిధముల నాతని బ్రార్థించి చూచితిని. ఎన్నియో జ్ఞాన దాయకములగు గ్రంథములను జదివి వినిపించితిని. ఎన్నియో నీతివాక్యముల తాత్పర్యమును బోధించితిని. ఎన్నియో యుత్తమాదర్శములను జూపించితిని. ఎన్నివిధములనో యనునయించితిని. పాదములపై బడి పొరలుచు మొరపెట్టితిని. ఆత్మహత్య చేసికొందునని పోయితిని. కోపగించి యాతనిపాదములచెంతనే యెన్నియోరాత్రులు పడియుండి వేగించితిని. కాని యాతనిస్వభావము మారలేదు. ఆతని యలవాటు తప్పలేదు. దేనికినిగూడ నాతడు లొంగలేదు. అందుచేతనే నేను సర్వవిధములను నితర సుఖముల నడుమను దుఃఖానల భీషణతాపము ననుభవించుచుంటిని.

సంధ్యాకాలమున నీరెండకావిరంగులచే దేజరిల్లు నగరి రాజమార్గములనుండి భిక్షుకదంపతులు తాము సంపాదించిన చేరెడు బియ్యము మూట కట్టుకొని తమ పర్ణకుటీరములకు దరలిపోవుచుండగా నేను జూచినప్పుడు 'ఆహా వీరి కున్న సుఖము నాకెక్కడిది' అని భావించుకొనుచుందును. ఏమనిన వారిరువురు నొక్కటే ప్రాణముతో నొక్కటే ధర్మముతో నొక్కటేయుద్దేశముతో గఠినశిలాకంటక మయంబగు తమ సంసారపథము ననుసరించి పోవుచుందురు.

తరువాత మఱికొన్ని యేండ్లు గడచిపోయెను. అయ్యో! భర్త పాపము భార్యకీ యిహలోకమునందే సంక్రమించునని యెవ్వరెఱుంగుదురు? నేనుకూడ నాతని మహాపాపమునకు భాగస్థురాలనై వ్యాధులచే పీడితనైపోయితిని. తుదకు మంచముపట్టితిని. నానాథుఁ డందుకు దగిన

ధనవ్యయము గావించి చికిత్సలు చేయించుచునేయుండెను. పథ్యపానము లకు నుపచారములకు నెట్టిలోపమును గావించుట లేదు. కాని నాకెంత మాత్రమును గుణ మగుపడుటలేదు.

నాస్వామికి నరకమున్నదనియు నాకు నానరకనివాసము తప్పదనియు నిశ్చయము తోచెను. అట్లయినచో నేనుత్రికరణశుద్ధిగా నాస్వామిని శ్యామసుందరుని బ్రాణపణముగా సేవించుట వృథయేనా? కాళీమాతను భక్తికుసుమములతో బూజించుట యంతయు నిరర్థకమేనా? సమస్త దేవతలను పేరుపేరు వరుసను స్మరించుచు వారి సంకీర్తనమునందే జీవిత మర్పించుట యంతయు నిష్ప్రయోజనమేనా? ఇవి యేవియును బుణ్య కర్మములు గావా? పుణ్యమునకు బురస్కారము లేదా కర్మమునకు ఫలప్రదానసామర్థ్యము లేదా!

ఒకనాడు రెండుజాముల వేళ నిశ్శబ్దమును నిస్తబ్ధమునగు నాపడక టింట బడియుండి పై విధముగా జింతించుచుంటిని. ఆ సమయమునందు నానాథుడు లోపలికి వచ్చి నామంచము ప్రక్కనున్న పడకకుర్చీపైఁ గూర్చుండెను. వ్రేలాడుచున్న యాతనిపాదములు నావక్షమువఱకును ప్రసరించి యుండెను. నాకింకను నారోగ్యము కలుగలేదు. ఎంతో దుర్బలముగా నుండెను. అయినను దాత్కాలికభావావేశముతో జటా లున లేచి యాపాదములను బట్టుకొని యాతని మొగమువంక గరు ణార్ద్రనయనములనుండి యూర్ధ్వదృష్టులను బరగించుచు దీనస్వర ముతో "ఇంకను నాయొద్ద నసత్యముననే వచింతువా! ఇంతకాలమును నాయొద్ద జెప్పినవన్నియు నసత్యములేనైయెనను గ్రహించి యూరకుంటిని. ప్రభూ ఇఁక నెన్నడు నాకడ నసత్యము చెప్పవలదు!" అని ప్రార్థించితిని.

ప్రత్యుత్తరమునకొఱకు నేను చాలసేపు నిరీక్షించితిని. చాలసేపటివఱకు నాతఁడేమియు మాటాడలేదు. గదియంతయు నిశ్శబ్దముగా నుండెను. కేవలము గృహకోణమునందలి బల్లపైనున్న టైమ్‌పీసు మాత్రము

సమతాళమున టిక్కుటిక్కుమని శబ్దించుచు దినజీవితదుఃఖచరిత్ర మును ప్రకృతిదర్బారునందు పునఃపునరావృత్తిగ నివేదించుచున్నట్లుండెను. మఱికొన్ని నిమిషములుజరిగిపోయెను. అయినను నాతఁడు మాటాడ లేదు. కాని యాతని మొగము కన్నులును పూర్ణముగ నెఱ్ఱనైపోయెను. సర్వాంగకములును స్వేదసిక్తములై యుండెను. మఱికొంత సేపు జూచితిని గాని యాతని ప్రత్యుత్తరము బడయజాలనైతిని. అప్పుడు నేను మరల "మాటాడరేమి!" అని ప్రశ్నించితిని. ఆతఁడు ప్రాణాంతికస్థానమునుండి దీర్ఘశ్వాసమును విడుచుచు కష్టోచ్చారితకంఠమునుండి భగ్నస్వరముతో "ఏమని చెప్పుదును!" అనియెను.

నేను — నేనడిగినమాటకు సమాధానము.

అత — నీవేమడిగితివో నాకుజ్ఞప్తియందు లేదు.

నేను — ఇఁక నాయొద్ద నసత్యము చెప్పవలదని—

అత — చెప్పను.

నేను — మీ రీపాపవృత్తిని బరిత్యజింపఁజాలరా?

అత — నిజము చెప్పవలసివచ్చినచో — చాలను!

నేను — మీరన్నమాట నిజమేయైనచో, పాపాచరణమందే మీకు సుఖ మున్నట్టు తోచినచో, పరలోక మున్నదని మీకు నమ్మకమే లేకయున్నచో, నరకవాసమునందలి యనంత యాతనలంగూర్చి మీకు భయమే లేక యున్నచో మీయిష్టమువచ్చినట్లే ప్రవర్తింపుడు. నేను మీకెన్నాళ్ళనుండియో యనేక మహావాక్యములను బోధించితిని. పాపపథమునుండి మిమ్ము మరలింపవలెనని యెన్నియో ప్రయత్నములు చేసితిని. కాని మీరు వేనినిగూడ లక్ష్యము చేయుటలేదు. చూడుడు! మీరు నాభర్తలు; నేను మీభార్యను; మీరు నాకు గురువులు; నేను మీశిష్యురాలను; మీరు నాకుపదేశింపవలయును; నేను దానిని గ్రహింపవలయును.

అత — ఆమాట యటుంచుము. నీవు నన్నుగూర్చి యింతగా భావించు టెందుకు? నేను నిన్నునాదరించుటలేదు. నీసుఖమున కభ్యంతరము కల్గించుటలేదు. ఇల్లు, వాకిలి, దాసదాసీజనము, వస్త్రాలంకారములు మొదలగు స్త్రీ వాంఛనీయ విషయములం దెట్టిలోపమును నీకు గలుగనిచ్చుట లేదు. ప్రేమించుటయందును లోటు చేయుట లేదు. అయినను నీవింతగ దల్లడిల్లిపోవు టెందుకు?

నేను — మీరిట్టి హీనచరిత్రులుగాక సాధుస్వభావులై యుండి సాయంకాలమునకైన నొకపట్టె డన్నమును నాకు బెట్టి యాదరింపఁగలిగినచో నేను దానితోనే స్వర్గసుఖము ననుభవించి యుండఁగలుగుదును. స్వర్ణాలంకారములకు బదులుగా సంకుపూసల గట్టినను సంతోషింపఁ గలుగుదును. ఇంకను మీరేమేమో నన్నుఁ బ్రేమించుచున్నట్లు చెప్పితిరే! నాయొద్ద నిట్టి మాయమాట లెందుకు?

అత — కాదుకాదు. నేనసత్యము చెప్పుటలేదు. సత్యమునే చెప్పితిని.

నేను — నావంక దిన్నగాఁ జూడుఁడు! నేను పసిపిల్లను గాను! ప్రేమయన నేమో మనఃప్రాణములయం దనుభవపూర్వకముగా గ్రహించిన దాననే. నిశ్చల ధ్యాన మొక్క యిష్టదైవమునందే కాక బహుదైవతములయెడల లగ్నము గావించుట యెట్లసంభవమో యట్లే ప్రేమయు నొక్కచోటనే గాని బహుస్థలములయందు వినియోగపడుట యసంభవము! నాయందు మీకు నిజముగాఁ బ్రేమయే యున్నచో బజారు వీథులఁ బట్టి పరుగులెత్తు టెందుకు! నామనసుకు నచ్చిన రూపగుణములు నీయందు లేకపోవుటచే నట్లల్లాడుచుంటినని చెప్పుదురా? అట్టి రూపగుణములు ప్రేమయందే యుండునుగాని వ్యక్తులయందు లేవు. మీకు నిజముగా నాయందు ప్రేమయున్నచో నేను మీమనసు వచ్చినదాననే యగుదును.

నానాథుఁడు నిరుత్తరుఁడైపోయెను. నేను కొంతసేపు ప్రతీక్షించి

యుండి "మీరు ప్రేమించినను ప్రేమింపకపోయినను నాకు గలుగు హాని వృద్ధు లేమియును లేవు. నేనే మిమ్ముఁ బ్రేమించి సుఖపడఁగలను కాని యట్టిసుఖమునుగూడ మీరు లేకుండ జేసితిరి!" అని యంటిని. ఆకస్మికముగ నిద్రాభంగమైనవాఁ డెట్లదరిపడిపోవునో యట్లే యాతఁ డులికిపడి "నేనేమి చేసితిని?" అనియెను.

నేను — భార్య భర్త కర్ధశరీరముగదా! స్వామి చేసిన పాపపుణ్యములు సతియును, సతిచేసినవి స్వామియుననుభవింపక తప్పదు. మీరు మహాపాతకముల నాచరించి యున్నారు. కావున వానిఫలము నేనుగూడ ననుభవింపవలసి యున్నది. ఇందువలన మీయెడల గల నాభక్తికి లోపము తటస్థించినచో నేనుమహాపాపము చేసినదాన నగుదును. ఆపాప ఫలమును మీరనుభవింపవలసి యుండును. ఇట్లే మనముభయులమును బాపపురుషుని యగ్నితప్త శృంఖలములచే బంధితులమై జన్మజన్మాంతరము లధోగతిపాలు గాక తప్పదు.

అత — నేనిప్పుడు నీయొద్ద శపథముచేసి చెప్పుచున్నాను. ఇఁక నేనెట్టి పాపకృత్యమును జేయను.

నేను — నాకు నమ్మకములేదు. మీరు కామదాసులైయున్నారు. ఇప్పుడు మీరన్నమాట శ్మశానవైరాగ్యమువంటిది. శ్మశానమువదలి యింటికివచ్చినంతనే యాభావము నిలువదు. పాపము చేయనని మీరు చెప్పితిరి గాని వారవిలాసినుల మాయాజాలములచెంతఁ జేరినంతనే మీయీ జ్ఞానమంతయు నశించిపోవును. మీరామాయలో బడిపోక మానరు. మహాపాప మార్గము దొంగయూబితో నిండి యుండును. అందు బడిన వాఁ డిఁకఁ బైకి రాఁజాలఁడు.

నాస్వామి యిక నేమియు మాటాడలేకపోయెను. మౌనముతో నావంక వెఱ్ఱివానివలెఁ జూడఁదొడంగెను. మే ముభయులమును జాల సేపటివఱకు నిశ్శబ్దముగనే యుంటిమి. కొంతసేపటి కాతఁడు వెడలిపోయెను.

# ౨౬. ఆర్ఘ్యప్రదానము.

తరువాత నొకయేడాది గడచెను. ఈశ్వరానుగ్రహముచే నేవంకఁజూచి నను లోపములేక మేము సర్వసుఖసంపదల ననుభవించుచుంటిమి. మావర్తకము సర్వోన్నతికి వచ్చెను. మాయాత్తమామలు వృద్ధులైరి. వారి యిచ్చవచ్చినట్లు కొన్నాళ్లు స్వదేశమందును గొన్నాళ్లు కలకత్తా యందును నివసించుచుండిరి. ఒక్కొక్కప్పుడు తీర్థయాత్రలు చేయుచుండిరి. నాకొడుకును గూతురును పెద్దవాండ్రయిరి. వారొకప్పుడు నాపుట్టినింటను నొకప్పుడు పితామహీపితామహులయొద్దను నొకప్పుడు మాయొద్దను నుండి సుఖముగా వర్ధిల్లుచుండిరి. మాకెట్టిధనలోపమును లేదు. ఆయన తనయిష్టము వచ్చినట్లు తిరిగితిరిగి యింటికి వచ్చుచుండిరి. ఆయనకు బాగుగ నారోగ్యము కలిగెను. మేఘముక్త సుధాకరునివలె నాతఁడు ప్రశాంతుఁడై కార్యక్షేత్రమున విహరించుచుండెను. నేనును బాగుగ నారోగ్యవతి నైతిని. సుఖముగా మేము కాలక్షేపము చేయుచుంటిమి.

ఇన్నియున్నను నామనస్సున కానందముగాని సుఖముగాని లేకయుండెను. తరుకోటరమున వహ్ని ప్రవేశించి యెవ్వరికిఁ గనపడకుండ వృక్షమునుదహించివైచుచున్నట్లు నాహృదయంబునఁ దదేకచింతయే దినదిన ప్రవర్ధమానమై నన్నుఁ గాల్చివైచుచుండెను.

"మానవజన్మమెత్తినందుకు నేనేమిచేసితిని? దుర్లభమగు నీజన్మమును ధర్మసాధనముచే సార్థకముగఁ జేసికొన నేరనైతిని. మానవునకును బశువునకును భేదమున్నది. పశువునకు ధర్మప్రవృత్తి లేదు. మానవుని కున్నది. అదిలేనినాఁడు నిద్రాహార విహారములందును సంతాన సృష్టియందును, సకలవిషయములందును మానవుఁడు పశుసమానుండే యగును." అని నాలో నేను నిత్యమును వితర్కించుకొనుచుందును,

మీరు నాభావమును గ్రహించి "ఓయువతీ! నీకుఁగావలసినంత ధనమున్నది! ధర్మకార్యములను జేసికొనఁగూడదా; వ్రతములనాచరింపుము! పూజలను గావింపుము. బ్రాహ్మణాదులకు దానములుచేయుము! దీనహీనానాధజనులకు సంతర్పణములు చేయుము! ఇవి ధర్మములు కావా? మానవునకింతకంటె నుత్తమ ధర్మము లేమున్నవి?" అని యుపదేశింపవచ్చును.

ఇవియన్నియు ధర్మకార్యము లనియే నేనును విశ్వసించెదను. కాని స్త్రీజాతికి మాత్రమివి యన్నియును గౌణ ధర్మములు! నాధుఁ డెట్టి ధర్మములు గావించునో యట్టిధర్మముల నాతనితోఁగూడి యాచరించుటయే సహధర్మిణికి ముఖ్యధర్మము! దంపతు లిరువురును గలసియే గార్హస్థ్యధర్మముల నిర్వహింపవలయును. పోష్యవర్గములను బోషింపవలయును. ఇరువురు ననన్యమనస్కులై హరినామసంకీర్తనము సమర్చనము లీలాగుణాభివర్ణనము స్తోత్రము ధ్యానము మున్నగునవి యాచరింపవలయును. మఱియు నితరదైవతారాధన వందనాదుల గావింపవలయును. దానధర్మములు నతిథిసత్కారములు దీనరక్షణములు నిరువురు నేకీభవించియే చేయవలెను.

భార్యాభర్తలలో నొకరధఃపతితులైనచో దక్కినవారుకూడ నట్లు కాకతప్పదు. ఇట్టిచో నానాధుఁడు పాపపంకనిమగ్నుఁడై పోవుచుండగా నేను ధర్మాచరణము గావించు టెట్లు? నేను జీవితకాలమంతయు నూరశ్వమేధములు చేయుటకు వినియోగించుచున్నను నాతనిపాప కృత్యములను రాక్షసగణ మా యజ్ఞాజ్యమును ద్రావి యుచ్ఛిష్టముగా జేసి యజ్ఞభంగమును గావించి వైతురు!

స్వామి యనుగ్రహమును, నన్యవాంఛా విరహితమగు స్వామిప్రేమయు నే సతీమణిని సహస్రపాతకములనుండి యుద్ధరించి యానందమందాకినీ పావనజలాభిషేకముచే బవిత్రురాలినిగా బరిణమింపజేయును.

అప్పుడామె నాథుని నిష్కల్మష హృదయ సంయమ శక్తిని సంపాదించి క్రమక్రమముగా స్వామిమయి యైపోవును. అప్పుడు ద్వైతభావమను కఠో రానలజ్వాల చల్లారి యద్వైతభావ సుధారసధారపొంగి పొరలుచుండును. అందుచేతనే దాంపత్య ప్రేమయొక్క మహత్తర మహిమంగూర్చి సకల దేశములందును సర్వశాస్త్రములందును సంకీర్తితమగుచున్నది.

కాని అయ్యో! నానాథునివలెనే యనేకనిర్భాగ్యవతులభర్తలు ప్రేమ తత్త్వమును గ్రహింపఁజాలక మోహాముగ్ధులై దుష్ట దుష్పథవిహారము గావించుచుందురు. మోహపిపాసార్తులై యింటనున్న పావనమందాకినీ విమలసలిలములను బరిత్యజించి దుర్గంధపరిపూర్ణంబగు చాకలిమురికినీటిని వాంఛించి తృప్తితీరక యొకచోటినుండి మఱియొకచోటికి బరిభ్రమించు చుందురు. కాని వారిదాహ మెంతకును దీరకయే యుండును. పైపెచ్చు నానాస్థానములయందలి విషజలపానముచే ఘోరాతి ఘోరంబులగు రోగములచే నాక్రాంతులై యనేకబాధలననుభవించి తుదకుఁ గాల వక్షంబునఁ బతితులై పోవుచుందురు. ఈపవిత్రవిషయముంగూర్చియే యొకమహాకవి యీక్రిందివిధముగా గానముచేసియుండెను.

గీ. "పావనప్రేమపథమును బట్టి పోయి
సుఖనిధానంబు బడయంగ జూతు వేని
స్వాంతము నిరంతరంబు నీకాంతయందె
నిలుపుకొని యామె వాడవై మెలఁగు మోయి!

గీ. పరమసౌఖ్య సుధా సరోవరమునందు
నోలలాడంగ గాంక్షించుచుంటి వేని,
ఏకపత్నీవ్రతము నిర్వహించు కొనుచు
నెన్నఁడు ద్వితీయవంకఁ గన్నెత్తకోయి!

ఆ. అట్లుగాక రాగమందందు విభజించి
మనసు కక్కుఱితిని మసలుదేని
నది విభిన్నగతుల నడరి యించును నందు
ఘోర యాతనలను గూర్చునోయి!"

పతివ్రతలగు సతులసతులు తరచుగా మతులు చెడి దుర్గతుల పాలగుచుండుటకుఁ గారణమేమైయుండు ననినే నాలోచించితిని. ఇతర కారణములచే బాడైపోవువారు చాలస్వల్పసంఖ్యలోనే యుందురు. చాలమంది నారీపిశాచినులగు వారాంగనల మాయాజాలములలోఁ బడియే చెడిపోయి తమకాంతల కనంతదుఃఖసంతతులను గల్పించుటే కాక తాము ఘోరనరకబాధల బడిపోవుచుందురు. అట్టివారి దాంపత్య జీవితచరిత్రమునందు కాల కళంకచ్ఛాయ లావరించియుండును. కాని యీవంక నెవ్వఁగును దృష్టిపాతము గావించుటలేదు. నగరమధ్యమునుండి సమాజవక్షస్థలమునుండి యీపిశాచినీగణము నుచ్చాటనము గావించుట కేసంఘసంస్కర్తలును విశేషించి ప్రయత్నించుట లేదు. ఈ దుశ్చరిత్రల దుర్విలాస వహ్ని జ్వాలయందెందఱు తరుణ వయస్కులు దగ్ధులై పోవుచుండిరో, బంగారమువంటి యెన్ని సంసారములు మాడిబొగ్గులై పోవుచున్నవో వానిసంఖ్య కవధిలేదు. పరిమళ మిళితములగు ప్రసూనములు మనోహరసౌందర్యముతో వికసించు టెందు కొఱకు? దేవతాపూజకొఱకు. పూవులు దేవతల యంశ విశేషములని నానమ్మకము. అట్టిపువ్వులను మాలికలుగను తోడాలుగను గుచ్ఛములు గను జేసి యలంకరించుకొనుటకై యీపాపచరితలు, నారీపిశాచినులు కులభ్రష్టలు కళంకినులు నగు వెలయాండ్రు విలాసముగ గోమలవల్లికల నుండి త్రుంచి దురుపయోగముగ జేయుచున్నారు.

మంచిబోధనము మంచివిద్యయు లేక పోవుటచేతనే తరుణ వయ

న్కులగు పురుషులు సర్వనాశన కరంబగు నీపాపపథము నవలంబించి యాకులటల పాపప్రలోభనమునఁబడి ముగ్ధులై దుష్పథమున బద్ధులై పోవుచున్నారు. అట్టి యువ పురుషు లిట్టి కాల సర్పదంశనములకులోను గాకుండఁ జూచుట సమాజమునకును, జననీజనకులకును, బోషకులకును, ప్రభువులకును ప్రధానకర్తవ్యము గాదా! అట్టి స్వధర్మమును వారు నిర్వహింప కున్నంతవఱకు నావంటియభాగినుల నిత్యదుఃఖాశ్రువాహినులచే భారతభూమియంతయు బఁకిలమైపోవుచునే యుండును. కర్మభూమి యగు భారతవర్షమంతయు ధర్మకర్మవిహీనమై నిస్తేజమగుచునే యుండును.

నేననేక సుఖసంపదల నడుమనుండియు నశాంతి జ్వాలలచే గాలుచునే యుంటిని. ఇంకను నావంటికాంత లెంతమంది యెన్నివిధముల బాధపడుచుండిరో లెక్కించిచూచిన వారెవ్వరు!

ఏమైననేమి? ఎంతయాలోచించిన నేమి? అల్పురాలనగు నబలను నేనేమి చేయ గలుగుదును. కాని నాకెందువలన నీహృదయజ్వాల రేగుచుండెనో, యెందువలన సుఖనివాసమునందుఁగూడ మరణభిక్షము వాంఛనీయ మగుచుండెనో యావిషయము నూరక మీకు విన్నవించుటకంటె నాచేయదగిన దేమియును లేదు.

ఈవిధముగా నేను కిటికీయొద్ద గూర్చుండి నాదుఃఖముం గూర్చియు, సమాజమునందలి మహాపాతకముం గూర్చియు, నీతినియమధర్మవిషయములందు ప్రజలయౌదాసీన్యముం గూర్చియు భావించుకొనుచు నంతర్దాహముచే దగ్ధురాల నగుచుంటిని. అప్పటికి సంధ్యాసమయ మయ్యెను. ఆ పూట ముగ్ధ సంధ్యా నిశ్శబ్దతకు భంగము గలిగించుచు మామేడ కెదుట నున్న వీధినుండి మధురకంఠస్వరముతో బాడుకొనుచు మెల్ల మెల్లగ నడచి పోవుచుండెను. ఆతఁడు మందగమనముతో బోవుచుండుటచే నాతని గీతమును సంపూర్ణముగా నేను వినఁగలిగితిని. అందువలననే

హాహాకారప్రవాహ మాగిపోయెను. అప్పుడు నేనీనగరమునందుఁ గేవల పాపలీలా సంకీర్తనములేకాక మానవులకు మానవత్వముం గూర్పగల ధర్మగీతముల యందలి మృత్యుసంగీతోచ్ఛ్వాసములునుగూడ బ్రచార మునం దున్నవని యనుకొంటిని. మక్షికము వ్రణమును వెదకికొను చుండునుగాని యెందును భ్రమరము మధువునే యన్వేషించుచుండును. ఇది స్వభావము. ఏపల్లెయందైనను నేపట్టణమునందైనను మంచి చెడ్డలు కలసియే యుండును. అతఁడు పాడిన కీర్తన మిది:—

1. ఏమాయకు లోనైతివె మనసా! యేకడ జిక్కితివే
   నీమలిన గృహాంతరనటు మంగళధాముని గనవఁటవే॥ ఏమా॥
2. మా పీడని నాసతియని సుతులని మమతను వదలవటే
   నీవాఁడెవఁడో పరాకునన్నైనను నీవూహింపవఁటే॥ ఏమా॥
3. అనవరతము సుఖడోలిక నూగుచు గనులను దెరవ వఁటే
   కనకా కీయుయ్యాల నెవఁడిచ్చెను గ్రహింపజన దఁటవే॥ ఏమా॥
4. చెవియిల్లుగ నేఁ జెప్పినదంతయు జెవిటిపురాణమఁటే
   అవివేకపరాత్మీయ విభేదము నడపఁగఁజాలవఁటే॥ ఏమా॥
5. నవ్వుచు నేడ్చుచు నిరత మహంకృతి క్రొవ్వున దిరిగెదఁటే
   నవ్వులకైనను నొకపరి శ్రీహరినామము నుడువవఁటే॥ ఏమా॥

గానము దూరమై యాతని కంఠస్వరముకూడ వినఁబడనప్పుడు నేనిప్పటివలెఁగూర్చుండి యాలోచించుకొనుటకు మరల నారంభించితిని. ఎవ్వారి మనఃకందరమునుండి యిట్టి భావపూర్ణమగు గీతము వెలువడి భక్తిముక్తి భావప్రదర్శక మయ్యెనో యాతఁడును మానవుఁడే — మఱియు నెవ్వాని పాపచింతనమునుండి నరక లీలాలోత్సవమునుండి యశ్లీల గానావేశతరంగములు భంగితము లగుచుండునో యాతఁడును మానవుఁడే. అట్లయినచో నీజగమునం దీమానవులలో నిట్టివిభేద మేల కలుగ

వలెను. భగవానుఁడు మూలకారణుఁ డనియు నాతఁ డందఱియెడల సమ కరుణాసంపన్నుఁ డనియు వినియుంటిని. అట్లయినచో నాతఁడు కొందఱి కున్నతోన్నతగతులను గల్పించుచుఁ గొందఱి నధఃపతితులుగా జేయుటేమి!

అప్పుడాకస్మికముగా నా చెవిలో నెవ్వరో నీజీవితముతో నితరుల జీవితమును బోల్చి చూచుకొనుము! అప్పుడు నీకీ తారతమ్యము బోధపడును. నీవు చిన్నతనమునుండియు నిప్పటివఱకును నీస్వామి సహస్రాపరాధములను సహించి హృదయ వేదనా జ్వాలలను వర్ధిల్లచేసికొనుచునే యుంటివి గాని యెన్నఁడును స్వామి చరణచింతనమునం దించుకంతయు నేమరియుండలేదు. నీవట్లే పరమేశ్వరప్రార్థనమును మఱచియుండలేదు. అందుచేతనే నీకుఁ జిత్తశుద్ధి వలన నెట్టి యున్నతి లభించినది. ఇప్పుడు నీహృదయము సాధనకుఁ బవిత్రక్షేత్రమైనది. కులటయగు నొకపాప చిత్తురాలు కుష్ఠాది దుష్టరోగములచే వికృతాంగియై విగత యౌవనయై వీధుల వెంట బిచ్చమెత్తుకొనుచు విలపించుచుండును. అదియు నొకప్పుడు యువతీరత్నమే. ఆమెకును సౌందర్యమున్నది. ధర్మాధర్మజ్ఞానమున్నది. నిజముగా నామె యీ జ్ఞానమునే యవలంబించి యాపాతమధురంబును క్షణికసుఖదంబు నగు మోహమార్గమునఁ బడిపోవకయే యున్నచో నామె కట్టి దుర్దశ యేలతటస్థించును. పరమేశ్వరుఁడు సమకరుణామయుఁ డగుట సత్యమే. మానవుఁ డీలోకమునందు — ఈ కర్మక్షేత్రమునందు సర్వస్వతంత్రుఁడై యవతరించుచుండును. ఎవ్వఁ డెట్టి కర్మము నాచరించునో యట్టి ఫలమునే యనుభవించును. జీవులు కర్మానుసారులై కర్మఫలముల ననుభవించుచుందురు. అయినను కర్మమే సర్వప్రధానమైనది గాదు. ఎట్టి దుష్కర్ములైనను నెంతటియధోగతులైనను నేకాగ్రచిత్తులై యనన్యశరణ్యులై పరమేశ్వరుని బ్రార్థించినచో దయామయుఁ డగు నాతఁ డెట్టివారినైన నుద్ధరింపఁగలడు. ఆతఁడు సర్వసముఁడు;

పాపాత్ములని గాని పాపవర్తనులని గాని యాతఁ డెంతమాత్రమును ద్వేషింపఁడు" అని చెప్పిన ట్లయ్యెను.

అయ్యో! మానవుఁడా! ఇట్టి దుర్లభమగు మానవజన్మమునుగాంచి యింతటి కరుణామయుఁడగు సర్వేశ్వరుని రాజ్యమునందు నివసించి యుండియు నిట్లధోగతుఁడవై పోవుచుంటి వేమి?

## 27. ధ్యాన శక్తి

మీరెన్నఁడైన జాగ్రత్తయందు స్వప్నమునుగనియుంటిరా? నే నొకనాఁ డట్టిస్వప్నమును గాంచితిని. అది కేవలము విశృంఖల సంఘటనముగాని కథారాశిమాత్రముగాని కాదు. జాగ్రదవస్థయందు మాటలాడుకొను చున్నట్లే యుండెను. అది శ్రావణమాసము. మధ్యాహ్నసమయము. మగవాండ్రందఱును భోజనములు చేసి తమపనులకై యిలు వెడలిపోయిరి. దాసదాసీజనమును బాలబాలికలును భుజించుట మైనది. నేను నాగదిలో నొకసోఫాపై విశ్రాంతికొఱకు శయనించి యుంటిని. నాగది ప్రక్క నొక సందున్నది. దానివెంట నెవ్వరును రాకపోకలు గావింపరు. అం దొక నిమ్మమొక్క మొలిచి విస్తరించి యున్నది.

ఆనాఁడు మబ్బుగను మునురుగను నుండెను. ప్రొద్దుటినుండియు వర్షము గురియుచుండెను. నడుమ నడుమ నున్మాద మెత్తినట్లు పెద్ద పెద్ద జడు లీ దిక్కునుండి యా దిక్కునకు రేగిపోవుచుండెను. అట్టి వర్షాచ్ఛన్న నిశ్శబ్ద మధాహ్నసమయమున నానిర్జన గృహమందు నే నొంటిగా శయ నించి యేమేమియో భావించికొనుచుంటిని.

ఏమిభావించుచున్నాను? నాస్వామి యిప్పుడు పాపపథమునుండి వెను దిరుగుచున్నట్లు భావించుచుంటిని. అయినను నాహృదయజ్వాల చల్లార దేమి? ఇప్పుడు నాస్వామి నాకనుకూలుఁడై యుండెను. పుత్రపుత్రికలు సుఖముగా నున్నారు. ఇంటివా రందఱును నన్నాదరించుచున్నారు.

ఐశ్వర్యముచేతను దాసదాసీజనముచేతను నామందిర మానందభవనమై యుండెను. కాని నాహృదయమందు కేవలము దుఃఖజ్వాల మాత్రము భగభగ మండుచునే యుండెను. ఎక్కడనుండియో వచ్చి పడిన క్రూర రాక్షసుని భీకరదృష్టులలో నేను తేలిపోవుచున్నట్లుంటిని. నా కీ విధముగా నెంతమాత్రమును శాంతి లేకుండుటకు గారణమేమి?

నేను బాగుగ మేల్కొనియే యుంటిని. కాని యాకస్మికముగా నాకేదియో యవస్థాంతరము ఘటిల్లెను. నాబాహ్యజ్ఞాన మంతయు నశించిపోయినది. అప్పు డొక సుందరీమణియగు రమణి - జ్యోతిర్మయి యగు సతీమణి మెల్లగ వచ్చి నాతలయుంపి దిక్కున నిలువఁబడినెను. ఆమెంగాంచి నే నదరపడి భయభక్తి కంపితస్వరముతో "నీవెవరమ్మా! అట్లు నిలుచుంటివేమి? ఈ పడుకకుర్చీపై కూర్చుండరాదా?" అని ప్రశ్నించితిని. ఆమె యతి మధుర మృదుస్వరముతో "నేనిప్పుడే పోవలయును! కూర్చుండుట కవకాశములేదు!" అనియెను.

నేను — కొంతసేపైన గూర్చుండని దాన వెందుకు వచ్చితివి?

ఆమె — నీవిప్పు డెట్టియవస్థలో నుంటివో గ్రహించుకొంటివా?

నేను — అమ్మా నాసంగతి నాకెంతమాత్రమును దెలియుటలేదు.

ఆమె — నీవు బాల్యమునుండియు నియతచిత్తముతో నీ భర్తను సన్మార్గమునకు మరలించుటకై కావించిన మహత్తర ప్రయత్నమునకు ఫలముగా నీహృదయము పవిత్రమైనది. నీవిప్పుడు మానవివే యైయున్నను దేవత్వసిద్ధిని బడయఁగలిగితివి. అయినను నీవు హృదయము నందింతటి యశాంతి ననుభవించుచుంటివేమి?

నేను — అమ్మా! నాహృదయములోని విషాదము నంతను నెఱుంగఁజాలిన నీవు దానికిఁ గారణమునుమాత్ర మేల గ్రహింప జాలకున్నావు.

ఆమె — గ్రహించితిని. నీవు నిష్కామపరమశాంతిని వాంఛింపుము. భోగమునందు శాంతి లభింపదనియు త్యాగమువలననే యది సమకూరు

ననియు నీవెఱింగియుంటివి. అట్టి నీవు త్యాగమును బ్రార్థించుటలేదేమి! భగవానుఁడు నీయెడల నెంతయుఁ బ్రసన్నుఁడై యున్నాఁడు. నీవు కోరిన వాని నన్నిటి నాతఁ డాక్షణమునందే ప్రసాదించుచున్నాఁడుగదా?

నేను — నే నెట్టి త్యాగమును బ్రార్థింపవలయును తల్లీ!

ఆమె — నీభర్త మొదటినుండియుఁ బాపవర్తనుఁడై రోగాక్రాంతుఁడై యుండెను. ఆతని కారోగ్యము గలిగింపుమని నీవు దేవుని బ్రార్థింపకయే యున్నచో వేయిమంది డాక్టరులు వచ్చి చికిత్స చేసినను నాతని రోగము శాంతింపకయే యుండునని నాయభిప్రాయము. తుదకు నీ వ్యాకులప్రార్థనమువలననే యాతని కారోగ్యము గలిగినది. నీవట్లు కోరక నీయాత్మశాంతినే వాంఛించినచోఁ బరమేశ్వరుఁడు నీయభిలషితమును దీర్పకుండునా?

ఆమాటకు నాకు నవ్వువచ్చినది. నవ్వినచో నామె యేమనుకొనునో యని సంశయించి భయపడి యెట్లో యాత్మసంవరణము గావించుకొని "అమ్మా! నీవు నన్ను భ్రాంతిగొలుపుచున్నావా? జీవితసంకలితం బగు నాశ్రయతరుస్కంధమున గఠోరకుఠారాఘాతము గావింపం బురికొల్పుచుంటివా? దానిని ద్యజించిన సుఖ మగునని మృదువల్లి కాశగొలుపుచుంటివా? ఆశ్రయతరుపతనమువలన దానును భిన్నభిన్నమై మట్టిలోబడి శతశతపథికకఠినపదదళితమై చూర్ణవిచూర్ణమై పరిశుష్కమై పోవలసి వచ్చునని యావల్లికకుఁ దెలియదా?" అని బదులుచెప్పితిని.

అంతనాజ్యోతిర్మయి మందహాసము చేయఁదొడంగెను. ఆహాసమునందు శతశహస్ర చంద్ర సౌందర్య తేజము వికసిత మగుచుండెను. ఆమె యట్లు నవ్వుచునే మధుమృదురస్వరముతో "సరే! నీవు ధనముకొఱకేల ప్రార్థించితివి? నీవుప్రార్థించుటచేతనే భగవానుఁడు నీకువిశేషైశ్వర్యమును బ్రసాదించెను. వర్తకమునం దత్యున్నతిని సమకూర్చెను" అనియెను.

నేను — భోగాపేక్షచే నేను ధనమును వాంఛింపలేదు. నాస్వామి

సుఖముకొఱకు ధనము నభిలషించితిని.

ఆమె—అట్లయినచో బుత్రపుత్రికల నేల కోరితివి?

నేను - సంసారమునకు సంతానమే ప్రధానము. సంతానము నందలి ప్రేమచే వారిని లాలించుచు బాలించుచు నానాథుఁడు సంసారియై దుష్పథమునుండి మరలి సుఖించునని యెంచి యట్లు ప్రార్థించితిని.

ఆమె — మంచిది. నీకు జబ్బుచేసినప్పుడు నీయారోగ్యముకొఱ కేల వాంఛించితివి? కృపామయుఁడగు సర్వేశ్వరుఁడు నీయెట్టికోరికను గూడ నిరర్థకముగ జేసియుండలేదు.

నేను — నాయీభోగశరీరము లేకున్నచో భోగాసక్తుఁడగు నాస్వామి యెప్పటికిని దన దుష్ప్రవర్తనమును మార్చుకొనఁ జాలఁడు. అందుచేతనే నేనారోగ్యమునర్థించితిని.

ఆజ్యోతిర్మయి యింకను నేమియో చెప్పుట కుద్యమించెను. కాని యేమియును జెప్పుట జరుగలేదు. ఆకస్మికముగా జడివాననుండి హోరను గాలి, కిటికీనుండి వానచినుకలను నామీఁదికి జల్లున విరియించెను. దానితో నాభావనాపరంపరకు భంగము గలిగించెను. ఇఁక నాజ్యోతి ర్మయి నాకగపడలేదు.

నేను త త్తరముతో లేచితిని. నాకెంతయో దుఃఖము వచ్చెను. అట్టి యతిలోకరమణీయ రమణీమూర్తి నిఁక నెందును జూడఁ జాలనుగదా యని, అట్టి మధురమోహన కంఠస్వరము నిక నెన్నడైన విన గలుగుదునా! ఇప్పుడు జరిగిన సంభాషణ మంతయు, వాస్తవమో భ్రాంతియో మరియేదో నాకు నిశ్చయముగా దెలుపగలవా రెవ్వరున్నారు? ఇది మనోవికారమో, యున్మాదకల్పనయో, యపూర్వసృష్టి కౌశలమో నిర్దేశించి చెప్పగలవా రెవ్వరైన నున్నారా?

*

# ౨౮. మానసపూజ

ఇప్పటికి నాస్వామి నగరమునందు పెద్దమనుష్యుని వలెఁ బ్రవర్తించుచుండెను. పుండుపైఁ బూవులఁ గప్పినచో నది లోకమున కగపడకుండునట్లు నానాథుని పాపవర్తనము బాహ్యనటనములచే నప్రకాశితమై యడఁగి యుండెను. ఆతఁడు ప్రాణపణముగఁ బ్రయత్నించి కన్నులు దెఱచి తన వ్యాపారమును జూచుకొనుచుండెను. దాంపత్య ప్రేమ యెంతయో కలవానివలె నటించుచు నన్ను సంతోషపెట్టుటకు మిగులఁ బ్రయాసపడుచుండెను. నేనింతకాలమునుండియు నాతని గనిపెట్టి చూచుచుంటిని. ఆతనినే దైవముగా భావించి శ్రీకృష్ణస్వరూపునిగా నాతని బూజించుచున్నదానను. ఆతని యిప్పటిప్రేమనటనమునందు దాంపత్య మధుమధురధార ప్రవహించుట లేదని గ్రహింపఁజాలనా? ఆతనిప్రకృత ప్రేమ చదివినపాఠము నొప్పగించుటవంటిది! క్రయవిక్రయాదికముచే నంపాదించిన లాభమువంటిది! అంతేకాని దానియందుఁ బాపతాపమును విషజ్వాలయును మిళితములై యున్నవి.

మానవుఁడు మోహమధువు నొక్కసారి రుచిమరగినచో బ్రదికియున్నంతవఱకును దానిని బరిత్యజింపఁజాలఁడు. చైతన్యము గలిగినప్పుడైనను జ్ఞానము లభించినప్పుడైనను దానిని విడుచుటకు సమర్థుఁడు గాకుండును. అధర్మము చేయుచుంటినని గ్రహించియు ధర్మపథమునకు మరలఁజాలఁడు. అధఃపతితుఁడగుచున్నను తుదకుఁ జచ్చుచున్నను నాతఁడు దానిని సేవించుచునేయుండును. ఇదియే మహామాయ యజ్ఞాత విలాస మని జ్ఞానులు చెప్పుదురు. అందుచేతనే సాధకులు మహామాయ దర్బారునందు — మహామాయ సింహాసన ప్రాంతమున, మాయాదేవి చరణకమలసన్నిధిని — ఉత్తరీయము మెడకు జుట్టుకొని ప్రణామము గావించుచుఁ గరుణవికలకంఠస్వరముతో నేడ్చుచు నేడ్చుచు :—

నేరమే మొనరించినానమ్మా — సంసారకారా — గారమున నను
ద్రోయు టేమమ్మా !

1 సారెసారెకు నాలుబిడ్డలు చరణశృంఖల లగుచు నిట్టటు
పారిపోవఁగనీక నను నిర్బంధపెట్టఁగఁ జూచుచుంటివి ॥నేర॥

2 ప్రక్కప్రక్కల దూతలార్గురు బహువికారాకృతులు దాలిచి
దిక్కుతోపగనీక నను బాధింపఁ గని వారింపకుంటివి ॥నేర॥

3 కాలిసంకెల గెడపఁ జాలక కలిమిలేముల హాసశోకము
లోలిగాంచుచు ముక్తి బథమెటనోమఱచికననేరకుంటిని ॥నేర॥

4 తెల్లవారఁగలేచి యిట్టటుఁ దిరిగి పొట్టకుఁదెఱువు గానక
పల్లటిల్లుచునుంటినో శవభవసకేళికరాళి కాళీ !— ॥నేర॥

5 దారధన పుత్రేషణంబులఁ దగిలి దుర్మతితోడఁ గడునప
చారముల నొనరింపఁ జంకక సర్వనాశనమగుచునుంటిని ॥నేర॥

6 అడరినాదుఃఖాగ్నిఘనశిఖ లంబరము ముట్టినను బ్రాణము
లెడలకున్నవి తల్లి! బాధలఁ బడఁగఁజాలకమిడుకుచుంటిని ॥నేర॥

అని యనేకవిధములఁ బ్రార్థించుచుందురు. మహాపాపాత్మునికైనను యుక్తాయుక్తవివేకమును, సదసద్విచారమును, పాపపుణ్యజ్ఞానమును గలిగియుండునని పురాణములయందు మహర్షు లుపదేశించిన విషయములను జదివి యుంటిని. దొంగతనము దోషమని చోరుఁ డెటింగియు నాపని మానలేఁడు. అట్లే వేశ్యాసక్తుఁడును — అది స్వాభావసిద్ధమైన జ్ఞానముకాదనియు కేవలవిషయజ్ఞానముమాత్రమే యనియుఁ బెద్దలు చెప్పుదురు. ప్రకృతిజ్ఞానము చిత్తశుద్ధివలన లభించును. చిత్తశుద్ధి సదాచారమువలన సమకూరును. సదాచారమును మనోబలముచే రక్షించుకొనఁ గలిగినవాఁడు మహావనప్రవిష్టుఁడగువ్యక్తి హింస్రజంతువులకు భయపడునట్లు పాపములనిన భయపడుచుండును. ఎల్లప్పుడును మనసు

నందు మృత్యువును స్మరించుకొనుచు, సజ్జనసాంగత్యముం గూర్చి భావించుకొనుచు, భయభక్తులతో భగవన్నామమును గీర్తించుకొనుచు సదాచారసంపన్నుఁడగువాఁడు నిశ్చలసిద్ధికై సద్గ్రంథపఠనమును గావించుచుండవలయును.

## ౨౯. ప్రత్యాహారసమీక్షనము

సుఖద యను మాయింటిదాసి బయటిపనులను దీర్చి యుదికి యారవైచిన వస్త్రములను మడతలుపెట్టుచుండెను. సంధ్యాదీపము శీతలవాయుమృదుస్పర్శమున నల్లనల్లన గంపించుచుండెను. అప్పుడు నేను సాయంకాలపూజను బతిదేవతాకీర్తనమును ముగించుకొని యించుక తెఱచి యున్నగవాక్షముచెంతనున్న పడుకకుర్చీపై నర్ధశాయినినై యుంటిని. వీధియందొక భిక్షుకుఁడు పైసపైసభిక్షముకొఱకు వాంఛించి యింటింటికిని దిరుగాడుచుండెను. నేను సుఖదచే వానికొకపైసను బంపించితిని. అప్పుడు సుఖద నేనాలకించి సంతసింతు ననియెంచి యా భిక్షుకు నొకపాట పాడుమనియెను. పైసయిచ్చిన గౌరవమునుబట్టియో, సుఖద కోరికనుబట్టియో కాని యాబిచ్చగాఁడు గానము చేయ నారంభించెను:—

అట్లుగానముఁ జేసిచేసి బిచ్చగాఁడు వెడలిపోయెను. ప్రేమతోఁ బిలిచిన లోకేశ్వరుఁడే వశుఁ డగుచుండగాఁ బ్రాణేశ్వరుఁడేల వశుఁడు గాకుండెను. భక్తికి భగవానుఁడే యాత్మీయుఁ డగుచుండగా భర్తయేల నావాఁడగుట లేదు!

ఝమ్ఝమ్ఝమ్! అని నాశిరోదేశమునం దొకకణుదురీగ రొదచేయుచు నెగురుచుండెను. పిడికిళ్ళు గట్టిగ బిగించి యేకాగ్ర దృష్టితో నాకర్షించినచో దుమ్మెదలుమున్నగు నిట్టి జీవు లెగురుటకు శక్తిలేక గ్రిందఁబడునని యొకగ్రంథములోఁ జదివి యుంటిని. అందుచే నేనాక్షణ

మునం దక్లైయాకర్షించిచూచితిని. రెండు మూఁడు నిమిషములలో నక్లై యాయీఁగక్రిందఁ బడిపోయెను.

అప్పుడు నామనసునందు ఏకాగ్రచిత్తముతో "నాస్వామినిక్లై యారాధించి యాకర్షించినచో నాతని యన్య గతియు, నన్యమతియు, నన్యభావమును రుద్ధమైపోవునుగదా!" అని యాలోచన తోఁచెను. పతివ్రతయగు సతీమణికి స్వామిసాధన యిందుకొఱకెయని తెలిసికొంటిని. పతి యెట్టివాఁడైనను సతీమణి ధ్యానాకర్షణములచే నిశ్చయముగా నాతఁడు పరమధార్మికుఁడగును. ఆత్మేశ్వరుఁడగును. అందుకొఱకే గోపికాసుందరుల మధురభావభజన! అందుచేతనే తాంత్రికుల తాత్వికాకర్షణమునం దిరువురిహృదయములు నేకమైపోవుట!

నేనాదినమునుండి యాబాల్యసాధనశక్తి యంతయును వినియోగించి మఱియు నతిదృఢసంకల్పముతో స్వామికి నాయందు దయగలుగుట కొఱకు - ఆతఁడు దుష్పథమునుండి మఱలుటకొఱకు-ఆతనియారోగ్యము కొఱకు — సర్వదా భక్తితో నాతని మానసికవిధానమున నారాధించుట కారంభించితిని. ఇట్లు కాలప్రవాహమునుండి దినములపై దినములు జరిగి మాసములపై మాసములు చెల్లి యొకవత్సరము గడచిపోయెను.

ఒకనాఁడు ప్రభాతశీతలమందమారుతములు వీచుచుండ నా నాథుఁడు మా మేడముందరి డాబాపై మెల్లగఁ బ్రచారము చేయుచుండెను. ఆయన యటనుండెనని యెఱుఁగక నేనును డాబాపై కెక్కితిని. అప్పటికి నానాథుఁ డవ్వలిమొగమైయుండెను. ఆతనిగమన మతి మందముగ నుండెను. మొగమునఁ జింతారేఖలు దోఁచుచుండెను. ఆతఁడు కొంతసేపటికి నావైపునకు దిరిగి యాకస్మికముగా నన్నుఁ జూచి యదరిపడిఓసి "నీవా!" అనియెను.

నేనునవ్వుచు "ఈసమయమున నేనుగాక మరియెవ్వతెయైన నిట్లు వచ్చినచో మీకానందముగ నుండునుగాబోలును!" అంటిని.

అత — ఇంతకుముందు కొన్నాళ్ళక్రిందటనైనచో నీవన్నట్లే యూనందించి యుందును. కాని నిజముచెప్పుచున్నాను. ఇప్పుడు నాహృదయమునందలి ప్రతిస్తరమునందును గ్రొత్తక్రొత్తభావములును, గ్రొత్త క్రొత్తయభిలషితములును సంకితము లగుచున్నవి. కాని యందు వలనఁగూడ నాకు సంపూర్ణానందము లభించుటలేదు. జలాతంకరోగి జలపిపాసచేఁ జచ్చిపోవుచున్నను నొక్కశీతలజలబిందువునైనను బానము చేయఁజాలనట్లు నేనిప్పు డాశతీరని యవస్థలో బాధపడుచున్నాను.

నేను — మీమాటలు నాకు స్పష్టముగా బోధపడుట లేదు.

అత — సత్యము చెప్పెదను వినుము. నిజము చెప్పుటకు నాకిఁక సంశయము లేదు. పాపపథము, పాపసంగము పాపాకాంక్ష యనుదుర్గుణములు శిశిరతరుశాఖలయందలి జీర్ణపర్ణములవలె మెల్ల మెల్లగా నానుండి జారిపోయినవి. ఏదేవత శుభాశీర్వాదముచే నిట్టిభాగ్యము లభించెనో యెవ్వ రెఱుంగుదురు! ప్రస్తుతము దాంపత్యధర్మ మధురామృతము నాస్వాదింపవలయు నని నాప్రాణములు తల్లడిల్లిపోవుచున్నవి. కాని జలాతంకరోగి జలంబులంబోలె నేనాసుధారసమును గ్రహింపఁ జాలకుంటిని. ఆ సమ్మేళనసుఖము నాకేల లభింపకుండెనో నీవుచెప్పఁగలవా?

నేను — మీరు నిజముగా బాపపథమును బరిత్యజించితిరా?

అత — నిశ్చయముగా! నాజీవితకాలమునం దిఁక నెన్నఁడునసత్యము చెప్పను. ఇఁక నెన్నఁడును బాపకృత్యమును జేయను.

నేను — నేను మీపాదదాసిని. చిరసేవకురాలను. నన్నేమిచేయుమని నను జేయుటకు నేను సిద్ధముగా నున్నాను.

అత — చెప్పితినిగదా ప్రాణసంకటమగు పిపాస! ఎదుటనే చెంతనే జల మున్నది కాని దానిని జూచినంతనే భయము! దాని ముట్టినంత మాత్రమున జచ్చిపోవుదును!

నేను — అట్లనుటకు గారణమేమి?

**అత** — ఎందుచేతనో చెప్పఁజాలను. నామనసునందు దీనింగూర్చి వితర్కించుకొని యొకసిద్ధాంతమునకు వచ్చితిని కాని దానిని నీయెదుట జెప్పుటకు నాయహంకారపజ్వాల నానాటికి నుడికించుచు శుష్కింపఁ జేసి నోటమాట వెలువడ నీయకున్నది.

ఆనాఁడాసమయమున నింక నావిషయమునుగూర్చి యెట్టి సంభాషణమునుజరుగలేదు. మఱునాఁడు తెల్లవారినంతనే లేచి చూచితిని. అప్పుడు నానాథుఁడు గంగాస్నానమునకుబోవుచుండెను. "ఎక్కడకుఁబోయెదరు? ఇట్టిబుద్ధి యెక్కడనుండివచ్చినది?" అని నేనుప్రశ్నించితిని. ఆతఁడునవ్వుచు "స్నానముచేసి మరల వచ్చి చెప్పెదను!" అనియెను. నాహృదయము పరమానందముచే నుప్పొంగి పోవుచుండెను. స్వామి మరల వచ్చినంతనే "ఏదియో చెప్పెదనంటిరే చెప్పుడు!" అని మరలఁ బ్రశ్నించితిని.

**అత** — ఆహ్నికకృత్యము లైన తరవాతఁ జెప్పెదను.

**నేను** — ఓహో! ఈమాట మీ నోటినుండియేనా? ఎన్నఁడు నిట్టి భాగ్యము పట్టలేదే! ఈసదాచార మెప్పటినుండి? ఆకస్మికముగా నీబుద్ధి యెట్లు పుట్టినది.

**అత** — ఆహ్నికములఁ దీర్చుకొని వచ్చి చెప్పెదను.

**నేను** — ఏమి ఆహ్నిక కర్మలు కూడనా? ఏమిమంత్రమును నేర్చుకొంటిరి? మీ దీక్షాగురువు లెవ్వరు? ఎవరు మీకీయుపదేశము గావించినారు? ఈదారి మీకెట్లు దొరకినది!

ఇన్నిమాటలవలీలగా నానోటినుండి వెడలినప్పుడు మునుపటి దినములైనచో నాస్వామి క్రోధోద్రిక్తుఁడై నామీఁద ననేకకటూక్తివిషబాణములను బ్రయోగించి ధిక్కరించి యుండును. అట్లుగాకున్నచో గోపము నడంచుకొని తనతప్పు దాచుకొని నవ్వుచు నేవో కల్లబొల్లి మాటలు చెప్పి తప్పించుకొనియైనఁ బోయియుండును. కాని యిప్పుడాతఁ డేమియు ననలేదు. అతిగంభీరవదనముతో, స్థిర తేజోమయ

తరళ నిష్కామనయనములతో, ద దేకదృష్టితో నా మొగమువంక జూడఁ దొడంగెను. చాలనిమిషములు జరిగిపోయినవి. నేనాతనిభావముంగాంచి మాటాడఁ జాలకపోయితిని. ఏమి యీభాగ్యము! నాయీజీవితమునం దాతని యిట్టి దివ్యమూర్తినెన్నఁడును గాంచియుండలేను. సకలేంద్రియములును యథానియతములై చిత్తవృత్తులన్నియు సమీహితములై ప్రాణాదివాయువులన్నియు యథోచితస్థానస్థితములై యున్నట్లు నాకుఁ దెలియనయ్యెను. ఆవిధముగా నెన్నినిమిషములు గడచెనో నాకు దెలియనేలేదు ! ఏమనిన — అంతకుముందు నేను గడియారమును జూచి యుండలేదు. ఏడెనిమిది నిమిషములై యుండు ననుకొందును. అంత నాతఁడు కంపితప్రాణములతో నిరుద్ధశ్వాసములతో నతికష్టోద్గత కంఠ స్వరముతో "చెప్పెదను వినుము. ఈదారిదొరుకుట కాధారము నీవు! నీవు నన్ను సమస్తజీవశక్తులను వినియోగించి ప్రాణపణముగ నారాధించి యభ్యర్థించి తుట్టతుదకు మహాబలముతో మహదాకర్షణము గావించి యిట్టిపవిత్రపథమునకుఁ బథికునిగాఁ బరిణమింపజేసితివి. నీకృపాకటాక్షమూలముననే జ్వాలామయంబగు పాపపథమును బరిత్యజించి యిట్లు మరలఁగలిగితిని. కాని నేను నీచెంతఁ జేరఁజాలకున్నాను. నీలోఁ గలయఁ జాలకున్నాను. నాయందు నిన్ను లీనముచేసికొనఁ జాలకున్నాను. దుస్సంగిని దుష్కర్ముఁడను నగునేను నీవంటిసతీమణికి—నీవంటి పుణ్యవతికి నానందము గల్పించి నీవలన సంపూర్ణానందము ననుభవించుట కర్హుఁడను గాకయున్నాను. అందుచేతనే నేను మహావిచారముతో మహానుతప్త హృదయముతో నొకమహాత్మునాశ్రయించి తత్సహాయసంపత్తిచే శారీరక మానసిక వ్యాధులనుండి విముక్తిలాభముంగాంచి యీరీతిగా నుద్ధరింపఁ బడితిని."

నేనాతనివంక భక్తిభావముతో దిలకించుచుంటిని. వాస్తవముగా నాతని పాపజ్వాల లారిపోయినట్లె యాతని యాకృతి విరాజిల్లుచు

నుండెను. అతనిదేహమునందు పుణ్యాళరత్కౌముదీ తేజము ప్రకాశించు చుండెను. అప్పుడు నాహృదయము దాంపత్య మధురామృతధారలచే నిండిపోయెను. నేనాతని పాదములపైఁ బడి పయ్యెద మెడకు జుట్టుకొని ప్రణామము గావించి యాతనిపాదధూళిని గ్రహించి యాపాదమస్తకమును విలిప్తము గావించుకొంటిని. ఆవెంటనే యాతఁడు నాచేయిపట్టుకొని లేవఁదీసి నాగండస్థలమునందు దాంపత్యమిళన చిహ్నములను పొదించి యానందసుధా సముద్రమున ముంచివైచెను.

మాయీపరస్పర సంభాషణమైన యనంతరముననే నానాథుఁడు తన యాహ్నికకృత్యములను నిర్వర్తించుకొన బోవుచు నన్నుద్దేశించి "నాకొక చిత్రాసనమును పంచపాత్రయు నుద్ధరిణియు సిద్ధముచేసి యిచ్చెదవా? ముద్రిత నయనములతో నేనిప్పుడు భగవానునింగూర్చి ప్రాణము పులకించునట్లు కృతజ్ఞతా నివేదనముం గావించెదను. నాకీసత్పథమును బ్రదర్శించిన గురువులెవ్వరని నీవు ప్రశ్నించితివి. నీకు సత్యము చెప్పుచున్నాను. నాకీజ్ఞానముం గల్పించిదానవునీవే. నాగురుమూర్తివి - కరుణామయుఁడగు నేపరమేశ్వరుఁడు నన్ననుగ్రహించి యంధకార బంధురములగు నాకన్నులను దెరపించి నాకీ సత్పథమును బ్రదర్శించెనో, యేదేవుడు సాధ్వీ శిరోమణివగు నిన్ను నాభార్యగాఁజేసి నిర్భాగ్యుఁడనగునన్ను మంచిమార్గమునకు మరలించునట్లు దివ్యశక్తివగు నిన్ను బ్రేరేపించెనో యట్టిభగవానునకు నేనొకసారి ప్రణామము గావించి కృతజ్ఞతా సూచకముగఁ బ్రార్థింపవలయును" అని చెప్పుచుఁ జెప్పుచుండఁగా నశ్రుధారలచే నా స్వామివక్షమంతయుఁ బ్లావితమై పోవుచుండెను. కంఠస్వరము రుద్ధమైపోయెను.

నేనును నాతని పాదపద్మములను బ్రాలి యుచ్చైస్స్వరమున నేడువనారంభించితిని. ఈవిధముగా గొంతసేపు గడచిపోయెను. నేను నాపతిదేహాత్మా హృదయ భావమును సంపూర్ణముగా నవగతము చేసి

కొని పడమటింటిలో దేవరపట్టునొద్ద నొక చిత్రాసనమును నవరించి యాపార్శ్వమున గంగాజల పూర్ణంబగు నొకపంచపాత్రను నుద్ధరిణియు నుంచితిని. ఉత్తరాభిముఖుఁడై కూర్చుండి నాప్రాణేశ్వరుఁడు నన్నుగూడ దనచెంత నుపవసింప నియోగించెను. నేనాతని వామపార్శ్వమునఁ గూర్చుంటిని. అప్పుడిరువురము నేకాగ్రచిత్తముతోఁ దదేకధ్యానముతో ముద్రితనయనములతో శ్రీభగవానుని కోమల చరణకమలములను స్మరించుచు నించుమించుగా నరగంట సేపు తన్మయులమై యుంటిమి.

మానవులకు జాగ్రదవస్థయందు స్వప్నములు గలుగవని నేనెఱుంగుదును. కాని యాయవస్థయందు మేమిరువురమును నిద్రలోనుంటిమో, జాగ్రత్తయందే యుంటిమో యెవ్వరమును తెలిసికొనఁ జాలకయే యుంటిమి. అప్పుడేదియో విరాట్స్వరూపము — విశ్వమోహనమూర్తి మాకుసాక్షాత్కరించి మాశ్రవణ యుగళమునందు "మీకిఁక భయము లేదు. మానవుఁడు జరామరణ శీలంబగు నశాశ్వతదేహ ధారణముం గుగావించియే చరమా కాంక్షితము ననుభవించుటకుఁ బ్రయత్నము నుగావించుచుండునో యట్టిపరమానందము మీకిప్పుడు కరతలామలకమైనది." అని చెప్పుచున్నట్లయ్యెను.

స్నం అనంతర మా దివ్యమూర్తి నాస్వామికి దర్శన మొసంగి "నీవు నిరంతరమును బాపాచరణమునందే నీజీవితమునంతను వినియోగించితివి. ప్రకృత మీపశ్చాత్తాపానల జ్వాలలవలన నీసమస్త పాపములును దృణరాశివలెమండి బూడిదయైపోయినవి. నీశరీరమిప్పుడు పుణ్యాపూతమైనది. నీ విఁక స్వేచ్ఛగా నీధర్మజీవితమును గడపుకొనుచు భగవత్తత్త్వవేదులగువార లనుసరించుమార్గమునుబట్టి తుద కానందధామమును జేరు కొందువుగాక!" అనిబోధించి యావిరాట్పురుషుఁడు వేఱుగ నన్నుద్దేశించియిటులనియెను. "సాధ్వీశిరోమణీ! నీవంటికులలక్ష్మిలీ లోకమునం

దనేక సత్కార్యములను గావించి జగము నుద్ధరించుటకై యవతరించుచుందురు. జలమగ్నమగు నొక్క చీమ నుద్ధరించినంతమాత్రమున మానవుఁడు పుణ్యాత్ముఁడనుప్రశంసకు నర్హుఁడై యుండును. అట్టిచో నధఃపతనమునఁ జరమావధిం గాంచి శునకసృగాలములకు గూడ నంటరానంతటి కలుషజీవియైపోయిన మానవుని దుష్పథము నుండి యుద్ధరించువారు మానవులేయైయున్నను వారిని దేవతామూర్తులని సంకీర్తించుటలో నతిశయోక్తి యేమున్నది? అమ్మా! నీవు వాస్తవముగా స్వశక్తిచే దేవతామూర్తివై జీవితకాలమంతను ననంతక్లేశముల ననుభవించుటకు నహించి నీస్వామిని సాక్షాన్నారాయణునిగా భావించి సేవించితివి. ఆపూజాఫలమువలననే నీకిహలోకమున నమస్త సంపల్లాభమైనది. నీవు పరలోకమునందును నక్షయానంతసుఖశాంతుల ననుభవింపఁగలవు. అన్యదేవతలను బూజించుటకుఁ బత్రములు పుష్పములు ఫలములు జలములు మొదలగుసాధనసామగ్రి యంతయును గావలసియుండును. కాని నీవు ప్రాణపుష్పములతో నిత్యమును బతిదేవతను బూజించుచు బతిదేవతనే పరమేశ్వరునిగా భావించి యారాధింపఁగలిగితివి. ఓగుణవతీ! ధర్మమతీ! సుకృతీ! సతీ! ఇదియే చిరస్థాయినియు నవినశ్వర ఫలప్రదాయినియు నగునీ —

“ ప తి పూ జ ”

బ్ర హ్మా ర్ప ణ మ స్తు

స ం పూ ర్ణ ము

ఈ "పతిపూజ" రచించినవారును

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులలో నొకరును

సుప్రసిద్ధులు నగు

కవిరాజహంస - కవికులాలంకార

# శ్రీ వొ లేటి పార్వతీశము గారు

తెనిఁగించిన ఇతర పుస్తకములు ఈ దిగువ చూపబడినవి

| | |
|---|---|
| శుభయోగము | ప్రేమలీల |
| అదృష్టము | గుప్తశత్రువు |
| శైవలిని | మహాముహూర్తము |
| కపాలకుండల | మహాశ్వేత |
| సైనికపత్ని | దుష్టగ్రహము |
| దేవీచౌధురాణి | అడ్డు—గీత |

మా పుస్తకముల క్యాటలాగు చూడండి

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము